### కమనీయ క్షేత్రం

# కపిలతీర్థం

జూలకంటి బాలసుబ్రహ్మణ్యం





తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2003

కమనీయ క్షేత్రం

# కపిలతీర్థం

రచన
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం
ఉపసంపాదకులు
తి.తి. దేవస్థానములు, తిరుపతి.




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2003

Kamaneeya Kshetram

# KAPILATIRTHAM

By

**Julakanti Balasubrahmanyam**

T.T.D. Religious Publications Series No.262



First Edition : 2003

Copies : 2000



Published by

Sri Ajeya Kallam, I.A.S.,

Executive Officer,

Tirumala Tirupati Devasthanams,

Tirupati - 517 507.

Printed at

T.T. Devasthanams Press

Tirupati - 517 507.

# ముందుమాట

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీ వేంకటేశ్వరుడు వెలసిన దివ్యక్షేత్రం వేంకటాచలం ఈ పుణ్యస్థలం భూలోక వైకుంఠమని ప్రశస్తి పొందింది ఇచ్చట సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు శ్రీ వేంకటేశ్వరునిగా ఆవిర్భవించి, అర్చనలందుకొంటున్నాడు ఈ స్వామివారిని కేవలం మానవులు మాత్రమేగాక పరమశివుడు, బ్రహ్మేంద్రాది దేవతలు కూడా నిరంతరం సేవిస్తుంటారు ప్రతిరోజు శ్రీ వేంకటేశ్వరస్వామిని సుప్రభాతానికి ముందుగా బ్రాహ్మీముహూర్తంలో బ్రహ్మదేవుడు ఆరాధిస్తాడని ప్రసిద్ధి వుంది అంతేకాక ప్రతి సంవత్సరం కన్యా మాసంలో పదినాళ్లపాటు శ్రీనివాసునికి బ్రహ్మదేవుని పేరుతో ఉత్సవాలు నిర్వహింపబడుతున్నాయి అవే బ్రహ్మోత్సవాలు

ఇక పరమేశ్వరుడు తిరుమల శ్రీవారి ఆలయంలో క్షేత్రపాలకశిలగాను, గోగర్భతీర్థంలో క్షేత్రపాలక గుండుగాను వుంటూ తిరుమలక్షేత్రాన్ని పాలిస్తున్నాడు ప్రతి మహాశివరాత్రి పర్వదినంనాడు గోగర్భంలోని క్షేత్రపాలకుడైన రుద్రునికి నమక చమక రుద్రాభిషేకం జరుబడుతున్నది ఈ మహేశ్వరుడు వేంకటాచల పాద సమీపంలో వున్న కపిలతీర్థ క్షేత్రంలో 'కపిలేశ్వర మహాశివలింగం' రూపంలో స్వయంభువుగా ఆవిర్భవించి వున్నాడు కపిలేశ్వరుడు భక్తవశంకరుడు, శుభంకరుడు, పాపహరుడు కూడా ఈ స్వామి, శ్రీనివాసునికి, నారాయణవనాన్ని పాలించే ఆకాశరాజు పుత్రిక అయిన శ్రీ పద్మావతీ అమ్మవారికి పరిణయం జరుగునట్లుగా అనుగ్రహించిన కల్యాణ వరప్రదాత అనగా శ్రీ వేంకటాచలం ఎంత ప్రాచీనమైనదో, ఆ క్షేత్ర పాదమూలంలో వెలసిన శ్రీ కపిలేశ్వరస్వామివారు అంతకంటే ప్రాచీనుడు ఈ కపిలేశ్వరుడు ముందుగా తనను దర్శించిన తిరుమల యాత్రికులను పాప దూరులనుగా చేస్తాడట. కపిలేశ్వరుని వల్ల పాపవిముక్తులైనవారికి, వేం అమృ తత్వమును, కటః ఐశ్వర్యమును అనగా ఐహిక ఆముష్మికాలను ప్రసాదిస్తాడట తిరుమలేశుడు

తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో, అందులోను తిరుమల క్షేత్రం క్రింది భాగంలో వెలసిన కపిలతీర్థం ప్రసిద్ధమైన, ప్రాచీనమైన శైవక్షేత్ర రాజం. ఈ క్షేత్రాన్ని గురించి, ఇచ్చట స్వయంభువుగా వెలసిన శ్రీ కామాక్షీ సమేత కపిలేశ్వరస్వామివారిని గురించి ఇతర పరివార దేవతలను, అక్కడ జరిగే సేవలను గురించి ఈ పుస్తకంలో రచయిత శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం వివరంగా తెలియ జేశారు ఈ క్షేత్రాన్ని గురించి వెలువడిన తొలిగ్రంథం ఇది

తిరుమల యాత్రికులు, భక్తులు కపిలతీర్థాన్ని గురించి వివరంగా తెలుసుకొని మరింత భక్తి ప్రపత్తులతో సేవించి కృతార్థులు కావాలనే సంకల్పంతో ఈ గ్రంథాన్ని 'చిత్రభాను' నామ సంవత్సరం, ''మహాశివరాత్రి'' పర్వదినం సందర్భంగా, భక్త జనులకు కానుకగా సమర్పిస్తున్నాం

తిరుమల తిరుపతి దేవస్థానం అందిస్తున్న ఈ ధార్మిక ప్రచురణ ఆస్తిక మహాశయులను అందరినీ ఆకర్షించి, ఆనందింపజేయగలదని మా ఆకాంక్ష!

తిరుపతి
తేది 28-2-2003

**అజేయ కల్లం**
కార్యనిర్వహణాధికారి
తి తి దేవస్థానములు

# కృతజ్ఞతాంజలి

"కోటి జన్మ కృతైః పుణ్యైః
శివే భక్తిః ప్రజాయతే"

కోటి జన్మల్లో పుణ్యం చేసుకొన్న వారికి మాత్రమే పరమేశ్వరుని యందు భక్తి కలుగుతుంది

నాకు కొండలరాయుడు అంటే ఎంతో భక్తి మరి కొండక్రింది రేడు కపిలేశ్వరుడు అంటే కూడ అంతే ప్రీతి

1978 లో ఉద్యోగం రాక సతమతమవుతున్న రోజులవి ఎవరో అన్నారు 'కపిలేశ్వరుని సేవించుకోవయ్యా! నీ సమస్య తీరుతుందని' 1 9 7 8 డిశంబరు మధ్యలో దీక్షగా పట్టుమని పదిరోజులు కపిలేశ్వరుని సేవించుకొన్నా అంతే అనతికాలంలోనే కపిలేశ్వరుడు కొండలరాయని కొలువులో చేర్పించాడు అప్పటి నుండి అంచెలంచెలుగా ఉద్యోగాభివృద్ధిని కలిగిస్తూనే వున్నాడు శుభ పరంపరలను ప్రసాదిస్తూనే వున్నాడు ఇవన్నీ తిరుమల క్షేత్ర పరిపాలకుడైన పరమశివుని సిఫారసుతో తిరుమల క్షేత్రాధి దైవమైన శ్రీ వేంకటేశ్వరుడు ప్రసాదించాడని నా ప్రగాఢ విశ్వాసం శ్రీ వేంకటేశ్వరస్వామి 'ఉపత్యకా ప్రదేశస్థ శంకర ధ్యాతమూర్తి' కాగా కపిలేశ్వరస్వామి, పద్మావతీశ్రీనివాసుల పరిణయ సంధానకర్త అందువల్లే రూపాలు వేరైనా అభిన్నులైన ఆ కొండమీది పెరుమాళ్ళు అన్నా, కొండ క్రింది దేవర అన్నా నాకు చాల ఇష్టం

తరచుగా నేను కపిలతీర్థం వెళుతూనే వుంటాను ఆ క్షేత్రంలో నన్ను మిగుల ఆకట్టుకొన్నది ఉత్సవ ప్రతిమా మండపంలోని 'శ్రీసోమాస్కందమూర్తి' కైలాసం వలె చుట్టూ ప్రమథ గణాలతో విరాజిల్లుతూ ఆ మండపం మధ్యలో వున్న ఈ మూర్తిని చూచాను కాని పేరేమిటో తెలియదు ఆసక్తిగా అర్చకస్వామిని అడిగాను ఉమాదేవితోను, స్కందునితోను కలిసివున్న పరమేశ్వరుడు కనుక 'సోమాస్కందమూర్తి' అంటారనీ, ఈ ముగ్గురు ఎప్పుడూ విడదీయబడక ఒకే

పీఠంలో వుంటారనీ, ఈయనే కపిలేశ్వరస్వామివారి ప్రధాన ఉత్సవమూర్తి అనీ అర్చకవర్యులు వివరించారు. తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులిరువురి నడుమ ప్రేమగా, గోముగా ముద్దుగా, మురిపెంగా దోగుతున్న బాలుడైన కుమారస్వామిని ఆశ్చర్యంతో చూస్తూ ఆనందించాను ఇంతవరకు నాకు తెలియని ఈ విశేష విషయాన్ని అందరికీ తెలియజేయాలన్న ఆలోచన కలిగింది. కాని ఆ ఆలోచన చాలాకాలం ఆలోచనగానే మిగిలిపోయింది

ఆరు నెలల క్రితం నా ఆలోచనను అక్షరాత్మకంగా చెయ్యాలని కపిలేశ్వరుడు సంకల్పించాడు కాబోలు! దేవస్థానం అధికారులు కపిలతీర్థాన్ని గూర్చి ఒక చిన్న పుస్తకం రాయవలసిందని కోరారు శ్రీ కపిలేశ్వరస్వామివారి దివ్యసంకల్పానికి ఆశ్చర్యపోతూ అమితానందం పొందాను. ఈ కార్యానికి నన్ను ఎన్నుకొన్నందులకు శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారిని భక్తిప్రపత్తులతో శరణు వేడుతూ ఈ రచనా కార్యక్రమాన్ని కూడా సులువుగా కొనసాగింప చేయలసిందని ప్రార్థించాను వారి భవ్యానుగ్రహం వల్లనే అక్షరాత్మకంగా వికసించిన ఈ చిన్ని పుస్తకసుమాన్ని జగన్మాతా పితరులయిన శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారల దివ్యచరణారవిందములకు సమర్పిస్తున్నాను

ఈ రచనా ప్రయత్నంలో కపిలతీర్థంలోని ఆయా ఆలయాల అర్చక స్వాములు, వేదపండితులు ఆలయంలోని విశేషాలు, విగ్రహమూర్తుల ప్రాధాన్యతలను, ఉత్సవాల వివరాలతో పాటు మరెన్నో విషయాలను ఓపికగా తెలియజేశారు వారందరికీ భక్తి పూర్వక నమస్కారములు

తి తి దేవస్థానం వారి వేంకటాచలమాహాత్మ్య గ్రంథాలు, శ్రీ ఎం.వి రామనాథ ఘనాపాఠిగారు రచించిన 'శ్రీ కపిలేశ్వర సుప్రభాతమ్', శ్రీశైల దేవస్థానం వారి 'శ్రీశైలప్రభ' రజతోత్సవ సంచిక, ఆంధ్రప్రదేశ్ దేవాదాయశాఖ ప్రచురించిన 'రూపధ్యానరత్నావళి' . . ఇత్యాది గ్రంథాలెన్నో యీ రచనకు ఉపకరించాయి. ఆ యా గ్రంథాల రచయితలకు, వ్యాసకర్తలకు నా కృతజ్ఞతాంజలులు

ఆ యా దేవాలయాల ఉత్సవాలను, ఊరేగింపులను ఘనంగా నిర్వహింప జేయడంతోపాటు, వాటిని గూర్చి యాత్రికులకు, భక్తులకు తెలియ జెయ్యాలనే మహదాశయంతో ఈ గ్రంథాన్ని తి తి దేవస్థానం వారి ధార్మిక ప్రచురణగా వెలువరింపజేసి, భక్త జనలోకానికి కానుక పెట్టిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారులు, భక్త జన సేవాతత్పరులు, సుగృహీత నామధేయులైన శ్రీఅజేయం కల్లం, ఐ ఎ ఎస్ గారికి భక్తి పూర్వక నమోవాకములు

తి తి దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారులు, సౌజన్య మూర్తులు, భక్తి తత్పరులు అయిన శ్రీ ఆర్ అప్పారావు గారు ఈ ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ విషయంలో చాలా ప్రోత్సాహం చేశారు వారికి భక్తి పూర్వక నమస్కారములు

ఆధ్యాత్మిక గ్రంథ రచనా విషయంలో ఏ మాత్రం అలసత్వం ఉండకూడదని వెన్నుతట్టి ఉత్సాహపరచడమేగాక, ఈ గ్రంథ ముద్రణ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ వహించిన తి తి దేవస్థానం పౌరసంబంధాధికారి డా॥ పి రంగారావు గారికి కృతజ్ఞతాపూర్వక వందనములు

కపిలతీర్థంలో విషయ సేకరణకు అత్యంత దోహదం చేసిన ఆలయ డిప్యూటి ఇ ఓ శ్రీ రామారావుగారికీ, ఎ ఇ ఓ శ్రీ తిమ్మారెడ్డిగారికి, సూపరింటెండెంట్ శ్రీ కె మునిరామయ్య గారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు

ఈ రచనకు అనేక విధాలుగా తోడ్పడి, సహకరించిన 'సప్తగిరి' ఎడిటర్ డా॥ ఎన్ ఎస్ రామమూర్తిగారికి, ఇన్‌ఛార్జి ఎడిటర్ శ్రీ వి శ్రీశన్ గారికి నా నమస్కారములు

అత్యంత శ్రద్ధాసక్తులతో ఈ గ్రంథాన్ని చక్కగా తీర్చిదిద్ది, ముద్రించిన తి తి. దేవస్థానం ప్రెస్ మేనేజరు శ్రీ ఐ పార్వతీశ్వరరావుగారికి, వారి సిబ్బందికి పేరుపేరునా నా కృతజ్ఞతాంజలులు

ఆస్తిక మహాశయులు ఈ గ్రంథాన్ని కపిలేశ్వరుని ప్రసాదంగా అందుకొని ఆస్వాదించగలరని ఆశిస్తున్నాను

నా పరిశీలనకు ఇంకా ఏవైనా విశేషాలు లభ్యమైనచో వాటినీ మలిముద్రణలో చేర్పించగలనని, అలాగే అచ్చుతప్పులను కూడ సరిదిద్దగలనని తెలియజేస్తున్నాను

''త్రికరణ శుద్ధిగా చేసిన పనులకు
దేవుడు మెచ్చును లోకము మెచ్చును'' - అన్నమయ్య

తిరుపతి
తేది 24-2-2003

రచయిత
**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

# కపిలతీర్థం

తిరుపతి నుంచి తిరుమలకు వెళ్ళేదారిలో వేంకటాచల పర్వత మూలంలో వెలసి ఉన్న ప్రాచీనమైన పుణ్యతీర్థం ''కపిలతీర్థం'' ఈ దివ్యతీర్థం ''సుదర్శన చక్రత్తాళ్వార్ తీర్థం'' అని, ''చక్రత్తాళ్వారు తీర్థం'' అనీ, ''ఆళ్వారుతీర్థం'' అని కూడా పిలువబడుతున్నది

శేషాచలపర్వత సానువులలో నెలకొన్న అనేక పవిత్రతీర్థాల నుండి జాలువారిన పవిత్ర జలధారలతో కపిలతీర్థం అనే సరోవరం ఏర్పడింది దాని ప్రక్కనే తూర్పున పశ్చిమాభిముఖంగా స్వయంభువుగా ఆవిర్భవించిన శ్రీ కపిలేశ్వర మహాశివలింగం యొక్క గుహాలయం ఉంది ఆ కోనేటికి దక్షిణదిక్కున ఉత్తరాభిముఖంగా శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం నిర్మింపబడింది దీనిప్రక్కనే తూర్పుముఖంగా శ్రీ లక్ష్మీనారాయణ స్వామి కూడా వెలసి వున్నాడు అంతేగాక ఈ కపిలతీర్థానికి పశ్చిమ తీరంలో తూర్పుముఖంగా శ్రీ లక్ష్మీనరసింహస్వామి ప్రతిష్ఠింపబడిన 'నరసింహగుహ'ను కూడా చూడవచ్చు ఇలా ఈ కపిలతీర్థ పుణ్యస్థలం ఎన్నో తీర్థాలతోను, శైవ వైష్ణవ ఆలయాల సమ్మిశ్రితమై, అత్యంత మహిమాన్వితమైన తీర్థరాజంగాను, అతి ప్రాచీనమైన క్షేత్రంగాను విరాజిల్లుతూ వున్నది.

తిరుపతి రైలుస్టేషన్‌కు – శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయానికి ఉత్తరం దిక్కుగా సుమారు మూడు కిలోమీటర్ల దూరాన కపిలతీర్థం నెలకొని వుంది.

మూడువైపులా ఎత్తైన కోటగోడలవలె శేషాచల పర్వతశిఖరాలు వ్యాపించి వుండగా ఆ పర్వతసానువుల నుండి జాలువారుతున్న మనోహరమైన జలపాత దృశ్యంతో కూడి వున్న ఈ క్షేత్రాన్ని దర్శించిన భక్తులకు మైమరపుతో కూడిన భక్తితోపాటు అనిర్వచనీయమైన ప్రశాంతత చేకూడుతుంది.

ఈ పుణ్యతీర్థంలో స్నానధ్యానాదులతోను, ఇక్కడ వెలసి వున్న శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారల దర్శన అర్చనాదులతోను సకల పాపాలు తొలగుతాయని సర్వశ్రేయస్సులు కలుగుతాయని క్షేత్ర ప్రసిద్ధి అందువలననే ఈ దివ్యక్షేత్రం ఎల్లప్పుడూ భక్త జన సందోహంతో సందడిగా వుంటుంది అంతమాత్రమే కాదు తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించడానికి వచ్చే యాత్రికులు, తప్పనిసరిగా కపిలతీర్థపుణ్యక్షేత్రాన్ని దర్శించి తీర్థవిధులు నిర్వర్తించి పాపదూరులైన తర్వాతనే వేంకటాచలయాత్ర చేయవలెనని ఈ స్థలపురాణం స్పష్టం చేస్తోంది అందువల్లే భక్తులు, యాత్రికులు నేటికీ వేంకటాచలపర్వతం మొదట్లో వున్న కపిలతీర్థాన్ని సందర్శించిన తర్వాతనే తిరుమల కొండకు వెళతారు

మరి అనాదిగా ఇంతటి పురాణప్రసిద్ధిని పొందినటు వంటి ఈ క్షేత్రానికి 'కపిలతీర్థం' అని పేరు ఎందుకు కల్గింది కపిలుడు ఎవరు? ఆయన పేరుతో ఇక్కడ శివలింగం ఎందుకు వెలిసింది ఎలా తెలిసింది ఈ తీర్థ క్షేత్ర మహిమలు ఏవైనా వున్నాయా? అని అనేకానేక విషయాలను తెలుసుకోవాలి అనే అత్యంత జిజ్ఞాసతో ఒకప్పుడు శౌనకాది మహర్షులు సూతుడనే మునిని అడిగారట! అందులకు సూతమహాశయుడు ఈ క్షేత్ర ప్రాధాన్యాన్ని మహత్వాన్ని గూర్చి సవిస్తరంగా వివరిస్తాను వినండి అంటూ ఇలా ప్రారంభించాడు

## కపిలమహర్షి

శ్రీ మహావిష్ణువు ఆనతిపై బ్రహ్మదేవుడు స్త్రీ పురుష సంయోగాత్మకమైన సృష్టిని ప్రారంభిస్తూ, అందుకు నాందిగా తన శరీరంలోని కుడిభాగం నుండి ''స్వాయంభువ మనువు'' అనే పురుషుణ్ణి, ఎడమభాగం నుండి 'శతరూప' అనే స్త్రీని సృష్టించి వారిరువురిని భార్యాభర్తలుగా చేశాడు ఆ ప్రథమ మానవ దంపతులకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, అనే ఇద్దరు పుత్రులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు పుత్రికలు కలిగారు మను చక్రవర్తి వీరందరికి పెండ్లి చేశాడు కూడ.

అందులో రెండవ కూతురైన దేవహూతిని కర్దమ ప్రజాపతికి ఇచ్చి వివాహం చేశాడు. బ్రహ్మదేవుని ఆదేశంచేత కర్దమ ప్రజాపతి, భార్యతో కూడి సరస్వతీ నదీతీరాన ఆశ్రమం ఏర్పరచుకొని శ్రీ మహావిష్ణువునిగూర్చి పదివేలఏండ్లు తపస్సు చేశాడు శ్రీహరి అనుగ్రహం వలన వారికి వరుసగా కల, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఊర్జ్య, చితి, ఖ్యాతి అనే తొమ్మిదిమంది పుత్రికలు కలిగారు కర్దముడు ఈ కూతుళ్లను వరుసగా మరీచి, అత్రి, అంగీరసాదిగా తొమ్మిదిమంది మహామునులకు ఇచ్చి వివాహం చేశాడు

చిట్టచివరగా కర్దమ ప్రజాపతికి సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువే 'కపిలుడు' అనే పుత్రునిగా అవతరించాడు

విష్ణ్వంశ సంభూతుడైన కపిలమహర్షి తన తల్లిదండ్రులకు సాంఖ్య భక్తి యోగాలను ఉపదేశించి వారికి ముక్తిని ప్రసాదించినాడు

**తతో హరిః కపిలత్వం అవాప, తిరోహితాన్ కాలబలేన తత్త్వాన్**
**చతుర్వింశ త్సంఖ్యాకానుద్ధరిష్యన్, చరిష్యన్త్యె ఆసురయే ప్రవక్ష్యమ్**

- *(గారుడ పు. అధ్యా15 - శ్లో12)*

కాలాంతరంలో మెరుగైన ఇరవై నాలుగు తత్త్వాలను ఉద్ధరించి, ఆసుర ఋషికి ఉపదేశించడానికే సాక్షాత్తు శ్రీహరి కపిలమహర్షిగా అవతరించినాడని కూడా గరుడ పురాణం పై విధంగా తెలుపుతోంది

పిదప కపిలమహర్షి పాతాళలోకంలో ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకొని అక్కడ ఒక అద్భుతమైన శివలింగాన్ని ప్రతిష్ఠించుకొని, శివుణ్ణి ఆరాధిస్తూ తీవ్రమైన తపస్సులో మునిగి వుండినాడు

ఇదే సమయంలో సగరుడు అను చక్రవర్తి అశ్వమేధయజ్ఞాన్ని చేయ సంకల్పించి అందుకోసం గుర్రాన్ని వదలి పెట్టాడు ఇంద్రుడు పదవీ భీతితో, ఆ యజ్ఞాన్ని భంగం చేయుటకుగాను ఆ గుఱ్ఱాన్ని తస్కరించి, పాతాళలోకంలో తపస్సు చేసుకుంటున్న కపిలమహర్షి ఆశ్రమంలో ఒక చెట్టుకు కట్టి వెళ్లిపోయాడు సగర పుత్రులు ఆ అశ్వాన్ని వెదుకుతూ చివరకు పాతాళాన్ని చేరుకొని అక్కడ కపిలాశ్రమంలో వున్న అశ్వాన్ని చూచారు దాన్ని కపిలుడే దొంగిలించి వుంటాడని భావించిన సగరపుత్రులు అతనిని చంపటానికి ప్రయత్నించారు. అంతలో కనులు తెరచి కోపంగా చూచిన కపిలమహర్షి వాడి చూపులకు సగరపుత్రులు బూడిద అయ్యారు

ఈ విషయాన్ని తెలిసికొన్న సగరుడు, యజ్ఞం ఆగిపోవడమేగాక, తన పుత్రులకు కలిగిన దుర్మరణానికి చింతిస్తూ పుత్రశోకంతో మరణించాడు. తరువాత చాలాకాలానికి సగరుని మనుమడు అంశుమంతుడు, కపిల మహర్షిని తమ పెద్దలు చేసిన తప్పును క్షమించమని ప్రార్థించి, అశ్వాన్ని తీసుకువెళ్లి అశ్వమేధ యాగాన్ని మాత్రం పూర్తి చేశాడు కాని తన పూర్వులైన సగరపుత్రులకు ఊర్ధ్వలోకాలు కల్పించలేకపోయినాడు. తదుపరి అంశుమంతుని పౌత్రుడు, దిలీపుని పుత్రుడు అయిన భగీరథుడు తీవ్రమైన తపస్సు చేసి, పరమేశ్వరుని జటా జూటంలోని గంగను భూమిపైకి అవతరింప జేసి, అదే గంగను పాతాళ లోకానికి తీసుకొని వెళ్లి సగరపుత్రుల భస్మరాసులపై ప్రవహింపజేశాడు దానిద్వారా వారందరికి ఉత్తమలోకాలు ప్రాప్తించాయి.

అలా భగీరథుని ప్రయత్నంవల్ల గంగాదేవి శంభుని శిరస్సునుండి భూమికి, అక్కడినుండి పాతాళ లోకానికి ప్రవహించింది అలా అవతరించిన గంగ భూలోకంలో ''భాగీరథి''గా, పాతాళ లోకంలో ''భోగవతి''గా ప్రసిద్ధి పొందింది

## కపిలేశ్వర మహాలింగం - కపిలతీర్థం

ఆ పాతాళ లోకంలో 'భోగవతి'గా పేరు పొందిన గంగానది ఒడ్డున వున్న ఆశ్రమంలో కపిలుడు పూజిస్తున్న మహాశివలింగం వింత వింత తేజస్సులతో ప్రకాశిస్తూ వుండడమేగాక, రోజు రోజుకు అద్భుతావహంగా ఆ శివలింగం ఊర్ధ్వముఖంగా పెరుగుతూ భూమిని కూడ చీల్చుకొని చివరకు వేంకటాచల క్షేత్ర మూలంలో స్వయంభువై వెలసింది ఇంకా ఇంకా పెరుగుతున్న అద్భుతమైన ఆ శివలింగాన్ని ఇకమీదట పెరగకుండా చేయవలెనని సంకల్పించిన శ్రీ మహావిష్ణువు గోపాలుడుగా మారి రక్షిస్తుండగా, బ్రహ్మదేవుడు కపిలధేనువుగా మారి ఆ శివలింగం మీద అనంతమైన క్షీరధారలను కురిపించి, అభిషేకం చేస్తూ ఇరువురూ అనేక విధాల ప్రార్థించారు అంతటితో పాతాళ లోకంనుండి విపరీతంగా పెరుగుతూ వున్న ఆ మహాశివలింగం, వేంకటాద్రి పర్వతమూలంలో ఏర్పడిన గుహలో స్వయంభువుగా నిలిచింది.

పాతాళలోకం నుండి భూమిని పెకలించుకొని వచ్చిన ఆ శివలింగంతో పాటు, పక్కనే వున్న ''భోగవతి'' గంగ కూడ పెల్లుబికింది

స్వయంభువుగా ఆవిర్భవించిన ఆ పాతాళ శివలింగాన్ని అక్కడే ఉద్భవించిన భోగవతీ తీర్థ జలాలతో దేవతలందరూ అభిషేకాలు చేసి పూజలు నిర్వహించారు

ఈ శివలింగాన్ని తొలుత పాతాళంలో కపిలమహర్షి పూజించినందువల్ల ఈ శివుడికి ''కపిలేశ్వరుడు'' అని, ''కపిలేశ్వర మహాశివలింగం'' అని ప్రసిద్ధమైన పేర్లు ఏర్పడ్డాయి అలాగే ఈ కపిలేశ్వరుని సన్నిధిలో పెల్లుబికిన ''భోగవతి'' గంగ ''కపిలతీర్థం''అనే పేరుతో పరమపావన తీర్థరాజంగా ప్రసిద్ధికెక్కి, తనలో స్నానం చేసిన వారినందరినీ ఘోర పాపాలనుండి విముక్తులను చేస్తూ పునీతం చేస్తున్నది ఆ కపిలతీర్థంలో వెలసిన శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారు, భక్తుల పాలిటి ఆర్త రక్షకుడై సమస్త పాపాలను పరిహారం చేస్తూ సకల సౌభాగ్యాలను ప్రసాదిస్తున్నాడు - అని సూతమహర్షి శ్రీ కపిలేశ్వరక్షేత్ర ఆవిర్భవాన్ని గూర్చి వివరించి, ఇంకా ఇట్లా అన్నాడు

కపిలతీర్థం యొక్క మహత్యాన్ని తెలియజేసే వృత్తాంతాన్ని మీకు ఇపుడు చెప్తాను శ్రద్ధగా వినండి మరి!

## ఆత్మారాముడు

పూర్వం మధ్యదేశంలో సదాచార సంపన్నుడయిన ఆత్మారాముడు అనే సత్‌విప్రుడు భక్తి ప్రపత్తులలో ఉదారంగా అతిథి అభ్యాగతులను సత్కరిస్తుండేవాడు ఆయన నిత్యాన్నదానంతోపాటు తన దైనందిన ఆధ్యాత్మిక కార్యక్రమాలను ఆచరిస్తూ ఉత్తమ గృహస్థుగా కాలం గడుపుతూ వుండినాడు ధారాళమైన బుద్ధితో ఆచరించిన దానధర్మాల వల్ల పెద్దలు చేర్చిపెట్టిన ఆస్తి అంతా కొన్నాళ్లకు తరిగిపోయి కటిక దరిద్రుడయ్యాడు ఆ దరిద్రంతో పాటు అనేక కష్టనష్టాలకు లోనయ్యాడు దానితో తాను వుండిన ఊరును విడిచి పెట్టి దేశమంతా సంచరిస్తూ వుండినాడు.

అలా తిరుగుతూ తిరుగుతూ ఒకప్పుడు వేంకటాచల క్షేత్రానికి దిగువన గల 'కపిలతీర్థం' చేరుకొన్నాడు ఆ తీర్థంలో స్నానాదులు ముగించుకొని కపిలేశ్వరస్వామివారిని దర్శించినాడు పిదప వేంకటాద్రి పర్వతాన్ని ఎక్కుతూ ఆత్మారాముడు, దారిలో వున్న శక్రతీర్థం, విష్వక్సేనతీర్థం, పంచాయుధతీర్థాలు, అనలతీర్థం, బ్రహ్మతీర్థం, సప్తర్షితీర్థాలు, ఇలా కపిలతీర్థంతో కలిపి మొత్తం

పదిహేడు పుణ్యతీర్థాల్లో పుణ్యస్నానాలు చేశాడు. ఆ దారిలోనే ఒక గుహలో తపస్సు చేస్తూ వుండిన సనత్కుమారుడను మహర్షిని సందర్శించి, తన కథను అంతా విన్నవించుకొని తన కష్టాలు తొలగే తరణోపాయం తెలియజేయు వలసిందని ఆత్మారాముడు ప్రార్థించినాడు. అప్పుడు సనత్కుమారుడు "నీవు గడచిన జన్మల్లో అనేక పాపాలు చేశావు అందువల్లే అనేక కష్టనష్టాలకు లోనయ్యావు అయితే ఆ పాపాలన్నీ కూడ కపిలతీర్థంలో స్నానం చేసినందువల్ల పూర్తిగా నశించి పోయాయి ఇక ఇప్పుడు నీకు సకల సంపదలు కలగడానికై లక్ష్మీదేవి అనుగ్రహం తప్పక కావాలి ప్రస్తుతం ఆ మహాలక్ష్మి వేంకటాద్రి క్షేత్రంలో లీలామానుష రూపంలో విహరిస్తూ వున్న శ్రీ మహావిష్ణువు యొక్క వక్షః స్థలంలో "వ్యూహలక్ష్మి" గా కొలువై వుంది ఆ జగన్మాతను భక్తితో ఉపాసించినట్లయితే, ఆమె కరుణ తప్పక నీపై ప్రసరిస్తుంది నీ కోరిక తప్పక సిద్ధిస్తుంది" అని అంటూ ఒక మహామంత్రాన్ని ఉపదేశించి, ఈ మంత్రం చాలా మహిమాన్వితమైనదనీ, నియమనిష్ఠలతో భక్తి ప్రపత్తులతో అమ్మవారిని ప్రార్థించవలసిందని ఆశీర్వదించి పంపినాడు

ఆత్మారాముడు తిరుమల చేరిన తర్వాత స్వామిపుష్కరిణిలో స్నానం చేసి, లీలామానుషరూపుడై సంచరిస్తున్న శ్రీ వేంకటేశ్వరస్వామిని, ఆయన వక్షఃస్థలం మీది లక్ష్మీదేవిని నియమ నిష్ఠలతో ఉపాసించినాడు. అతని భక్తికి సంతసించిన శ్రీ స్వామివారు శ్రీ మహాలక్ష్మితో కూడ ప్రత్యక్షమై ఇష్టార్థసిద్ధిని ప్రసాదించినాడు" అని సూతుడు వివరిస్తూ, కేవలం స్నానం మాత్రం చేతనే సర్వపాపాలను, సమస్త దోషాలను, రోగాలను తొలగించగల కపిలతీర్థ మహత్వాన్ని తెలియజేశాడు

పై విధంగా సూతుడు వివరించిన కపిలతీర్థ ఆవిర్భావాన్ని ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని గూర్చి విని శౌనకాది మహర్షులు చాలా ఆనందిస్తూ "స్వామీ! సూతమహాశయా! ఇంతకుముందు ఆత్మారాముని వృత్తాంతంలో కపిలతీర్థంతో పాటుగా పదిహేడు తీర్థాలను గూర్చి నామమాత్రంగా ప్రస్తావించారు కదా! వాటిని గూర్చి వివరంగా మాకు తెలియజేయండి. అంతమాత్రమే కాదు. అసలు వేంకటాద్రి క్షేత్రంలో ఎన్నో తీర్థాలు ఉన్నాయి ఎన్నెన్నో పుష్కరిణులు ఉన్నాయి మరెన్నెన్నో దివ్యస్థలాలు ఉన్నాయి కదా! దయచేసి మీరు ఆ యా దివ్య ప్రదేశాలను సవిస్తరంగా తెలియజేసి మమ్ములను కృతార్థులను చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాం" అని అన్నారు.

అంత సూతమహర్షి ఆ మునుల కోరిక మేరకు చాలా సంతోషపడుతూ ఇలా ప్రారంభించాడు.

# పదిహేడు తీర్థాలు

వేంకటాచల క్షేత్రంలో అనంతమైన పుణ్యతీర్థాలు వెలసివున్నాయి అందువల్లే ఈ దివ్యక్షేత్రం ''తీర్థాద్రి'' అని కూడ పిలువబడుతున్నది అంతేగాక ఈ సప్తగిరులు అనేకానేకమైన పుష్కరిణులతో నిండివున్నందువల్ల ''పుష్కరాద్రి'' అని కూడ పేరుపొందింది వీటిని లెక్కించడం అసాధ్యం కూడా అయినప్పటికీ ఈ పర్వతసానువులలో ప్రధానంగా చెప్పుకోదగినవి, స్మరింపదగినవి అయిన 365 ప్రముఖ తీర్థాలు ఉన్నాయి ఈ పవిత్ర తీర్థాలను, దేవతలు, యక్ష గంధర్వ, కిన్నర, కింపురుషాదులు, దేవర్షులు, యోగులు, మునులు ఇలా ఎందరో ఎందరెందరో ఎన్నో విధాలుగా ఎల్లప్పుడు సేవిస్తూనే ఉంటారు తరిస్తూనే వుంటారు ఈ 365 తీర్థాలలో కూడ కొన్ని ఈ శేషాద్రి పర్వత సానువులలో ఎక్కడ వున్నాయో కూడ తెలియదు కొన్ని తీర్థాలు మాత్రమే బహిర్గతాలై వున్నాయి కొన్ని తీర్థాలు అత్యంత రహస్యాలై అదృశ్యాలై అగోచరాలై కేవలం వాటి పేర్లు మాత్రమే వినవస్తున్నాయి అంత మాత్రం చేత మనం ఏ మాత్రం చింతపడవలసిన పనిలేదు వీటిలో కొన్నింటిని సేవిస్తే కూడా చాలు అన్నింటిని సేవించిన ఫలితం కలుగుతుంది అందుకొక దృష్టాంతాన్ని వివరిస్తాను సావధానంగా వినండి

పూర్వం ఒకప్పుడు ఒక బ్రాహ్మణుడు క్షేత్రాలను దర్శిస్తూ, తీర్థాలలో మునకలిడుతూ దేశసంచారం చేస్తూ వుండినాడు అసలు ప్రపంచంలో ఎన్ని తీర్థాలు ఉన్నాయో వాటి అన్నింట్లోను స్నానం చేసి తరించాలని భావించి తిరుగుతూ వుండినాడు ఇలా విశ్రాంతి లేకుండా తిరుగుతున్నందువల్ల ఒకప్పుడు అతను చాలా బలహీనుడై శుష్కించిన శరీరంతో, నీరసించి, శోషపడి, మగతనిద్రకు లోనయ్యాడు

***.............................కి మర్గం గచ్ఛసి ద్విజ!,***
***అస్మిన్ పుష్కర శైలేంద్రే సంతి దివ్యాని సప్త చ,***
***దశ తీర్థాని తత్రాద్యం కాపిలం సర ఉత్తమమ్***
***స్నాత్వా చైతేషు విప్రేంద్ర! శాస్త్రోక్త జ్ఞాన పూర్వకమ్***
***కృత్వా తీర్థఫలం పుణ్యం ప్రాప్స్యసి త్వం న సంశయః,***
***ఇతి శ్రుత్వా ద్విజః పూర్వం స్వప్న బోధాయ విస్మితః***
***నివృత్త తీర్థ యాత్రాతః ప్రాప్య శ్రీ వేంకటాచలమ్.***

**- శ్రీ వరాహపురాణం - ప్రథమ భాగం -**
**40వ అధ్యాయం శ్లోకం 14-17**

ఆ నిద్రలో శ్రియః పతి కనపడి "బ్రాహ్మణోత్తమా! నీయీ ప్రయత్నం అసాధ్యమైంది ఎవ్వరికీ నెరవేరదు ఎప్పటికీ నెరవేరదు కూడా కాని వేంకటాచల క్షేత్రంలో "కపిలతీర్థం" మొదలుగా అత్యంత ప్రధానమైన పదిహేడు పుణ్యతీర్థాలు ఉన్నాయి వాటిల్లో శాస్త్రోక్తంగా నియమంగా స్నానం చేస్తే చాలు ప్రపంచంలోని తీర్థాలన్నింటిలో స్నానం చేసిన ఫలితం వస్తుంది ఇందులో ఏ మాత్రం సందేహం లేదు అందువల్ల నీవు అలాగ ఆచరించు నీ కోరికా నెరవేరినట్లవుతుంది"

అని శ్రీహరి పలుకగా ఆ విప్రుడు మేల్కాంచి తన తీర్థాటనను విరమించుకొని వేంకటాచలక్షేత్రానికి వెళ్ళి అక్కడ ఉన్న కపిలతీర్థాదిగా వున్న పదిహేడు పుణ్య తీర్థాలను సేవించి ముక్తిని పొందినాడు ఆ పదిహేడు తీర్థాలను గూర్చి క్లుప్తంగా వివరిస్తాను వాటిని గూర్చి వినండి అంటూ సూత మహర్షి శౌనకాదిమునులతో ఇలా కొనసాగించాడు

*గిరేరధః ప్రదేశే తు కాపిలం లింగముత్తమమ్*
*పాతాళే పూజితం పూర్వం కపిలేన మహాత్మనా॥*

*కుతశ్చిత్కారణాత్తత్తు లింగం పరమపావనమ్*
*భిత్వా తు ధరణీం తస్మాన్నిర్గతం పూజితం సురైః॥*

*తల్లింగం స్థాపితం భూమౌ ప్రార్థితం సర్వదైవతైః*
*తదగ్రే భువముద్భిద్య నిర్గతా కపిలా పురా॥*

*తద్బిలం కాపిలం తీర్థం సర్వపాప ప్రణాశనమ్*
*తదూర్ధ్వ దేశే శక్రస్య తీర్థం పరమపావనమ్॥*

*అహల్యా సంగ సంభూత శాప మోక్షస్తు యత్ర తత్*
*విష్వక్సేన సరస్త స్మాదూర్ధ్వం పుణ్య వివర్ధనమ్॥*

*వరుణస్యాత్మజో యత్ర తపః కృత్వా సుదుస్తరమ్*
*సారూప్యం చ హరేః ప్రాప్య సైనాపత్యమవాప హి॥*

*పంచాయుధానాం తీర్థాని తదూర్ధ్వం భాంతిసత్తమాః*
*తదూర్ధ్వ మగ్నికుండం స్యాత్ దురారోహముపర్వతః॥*

*బ్రహ్మతీర్థం మహా హత్యామోచనం పుణ్యవర్ధనమ్*
*మునీనాం చైవ సప్తానాం పుణ్యతీర్థాని సంస్థితః॥*

*దశాధిక ఫలం తేషాం తీర్థానా ముత్తరోత్తరమ్*
*ఏతేషాం చైవ మాహాత్మ్యం మయా వక్తుం న శక్యతే॥*

*(వరాహపురాణం - ప్రథమభాగం 40 అధ్యాయం - శ్లో. 5 నుండి 13)*

వేంకటాచల పర్వతానికి క్రింది భాగాన పాతాళలోకంలో మహోత్తమమైన కపిలలింగాన్ని కపిలమహర్షి పూజించుచుండెను పరమపావనమైన ఆ పాతాళ లింగం పెరుగుతూ చివరకు భూమిని ఛేదించుకొని పైకిరాగా దేవతలందరూ పూజించి ప్రార్థించారు వారందరి ప్రార్థనపై భూమియందే ప్రతిష్ఠింపబడినది, ఆ మహాలింగంతో పాటుగా కపిలతీర్థం కూడా ఉద్భవించినది అప్పటినుండి ఆ బిలము కపిలతీర్థమను పేరు కలిగి పరమపావనమై ప్రసిద్ధి కెక్కినది

## శక్ర తీర్థం

కపిలతీర్థానికి పై భాగాన శక్రతీర్థం వుంది శక్రుడు అనగా ఇంద్రుడు గౌతమ మహర్షి భార్య అయిన అహల్యతో సంగమించిన దోషం, ఇంద్రుడు ఈ తీర్థంలో స్నానం చేసినందువల్ల పోయిందట! అందువల్లే ఇది శక్రతీర్థం అయింది

## విష్వక్సేన తీర్థం

ఈ తీర్థం ప్రక్కన వరుణదేవుని పుత్రుడైన విష్వక్సేనుడు తపస్సు చేశాడు శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై శంఖ చక్రాయుధాలను అనుగ్రహించి విష్వక్సేనుణ్ణి తన సేనాధిపతిగా నియమించుకొన్నాడు అందువల్లే ఇది విష్వక్సేన తీర్థం అని ప్రసిద్ధి పొందింది ఇది శక్రతీర్థానికి పై భాగంలో వుంది

## పంచాయుధ తీర్థాలు

విష్వక్సేన తీర్థానికి పైభాగంలో వేంకటాచల పర్వత సానువుల్లో శ్రీనివాసుని పంచాయుధాలైన శంఖం, చక్రం, గద, ఖడ్గం, శార్ఙ్గం వేర్వేరు స్థలాల్లో శ్రీమహావిష్ణువుని గూర్చి తపస్సు చేశాయట శ్రీహరి ప్రత్యక్షమై వాటిని అనుగ్రహించిన దివ్యస్థలాలేపంచాయుధ తీర్థాలు వాటిల్లో స్నానం చేసిన వారి పాపాలు, శత్రు భయం తొలగునట్లు శ్రీహరి వరమిచ్చాడు



2

## అనల తీర్థం

పూర్వం అగ్ని దేవుడు ఈ తీర్థంలో స్నానమాడి తనకు వచ్చిన కడుపునొప్పిని పోగొట్టుకున్నాడు అందువల్లే ఇది అగ్నితీర్థం అని, అనలతీర్థం అని ప్రసిద్ధి కెక్కింది పంచాయుధ తీర్థాలకు పైభాగంలో అనల తీర్థం నెలకొని వుంది

## బ్రహ్మ తీర్థం

అగ్నితీర్థంపైన బ్రహ్మతీర్థం ఉంది ఇచట బ్రహ్మదేవుడు శ్రీహరిని గూర్చి తపస్సు చేసి, తన సృష్టి కార్యం సులువుగా సాగేట్లుగా వరాన్ని పొందాడట! ఇక్కడ బ్రహ్మ హత్యాది దోషాలు తొలగుతాయని ప్రసిద్ధి

## సప్తర్షి తీర్థాలు

బ్రహ్మతీర్థంపైన సప్తర్షులు వెలయింపచేసిన ఏడు పుణ్యతీర్థాలు వున్నాయి ఇవి అత్యంత మహిమ గలిగిన తీర్థాలుగా పేరు పొందాయి

ఇలాగ శ్రీహరి స్వప్నంలో ఆదేశించినట్లుగా ఆ విప్రుడు కపిలతీర్థం మొదలుకొని పదిహేడు తీర్థాలను సేవించి తరించాడు

## త్రిమూర్తి తీర్థాలు

పాతాళలోకం నుండి శ్రీ కపిలేశ్వర మహాలింగంతోపాటు ఆవిర్భవించిన పాతాళగంగ అయిన కపిలతీర్థంలో, పర్వత పైభాగంలో వున్న అనేక తీర్థాలలోని పవిత్ర జలాలతో పాటుగా అంతర్ముఖంగా ఊటల ద్వారా మరెన్నో తీర్థ జలాలు కలుస్తున్నాయి. ఇంత మాత్రమేగాక కపిలతీర్థ పుష్కరిణికి వాయవ్య మూలలో పెద్ద గూళ్ళ లాగా వున్న మూడుదొనల నుండి పవిత్ర జలాలు బయటికి వస్తూ కపిలతీర్థంలో కలుస్తున్నాయి దక్షిణం నుండి ఉత్తరం దిక్కుకు వరుసగా వున్న వాటిలో మొదటి దానిని బ్రహ్మగుండం అని, మధ్యలో ఉన్నదానిని విష్ణుగుండం అని, మూడవ దానిని మహేశ్వర గుండం అని అంటారు వీటిని ''త్రిమూర్తుల తీర్థాలు'' అని కూడా అంటారు. ఎంతటి వర్షాభావం ఏర్పడినా ఈ మూడు గుండాల నుంచి నీరు నిరంతరంగా ప్రవహిస్తూనే వుంటుంది. అనాదిగా శ్రీ కపిలేశ్వరస్వామి మహాలింగ అభిషేకానికి నిత్యమూ మహేశ్వర గుండంలోని జలం ఉపయోగింప బడుతూవున్నది.

## నరసింహ గుహ

అంతమాత్రమేగాక కపిలతీర్థ పుష్కరిణికి పడమటివైపున కోనేటి మెట్లకు పైభాగాన వేంకటాచల పర్వతంలోకి చొచ్చుకొని వున్న ఒక రాతిగుహవుంది దీనిని 'నరసింహ గుహ' అంటారు ఈ గుహలోని సొరంగ మార్గం గుండా నేరుగా వేంకటాచలక్షేత్రం మీదికి దారి వున్నదట! ఒకప్పుడు శ్రీనివాసుని ఆజ్ఞమేరకు ఈ 'నరసింహగుహ' గుండానే వకుళమాత వేంకటాచల క్షేత్రాన్ని దిగి ఈ కపిలతీర్థ పుష్కరిణిలో స్నానమాడి శ్రీ కపిలేశ్వరుని అర్చించి ఆరాధించినది శ్రీనివాసుడు ఆకాశరాజు కూతురు పద్మావతిని వివాహ మాడుటకు గాను ఆశీస్సులనుగ్రహించవలసిందిగా వకుళమాత కపిలేశ్వరుని ప్రార్థించి ఇష్టార్థసిద్ధిని పొంది, పద్మావతీ శ్రీనివాసుల పరిణయాన్ని నిర్విఘ్నంగా నిర్వహించింది

ఇలా కపిలతీర్థం క్షేత్రాన్ని గూర్చి తీర్థాలను గూర్చి వివరిస్తూ సూతమహర్షి శౌనకాదులతో ''అనేక పుణ్యతీర్థాల సంగమమై మహా మహిమాన్వితమైనఈ కపిలతీర్థానికి మరో ప్రత్యేకమైన విశేష ప్రాధాన్యత కూడా వుంది దానిని కూడా వివరిస్తాను సావధానంగా వినండి'' అని అంటూ ఇలా కొనసాగించాడు

## మాధవుని చరిత్ర

పూర్వం, దక్షిణ కైలాస నగరంగా ప్రసిద్ధి కెక్కిన శ్రీ కాళహస్తీశ్వర క్షేత్రంలో 'పురందరుడు' అనే విప్రోత్తముడు వుండినాడు ఆయన నిత్యాగ్నిహోత్రి ఎన్నో యాగాలు చేసిన సోమయాజి నిరతాన్నదాత అలాంటి సద్బ్రాహ్మణునికి ఎంత కాలానికి సంతానం కలుగనేలేదు ''అపుత్రస్య గతి ర్నాస్తి'' అన్నట్లు, పుత్రులు లేనివారికి గతులే లేవు కదా! అని చింతిస్తూ ఎన్నో నోములు నోచాడు మరెన్నో వ్రతాలు చేశాడు. చివరకు వయస్సు మీరిన తరువాత దైవానుగ్రహం వల్ల ''మాధవుడు'' అని పుత్రుడు పుట్టాడు. ఆ వృద్ధుడు తన పుత్రుడైన మాధవుణ్ణి అల్లారు ముద్దుగా పెంచుతూ సకల వేదాలను నేర్పించాడు అనతి కాలంలోనే మాధవుడు కూడా తండ్రి వలెనే విప్రోత్తమునిగా పేరు తెచ్చుకొన్నాడు తదుపరి యుక్త వయస్సు వచ్చిన మాధవునికి ''చంద్రలేఖ'' అనే కన్యతో వివాహం జరిగింది. వివాహం జరిగిన వేళావిశేషం ఏమిటోగాని, మాధవుడు బ్రాహ్మణాచార విధులన్నిటిని విడిచిపెట్టి నిత్యమూ కాముకుడై భార్యతో చరిస్తూ వుండినాడు నీతి నియమాలను, సమయాసమయాలను, విడిచిపెట్టి ఏ మాత్రం సిగ్గూ లజ్జా లేకుండా వున్న తన భర్తను, చంద్రలేఖ సున్నితంగా మందలించింది అయినా

అతడు వినలేదు అమె హితబోధను పెడచెవిన పెట్టిన మాధవుడు విధివశాన 'కుంతలా' అనే వేశ్యకు లోబడినాడు రాత్రింబవళ్లూ ఆమెతోనే వుంటూ, తన ఇంటిని పూర్తిగా విడిచిపెట్టినాడు. పూర్తిగా భ్రష్టుడైన పుత్రుని మీది చింతతో వృద్ధుడైన తండ్రి పురందరుడు గతించినాడు. పిదప భార్య చంద్రలేఖ కూడ భర్తకోసం ఎదురుచూచి ఎదురుచూచి చివరికామె ఏమయిందో ఎవరికీ తెలియరాలేదు.

వేశ్యాలోలుడైన మాధవుడు గోమాంసాది భక్షణం, మధ్యపానాదులకు లోలుడై కుంతలను క్షణం కూడ విడవకుండా వుండినాడు విధివశాత్తు ఆ వేశ్యకూడా మరణించగా మతి భ్రమించిన మాధవుడు దేశద్రిమ్మరియై తిరుగుతూ అక్కడ కొందరు యాత్రికులతో కలిసి వేంకటాచల యాత్రకు వెళుతూ ముందుగా కపిలతీర్థానికి వెళ్లాడు అదే సమయానికి ఉత్తర దేశీయులైన కొందరు మహారాజులు వేంకటాచలక్షేత్ర పర్వతమూలంలో వున్న కపిలతీర్థం చేరుకొని వారందరూ పవిత్ర స్నానాదులు ముగించుకొని తదుపరి అత్యంత భక్తిశ్రద్ధలతో విలువైన దక్షిణ కానుకలతో పితృదేవతలకు తర్పణ శ్రాద్ధాలు నిర్వహించడం చూశాడు కపిలతీర్థంలో తర్పణశ్రాద్ధాదులు చెయ్యడం క్షేత్ర సంప్రదాయమనీ, అలా చేస్తే పితృదేవతలు సంతోషించి ఆశీర్వదించి అనుగ్రహిస్తారని, తద్వారా సమస్త పాపాలు తొలగిపోతాయని వారి ద్వారా వినిన భ్రష్ట బ్రాహ్మణుడైన మాధవుడు, తన గత చరిత్రను స్మరించుకొన్నాడు, చాలా పశ్చాత్తాపపడినాడు తన తల్లిదండ్రులు గతించినపుడు కూడా వేశ్య ఇంటిలో వుంటూ, పిలిచినా తాను వెళ్లక, మూర్ఖుడై నడుచుకొన్న గాధనంతా ఒక్కసారి ఆకళింపు చేసికొని బాధాతప్తుడయ్యాడు

చివరకు తాను కూడా క్షేత్ర సంప్రదాయం ప్రకారం కపిలతీర్థంలో మునకలిడినాడు పితృదేవతలయిన తన తండ్రితాతలకు తర్పణాలు విడిచినాడు తదితర యాత్రికులవలె ఘనంగా శ్రాద్ధాలను నిర్వర్తించడానికి శక్తి లేకపోయినా భక్తి ప్రపత్తులతో మట్టితో పిండాలు చేసి పిండప్రదానం చేసి పితృదేవతలకు సంతృప్తిని కలిగించినాడు. పితృదేవతల ఋణం నుండి విముక్తుడయ్యాడు ఆ రాత్రి కపిలతీర్థంలోనే నిద్రించి మరునాడు స్నానదర్శనాదులు ముగించుకొని పులు కడిగిన ముత్యంలా పరిశుద్ధుడై వేంకటాచలానికి పయనమయ్యాడు. ఆ పర్వతారోహణ క్రమంలో తాను వేస్తున్న ఒక్కొక్క అడుగుకు ఒక్కొక్క పాపం

నశిస్తూ మరింత తేజోవంతంగా వర్ధిల్లుతుండగా ఆ విప్రుని ఎదుట బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షమయ్యారు ఆ దేవతలందరు మాధవుణ్ణి పెక్కు విధాల ప్రశంసిస్తూ "అయ్యా! విప్రవర్యా! కపిలతీర్థంలో స్నానం చేసి తీర్థవిధులాచరించి నందువల్ల నీ ఘోర పాపాలన్నీ నశించడమేగాక మిక్కిలి పవిత్రుడివయ్యావు వేంకటాచలక్షేత్రంలో "స్వామిపుష్కరిణి"లో కూడ పవిత్రస్నానాలు చేసి, శ్రీ భూవరాహస్వామివారిని దర్శించి, పిదప లీలామానుష విగ్రహుడై చరిస్తున్న ఆనంద నిలయుడైన శ్రీ మహావిష్ణువును ఉపాసిస్తూ నీ జీవితాన్ని ధన్యం చేసికోవలసింది పిదప మరుజన్మలో నీవు పాండవ వంశంలో సుధర్ముడు అనే చక్రవర్తికి పుత్రునిగా పుట్టి "ఆకాశరాజు" అను పేరుతో ప్రసిద్ధుడివవుతావు ఆ జన్మలో నీకు సాక్షాత్తు లక్ష్మీదేవి "పద్మావతి" అనే పేరుతో పుత్రిక అవుతుంది ఆమెను వివాహమాడి, వేంకటాచలపతి నీకు అల్లుడు కాగలడు ఆ స్వామివారి అనుగ్రహంవల్ల ఆ జన్మలోనే నీవు సర్వసౌఖ్యాలు అనుభవించి చివరకు ముక్తిని కూడా పొందగలవు" అని అంటూ అదృశ్యమయినారు

ఇలా సర్వభ్రష్టుడైన మాధవుడు ఆ తర్వాత జన్మలో ఆకాశరాజై తరించినట్లుగా భవిష్యోత్తర పురాణంలో వున్న విషయాన్ని మీకు తెలియజేశానని సూతుడు శౌనకాదులకు కపిలతీర్థ క్షేత్ర మాహాత్మ్యాన్ని వివరించినాడు

వేంకటాచల మాహాత్మ్యంలో వున్న ఇలాంటి గాథలవల్ల, కపిలతీర్థంలో స్నానం చేసినంత మాత్రాననే ఎన్నో ఘోర పాపాలు తొలగి సర్వశుభాలు కలుగుతాయని స్పష్టమవుతున్నది అంతేగాక శ్రాద్ధాదులను సరిగా నిర్వహించక పోయినా లేదా పూర్తిగా విస్మరించినా, కాలాంతరంలో నిలిపివేసినా, పితృదేవతల శాపాలకు గురి అయ్యి, అష్టకష్టాలు పడుతూ వున్న ఏ మానవులు అయినా సరే ఈ కపిలతీర్థంలో భక్తి శ్రద్ధలతో శ్రాద్ధాదులు, తర్పణాలు, పిండ ప్రదానాలు నిర్వహించి పైదోషాల నుండి విముక్తిని పొందవచ్చుననే దివ్యవృత్తాంతం తెలియజేస్తున్నది

అందువల్లనే అనాదిగా ఈ క్షేత్రంలో తిరుమల యాత్రికులు అనేక మంది ముందుగా ఈ పుణ్యతీర్థంలో తమ పితృదేవతలకు శ్రాద్ధాదులు నిర్వహించిన తదుపరి శ్రీ కామాక్షీ కపిలేశ్వరులను దర్శించి పవిత్రులై శ్రీనివాసుని దర్శించి సేవించడం అనే సత్సంప్రదాయం అనవాయితీగా నేటికీ వస్తున్నది

ముఖ్యంగా భాద్రపదమాసంలోని మహాలయపక్ష దినాల్లోను, మహాలయ అమావాస్య రోజున, ఉత్తరాయన, దక్షిణాయన సంక్రమణ పుణ్యదినాలలోను, సూర్యగ్రహణ, చంద్రగ్రహణ పుణ్య కాలాల్లోను ఈ క్షేత్రంలో శ్రాద్ధాదులు నిర్వర్తించుకొని తర్పణాదులు విడవడం మరింత ఫలదాయకమని తెలుపబడుచున్నది. అందువల్లే ఈ పర్వదినాల్లో వేలాదిమంది యాత్రికులు, భక్తులు కపిలతీర్థ క్షేత్రంలో అత్యంత శ్రద్ధాభక్తులతో పితృదేవతల తృప్తికోసం శ్రాద్ధాదులు నిర్వహిస్తుంటారు.

శ్రీ వేంకటాచల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారు స్వయంవ్యక్తమై అర్చామూర్తిగా నిలిచిన నాటి కంటే కూడ అత్యంత ప్రాచీనమై, మహిమాన్వితమై వెలసిన ఈ కపిలతీర్థం ''చక్రతీర్థం'' అనే పేరుతో ప్రసిద్ధి చెందినట్లు కూడ వేంకటాచల మాహాత్మ్యం తెలుపుచున్నది

## చక్ర తీర్థం

ఒకానొకప్పుడు వేంకటాచలక్షేత్ర మాహాత్మ్యాన్ని గూర్చి పరమేశ్వరుడు పార్వతికి తెలియజేస్తూ, ''పార్వతీ! ఆ శేషాద్రి పర్వతంలో ఎవ్వరు ఎలాంటి సేవచేసినా, సాధన చేసినా తపస్సు చేసినా అది అనంతఫలప్రదమై, ఇష్టార్థాలు నెరవేరతాయి. అది అంతా ఆ వేంకటాచల క్షేత్ర మహత్వం ఆ స్థలం ఎంతో పుణ్యప్రదం - మరెంతో సిద్ధి ప్రదం ఆ క్షేత్రం యొక్క గొప్పదనం ఇంతింత అని చెప్పనలవి గాదు'' - అని అంటూ శివుడు ఇలా కొనసాగించాడు

''కాలచక్రం'' అనే పేరుతో పిలువబడుతున్న సుదర్శనుడు కొంతకాలం నా దగ్గర వుంటూ, కారణాంతరాలవల్ల నన్ను ఎడబాసినాడు మళ్లీ నన్ను చేరుటకు గాను ''కాలచక్రం'' సాక్షాత్తు పరబ్రహ్మమై వేంకటాచలక్షేత్రంలో లీలామానుష విగ్రహుడై చరిస్తున్న శ్రీ మహావిష్ణువును గూర్చి ఘోర తపమాచరించినాడు. అంత శ్రీహరి ప్రత్యక్షమై ''నీవు చక్రతీర్థంలో నివసింపుము నీ కోరిక నెరవేరుతుంది'' అని వరమిచ్చినాడు

అందులకు పార్వతి ఆశ్చర్యపడుతూ ''పరమేశ్వరా! సుదర్శన చక్రమునకు నీకు వున్న సంబంధం ఎలాంటిది? శ్రీహరికి ప్రధానాయుధమైన సుదర్శన చక్రం ఆయనను విడిచి ఎప్పుడు ఉండజాలదు కదా! మరి అలాంటి చక్రం నిన్ను చేరడం ఎలా జరిగింది? ఈ గాథ చాలా విచిత్రంగాను ఆశ్చర్యంగాను

వుంది. ఆ వృత్తాంతాన్ని పూర్తిగా తెలుసుకోవలెననే ఆసక్తి ఎంతగానో కలుగుతున్నది'' అని ప్రార్థించినది.

**ఏతచ్ఛ్రుత్వాంబికాం ప్రాహ శంకరో లోక శంకరః**
**అనాది నిధనం దివ్యం అప్రమేయ పరాక్రమమ్**
**సహస్రార సమాయుక్తం కోటి సూర్య సమప్రభమ్**
**సుదర్శనాఖ్యం తచ్చక్రం విష్ణో రేవతు పార్వతి**
**ధర్తుమన్యైర్న శక్యం తత్ తం వినా పురుషోత్తమమ్**
**తేవ చక్రేణ దివ్యేన దగ్ధా వారాణసీ పురీ**
**సా రాజధానీ మే దివ్యా కృత్యాహేతోః వినాశితా**
**కస్మింశ్చి దథ కాలే తు మయి ప్రీతో జనార్దనః**
**కిమిచ్ఛసీతి మాం ప్రాహవరదాన సముద్యతః**
**ఏవ ముక్తేమయా తస్మాత్ యాచితం వరముత్తమమ్**
**''యేవ చక్రేణ మే దగ్ధా పురీ వారాణసీ హరే**
**తధ్యథా మద్వశం యా యాత్ మమపేష్యంచ మాధవ!**
**తథా కురు మయి ప్రీతో నాన్యం వరమహం వృణే**

***(వామన పురాణం - 22 అధ్యాయం శ్లో.17-23)***

భక్తవశంకరుడైన లోక శంకరుడు పార్వతిని ఉద్దేశిస్తూ ''ఓ అంబికా! నీ మాటలు పరమ సత్యములు సుదర్శన చక్రం అనాది నిధనం దివ్యం, అప్రమేయమైన పరాక్రమంతో విరాజిల్లుతుంటుంది సహస్రధారలతో కోటి సూర్య సమప్రభలతో ప్రకాశిస్తూ వుంటుంది. విష్ణుదేవుడు తప్ప ఇతరులెవ్వరు ఆ సుదర్శన చక్రాన్ని ధరింపజాలరు. ఆ సుదర్శనం ఆయనకు మాత్రమే వశమై ఉంటుంది. అలాంటి దివ్య చక్రం ఒకసారి దూర్వాసుడు సృష్టించిన 'కృత్య' అనే దుష్టశక్తి వారాణసీపురాన్ని ఆవరించి వినాశనం చేస్తుండగా చూచినది

సుదర్శన చక్రం ఆ కృత్యను నాశనమొనరించే ప్రయత్నంలో ఆ కృత్యతో పాటు కాశీ నగరాన్ని కూడ దగ్ధమొనరించినది ఆ తర్వాత కొంత కాలానికి నేను విష్ణువును దర్శింపగా, ఆయన ఎంతగానో సంతోషించి ''ఏదైనా వరం కోరుకో తప్పక ఇస్తానని'' వాగ్దానం చేసినాడు అంత నేను ఆయన మాటను కాదనలేక ''శ్రీహరీ! 'కృత్య' నెపంతో కాశీ నగరాన్ని దగ్ధమొనరించిన నీ సుదర్శన చక్రాన్ని నా వశం చేయవలసిందని కోరాను మహావిష్ణువు నా చేతిని తన చేతితో స్వీకరించి ఆదరంగా స్పృశించి నిమురుతూ ఇలాగ అన్నాడు

*"కథం సూర్యం పరిత్యజ్య ప్రభాన్యస్య భవిష్యతి*
*ఏవం శ్రీః కౌస్తుభం చక్రం గరుడః శార్ఙ్గమేవ చ*
*ఏవమాదీని మే శ్రీమన్ విత్యసిద్ధాని శంకర!*
*నైతేషాం జన్మవిలయౌ నాన్యస్త్రేషాం వ్యపాశ్రయః*
*అశక్యమిద మత్యర్థం యాచితం ప్రమథాధిప!*
*న చాహమన్నతం వక్ష్యే తథైవాస్తు యథేప్సితమ్*
*ఏత త్సుదర్శనం దివ్యం కుతశ్చిత్కారణాంతరాత్*
*బ్రహ్మణా విర్మితం భూత్వా లేశేనా వతరిష్యతి*
*అవతీర్ణస్తు తచ్చక్రం త్వ త్ప్రేష్యత్వం గమిష్యతి*
*దివ్యం వర్ష సహస్రం తు త్వత్సమీపే వసిష్యతి*
*త్వయా ప్రత్యర్పితం పశ్చాత్ స్వం భావముపయాస్యతి"*
*ఏవం విష్ణు ప్రసాదేన వరదాన సమాగతమ్*
*దేవి చక్రం మమైతద్ధి సహస్ర రవి సన్నిభమ్.*
*విష్ణవే చ పురాదత్తం మయా పురనిమర్దనే*

''ఓ పశుపతీ! సూర్యుని విడిచి వెలుగు ప్రత్యేకంగా ఎలా వుండలేదో అలాగే లక్ష్మీదేవి, కౌస్తుభమణి, సుదర్శన చక్రం, కౌమోదకి శార్ఙాది పంచాయుధాలు నన్ను విడిచి వుండలేవు. అవి నాకు అత్యంత సహజ సిద్ధములు అవి అద్యంతాలు లేనివే గాక, ఎవరివద్దా వుండజాలవు కూడ అలాంటి అసాధ్యమయిున వరం కోరినావు అయినా ఓ భూతనాథా! నా మాట ఎన్నటికి అసత్యం కాజాలదు. నీవు కోరినట్లే నెరవేరుతుంది కొన్ని కారణాలవల్ల ఈ సుదర్శన చక్రంలోని అంశతో బ్రహ్మదేవుడు మళ్లీ ఆ చక్రాన్ని రాబోయే కాలంలో అవతరింపజేస్తాడు ఆ చక్రం నీ వద్ద వేయి దివ్య సంవత్సరాలు మాత్రం వుంటుంది ఆ మీదట అది నిన్ను విడిచి, తన సంపూర్ణాంశతో నన్ను చేరి ప్రకాశిస్తుంది'' అని విష్ణువు అనుగ్రహించినాడు

అందువల్ల ''ఓ పార్వతీ! తర్వాతి కాలంలో ఆ సుదర్శన చక్రం బ్రహ్మచే నిర్మించబడి 'కాలచక్రం' అనే పేరుతో నా వద్దకు చేరినది. ఆ కాలచక్రం చేత త్రిపురాసుర సంహారం చేసి లోకాలను రక్షించాను. దేవతలను రక్షించాను ఆ తర్వాత దివ్యమంత్ర సహితమై మహిమాన్వితమై వెలుగొందిన ఆ కాలచక్రాన్ని మళ్లీ శ్రీహరికి తిరిగి ఇచ్చి వేసినాను. కాని ఆ చక్రం చాలాకాలం నా వద్ద

వుండినందువల్ల, నాతో ఏర్పడిన అనుబంధం వల్ల, నన్ను ఎడబాసి దూరంగా వుండలేకపోయింది. మళ్లీ నన్ను చేరవలెననే సంకల్పంతో ఆ చక్రరాజం వేంకటాచలపర్వతంలో శ్రీ మహావిష్ణువును గూర్చి చాలాకాలం ఘోరతపస్సు చేసినది అంత విష్ణు భగవానుడు ప్రత్యక్షమై నిండుదయతో ''నీవు చక్రతీర్థానికి వెళ్లి అక్కడే వుంటూ భక్తులను అనుగ్రహిస్తూ వుండు, నీ కోరిక నెరవేరగలదని'' వరమిచ్చినాడు అని పరమశివుడు చెప్పిన ఈ వృత్తాంతాన్ని ఆలకించిన పార్వతీదేవి మళ్లీ ఇలా అడిగింది ''స్వామీ! చాల బాగుంది విష్ణుభగవానుని గూర్చి సుదర్శనుడు తపస్సుచేసిన ఆ ''చక్రతీర్థం'' ఏది? ఎక్కడుంది? దాని మహత్వం ఎలాంటిది? అని ఆసక్తితో తన జిజ్ఞాసను తెలియపరచగా శంకరుడు ఇలా తెలియజేసినాడు

***''వృషాద్రేః దక్షిణే పార్శ్వే బహుప్రస్రవణే తటే***
***సన్త్యాశ్రమాః సప్తదశ చక్రాదీనాం మహాత్మనాం***
***తావన్తి చైవ తీర్థాని తేషు పుణ్యతమాని వై***
***తత్రాద్యం చక్రతీర్థం యత్ వజ్ర తీర్థా దధః స్థితమ్***
***కాలచక్ర తపః స్థానం కపిలోద్ధమజం సరః***
***తత్ర స్నానేన నశ్యన్తి సర్వపాపాని వై నృణామ్***
***తద్విష్ణోః పరం క్షేత్రం మహాపుణ్యతమం స్మృతమ్''***

**(వామన పురాణం - 22 అధ్యాయం శ్లో.36-39)**

వృషాద్రి క్షేత్రానికి దక్షిణ దిక్కున అనేకమైన సెలయేళ్లు జలపాతాలు ప్రవహించు చున్నాయి. అక్కడక్కడ ఎందరో మహనీయులు తపస్సు చేసుకుంటున్న ఆశ్రమాలు, దివ్యస్థలాలు వున్నాయి అ దివ్య స్థలాల దగ్గర్లోనే కొన్ని పుణ్యతీర్థాలు కూడ వెలిసి వున్నాయి అటువంటి మహిమాన్వితమైన పదిహేడు పుణ్యతీర్థాల్లో వజ్ర తీర్థానికి క్రింది భాగంలో సాక్షాత్తు విష్ణ్వంశజుడైన కపిల మహాముని ఏర్పరిచిన బిలం వుంది అందులోనుండి నిరంతరం పుణ్యజలాలు స్రవిస్తూ వుంటాయి. అదే ''చక్రతీర్థం'' అని ప్రసిద్ధి పొందింది. అక్కడ శ్రీమహావిష్ణువు ఆదేశం మేరకు సుదర్శనభగవానుడు తపస్సు చేసినాడు అందువల్లనే ఆ తీర్థం ''సుదర్శనచక్రతీర్థం'' అని, ''చక్రతీర్థం''అని పేర్లు పొందింది ఈ తీర్థంలో స్నానం చేసినవారి పాపాలు అన్నీ నశిస్తాయి. అది పరమ పవిత్రమైన మహాపుణ్యప్రదమైన ''విష్ణుక్షేత్రం'' అని శివుడు చక్రతీర్థమహిమను

పార్వతీదేవికి వివరించినాడు. అత్యంత ప్రాచీనకాలంలోనే ఇలా ఏర్పడిన ఈ 'చక్రతీర్థం' ''సుదర్శనచక్రత్తాళ్వారు తీర్థం'', అని, ''చక్రత్తాళ్వారుతీర్థం'' అని పిలువబడుతూ నేటికి 'ఆళ్వారుతీర్థం' అని ప్రసిద్ధమైన పేరును పొందింది.

ఇలా ఆవిర్భవించిన 'సుదర్శనచక్రతీర్థం' అనే పేరు కొంతకాలం మరుగునపడిపోగా మళ్లీ భగవద్రామానుజులవారు ''సుదర్శనచక్రతీర్థం'', ''సుదర్శనతీర్థం'' వంటి పేర్లతో ఈ తీర్థానికి ప్రసిద్ధిని కలిగించారు కాని తర్వాతి కాలంలో మరపునపడి ఈ పేరు అవ్యాప్తి చెందగా విజయనగర సామ్రాజ్య చక్రవర్తి, వైష్ణవమతాభిమాని అయిన అచ్యుతరాయలు ఈ తీర్థాన్ని పునరుద్ధరించి, మెట్లను మండపాలను నిర్మించి 'కపిలతీర్థం' అనే పేరును పూర్తిగా మరిపింపజేసి ''చక్రత్తాళ్వార్ తీర్థం'' అనే పేరును ప్రచారానికి తెచ్చి ప్రసిద్ధిని కలిగించినాడు

వేంకటాచలానికి వెళ్లే యాత్రికులు తప్పనిసరిగా ముందుగా ఈ 'చక్రతీర్థం'లో పవిత్ర స్నానాలు చేసి సంధ్యావందనం, ధ్యానం జపం మున్నగు పూర్వాహ్నిక క్రియలు నిర్వర్తించుకొన్న తరువాతనే శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించుకొనుటకు పర్వతాన్ని అధిరోహించేవారని ''వేంకటేశసేవాక్రమః'' అనే గ్రంథం

**''చక్రతీర్థే తతః స్నాత్వా**
**కృత పూర్వాహ్ణిక క్రియః**
**ధ్యాయన్ శ్రీ వేంకటాధీశం**
**సేవే యాంజన భూధరమ్''**

అని తెలుపుతోంది. ఇలాగ 'చక్రతీర్థం'లో స్నానధ్యానాదికాలు ముగించుకొన్న తిరుమల యాత్రికులు ఈ తీర్థం ముందుభాగంలో అనుకొని పశ్చిమంగా కొనసాగే మార్గం ద్వారా, వేంకటాచల పర్వతానికి వెళ్ళేవారని స్పష్టమవుతోంది. కపిలతీర్థం నుండి అలిపిరి ద్వారా వెళ్ళే ఈ మార్గాన్ని ''మహాపథం'' అని పిలిచేవారని పై గ్రంథం తెలుపుతోంది

**''పాతాలా దుద్గతస్యాస్య కపిలస్య మహాత్మనః**
**మార్గో హి తద్బిలం గుహ్యం కాపిలం పరికీర్తితమ్**

**జలాభిపూరితం తత్తు పరోవర మనుత్తమమ్**
**దర్శనాదేవ తత్తీర్థం పర్వాఘౌఘవినాశనమ్.**

దర్శనాత్ స్వర్గదం పుంసాం స్త్రీణామపి చ పార్వతి
స్నానే పానే కృతే తస్మిన్ జరామరణ నాశనమ్

సకృత్స్నాతస్య తు ఫలం జనస్య శృణు పార్వతి
వాజపేయాశ్వమేధానాం పుష్కలం ఫలమశ్నుతే
వాజపేయాత్పునర్జన్మ సకృత్స్నాతస్య నచ్యుతిః

ఇలాగ కపిలతీర్థమనీ, చక్రతీర్థమనీ పేరొందిన ఈ తీర్థరాజం ఇచట పాతాళలోకం నుండి ఆవిర్భవించి కపిల లింగానికి ఎదురుగా వుంది ఆ ప్రక్కనే ఒక బిలం వుంది రహస్యమైన ఆ బిలమార్గం నుండి కపిలమహర్షి పాతాళలోకం నుండి రాకపోకలు సాగించుచుండినాడు కాలక్రమేణ ఆ బిలం జలంతో నిండి, కపిలతీర్థ సరోవరంగా ప్రసిద్ధిచెంది ఎంతో పుణ్య తమమై వెలుగొందింది ఈ తీర్థాన్ని దర్శించిన మాత్రానసే స్త్రీ పురుషులలెల్లరకు పాపాలన్నీ తొలగి స్వర్గం ప్రాప్తిస్తుంది ఇక అందులో స్నానపానాలు చేసినవారికి జరామరణములు నశిస్తాయి అందులో ఒక్కమారు స్నానం చేస్తే చాలు అనేక వాజపేయ, అశ్వమేధ యాగాలు చేసినంత ఫలితం కలుగుతుంది అయితే వాజపేయం అశ్వమేధయాగాలు చేసిన వారికి పుణ్యం తీరగానే మరల జన్మ కలుగుతుంది కాని ఈ కపిలతీర్థంలో స్నానం చేసినవారికి మరల పుట్టుకే వుండదు'' అని పరమేశ్వరుడు పార్వతితో కపిలతీర్థ మహత్యాన్ని తెలియజేస్తూ ఆ తీర్థ రాజంలో స్నానకాల నిర్ణయాన్ని ఇలా వివరించినట్లు వామన పురాణం పేర్కొంటున్నది

''త్రైలోక్యే సర్వతీర్థాని కార్తికే మాసి పర్వణి
మధ్యాహ్నే కాపిలే తీర్థే సాన్నిధ్యం యాంతి పార్వతి.

తిష్ఠంతి ప్రాణిరక్షార్థం మధ్యాహ్నే దశనాడికాః
తత్ర స్నాతాస్తు యే పాపాః పురుషా యోషితో ఉమలే

సర్వపాప వినిర్ముక్తా బ్రహ్మలోకం ప్రయాంతివై
తత్ర దానాని కుర్వంతి యే నరా స్తీర్థ సన్నిధౌ

తిలమాత్ర హిరణ్యన్తు దత్తం మేరుసమం భవేత్
భిక్షామాత్రం తథా ఉన్నస్య దానం కాపిలసన్నిధౌ

కుర్వంతి యే నరా దేవి! సోమలోకం ప్రజంతితే
కన్యా గో భూప్రదాతారో విద్యామంత్రోపదేశకాః

**స్వర్గ కైలాస వైకుంఠ బ్రహ్మలోకాన్ ప్రజాప్తతే**
**వర్షే వర్షేతు కార్తిక్యాం పౌర్ణమాస్యాం మహాతిథౌ**

**ఆ యాన్తి సర్వతీర్థాని మధ్యాహ్నే కాపిలం సరః**
**ఇమం మన్త్రం సముచ్ఛార్య స్నాత స్తత్ ఫలమాప్నుయాత్**
**స్నానం తు దుర్లభం తత్ర తద్విష్ణోః పరమం పదమ్''**

"ఓ పార్వతీ! కార్తీక మాసంలోని పర్వదినాల్లో అనగా కార్తీక పౌర్ణమి, అమావాస్య, ఏకాదసి, ద్వాదశి, సోమవారాలు, శనివారాలు మున్నగు విశేషదినాల్లో మధ్యాహ్నకాలంలో ముల్లోకాల్లో వుండే పుణ్యతీర్థాలన్నీ, ఈ కపిలతీర్థంలో వచ్చి చేరతాయి ఇలా ఆ కార్తీక పండుగ దినాల్లో సర్వప్రాణి రక్షణార్థం 10 నిముషాల పాటు విశేష తీర్థాలన్నీ ఆవహించిన ఈ కపిలతీర్థంలో స్నానం చేసినట్లయితే ఎంతటి పాపాత్ములైనా సరే ఆ స్త్రీ, పురుషుల పాపాలన్నీ తొలగి వారు బ్రహ్మలోకం చేరుకుంటారు

ఆ తీర్థ సన్నిధిలో నువ్వు గింజంత బంగారాన్ని దానం చేసినట్లయితే అది మేరుపర్వత దానంతో సమానమై గొప్ప ఫలితం కలుగుతుంది భిక్షమెత్తుకొన్న దానిలో అయినా సరే కపిలేశ్వరుని సన్నిధిలో అన్నదానం చేసిన వాళ్ళ చంద్రలోకానికి వెళతారు. ఆ పుణ్య క్షేత్రంలో కన్యాదానం చేస్తే స్వర్గం వస్తుంది గోదానం చేస్తే చాలు కైలాసం సంప్రాప్తిస్తుంది భూదానం చేస్తే చాలు వైకుంఠం చేరుకొంటారు విద్యాదానం లేదా మంత్రోపదేశం చేసినట్లయితే బ్రహ్మలోకాన్ని చేరుకొంటారు.

అంతేకాదు ప్రతి సంవత్సరం కార్తీకపౌర్ణమినాడు మధ్యాహ్నకాలంలో సమస్త తీర్థాలు కపిలతీర్థంలో వచ్చి చేరతాయి. ఆ సమయంలో ఈ క్రింది మంత్రాన్ని పఠిస్తూ స్నానం చేసినట్లయితే ఆ మంత్ర ఫలితం సిద్ధిస్తుంది

**"వర్షే వర్షేతు కార్తిక్యాం పౌర్ణమాస్యాం మహాతిథౌ**
**స్నానం తు దుర్లభం తత్ర తద్విష్ణోః పరమం పదమ్''॥**

అంటూ మంత్రాన్ని పఠిస్తూ కార్తీక పౌర్ణమి నాడు కపిలతీర్థంలో స్నానం చేసినట్లైతే దుర్లభమైన విష్ణువు పరమపదమైన వైకుంఠం ప్రాప్తిస్తుందని, వామనపురాణంలోని శ్రీ వేంకటాచల మాహాత్మ్యం స్పష్టం చేస్తోంది.

ఇంతటి పురాణ ప్రసిద్ధి చెందిన ఈ ''కపిలతీర్థం'' యొక్క ప్రస్తావన, మండపాల నిర్మాణం, ఉద్ధరణ వగైరా చారిత్రక ఆధారాలు క్రీస్తుశకం 11వ శతాబ్దం నుంచి మాత్రమే గోచరిస్తున్నాయి

తిరుపతికి సమీపంలోని కొత్తూరు గ్రామాధికారి అయిన బ్రహ్మమారాయన్ మున్నై యాదవరాయన్ అని మరోపేరుతో పిలువబడే రాయునరాజేంద్రచోళుడు క్రీస్తు శకం (1012-1044) కపిలతీర్థాన్ని ఉద్ధరించినట్లు శ్రీ కపిలేశ్వర గుహాలయానికి గర్భాలయ ముఖ మండపాలు నిర్మించినట్లు శాసనాలు తెలుపుతున్నాయి ఇతడు కపిలతీర్థానికి ఆగ్నేయంగా వుండిన 'కొత్తూరు' గ్రామ పరిపాలకుడు

ఆ తర్వాత విజయనగర చక్రవర్తి అచ్యుత దేవరాయలు (క్రీస్తు శకం 1530-42) మూడు మార్లు తిరుమల యాత్ర చేసినట్లు శాసనాలు తెలుపుతున్నాయి వైష్ణవ మతాభిమాని అయిన అచ్యుతరాయలు శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రీతికరంగా ఈ క్షేత్రానికి ఉన్న కపిలతీర్థం అన్న పేరును మరపింపజేసి ''సుదర్శన చక్రతీర్థం'' అనే పేరుతో ప్రసిద్ధిని కల్గించారు అంతేగాక 25-6-1531 తేదీన ఈ పుష్కరిణికి నాలుగు మూలల్లో ''తిరువాళిక్కళ్'' అని పిలువబడే నాలుగు ''సుదర్శన చక్ర శిల''లను ప్రతిష్ఠించి ఈ తీర్థానికి ''చక్రత్తాళ్వారు తీర్థం'' అని ''ఆళ్వారు తీర్థం'' అని సార్థక నామధేయాలు కల్పించాడు ఆనాడు అచ్యుతరాయలు ప్రతిష్ఠించిన నాలుగు సుదర్శన చక్ర శిలలలో మూడింటిని నేటికీ చూడవచ్చు కోనేటికి ఈశాన్యమూలలో శ్రీ కపిలేశ్వరుని ధ్వజస్తంభ బలిపీఠాలకు ఉత్తరంగా ప్రాకారం వద్ద ఒక శిలను, పడమటి దిక్కున కోనేటికి నైరుతిమూలన ఒక శిలను, వాయవ్యమూలన సంధ్యావందన మంటపంలో ఒక శిలను ఛూడవచ్చు నాల్గవ శిల ఆగ్నేయమూలన పునర్నిర్మించిన మెట్లదారి ప్రాకారంలో కలిసిపోయి వుండవచ్చు. అంతేగాక ఈ తీర్థానికి, తూర్పు, పడమర, దక్షిణ దిక్కుల్లో మలచిన గ్రానైటు రాళ్లతో మెట్లును నిర్మింపజేయడమేగాక, తూర్పు పడమర దిక్కుల్లో కోనేటి మెట్లకు అనుసంధించి, భక్తులు ఆధ్యాత్మిక సాధన చేసుకోవడానికి వీలుగా ఈ అచ్యుత దేవరాయలు సంధ్యావందన మండపాలను శిలలతోనే నిర్మింపజేశాడు

ఆ తర్వాత ఆరవీటి వంశస్థుడైన పొట్లపాటి తిమ్మరాజు (అవుకు ప్రభువు) 3-6-1547 తేదీన 'ఆళ్వారు తీర్థం'లో ఏర్పడివున్న దొనల్లో నాల్గవ దొన

(నీళ్ళగుండం) వద్ద తిరువేంగడ ముడయాన్ (శ్రీ వేంకటేశ్వరస్వామి) విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు, ఆ రాజునకు గురువైన "సొట్టై ఏట్టూరు తిరుమల నంబి కుమార తాతయ్యంగారు" ఈ స్వామివారి అర్చనలకు ఏర్పాట్లు చేసినట్లు ఒక శాసనం తెలుపుతున్నది ఈ విగ్రహం ప్రస్తుతం కన్పించడం లేదు

ఆ తర్వాత సదాశివరాయుల కాలంలో 30-1-1563 తేదీన తిరుపతిలో వున్న 'సెవ్వుసాని' అనే దేవదాసి (ఎంబెరువమానడియార్), "నాయనార్ - కపిలేశ్వర ముడైయ - నాయనార్" అని పిలువబడిన శ్రీ కపిలేశ్వరుని సన్నిధిలో ఒక గణపతి విగ్రహాన్ని ప్రతిష్ఠింపజేసి, ఆ స్వామికి నిత్యారాధన నివేదనల కోసం 200 పణాలు సమర్పించినట్లు ఒక శాసనం తెలియజేస్తున్నది కాని ఆ సమయంలో పిడుగుపాటువల్ల శిధిలమైన కపిలేశ్వరుని ప్రాకారం, వంటశాలలను జీర్ణోద్ధరణకోసం ఈ దేవదాసి సమర్పించిన నిధిని రాజ ప్రతినిధి అయిన రాచవీటి నాయకర్ ఉపయోగించినాడు ఈతని చర్యను ఆలయ స్థానత్తార్ (స్థానాధిపతి - ఆలయ అర్చనాది ఆగమ సంప్రదాయం బాగా తెలిసిన ఆలయ అర్చక ప్రముఖుడు) ఆక్షేపించినందువల్ల, ఆ రాచ ప్రతినిధి ఆ దేవదాసి ఏర్పాటుచేసిన నిధికి నెలకు రెండు పణాలు వడ్డీ వచ్చునట్లు నిర్ణయించి, ఆ వడ్డీతో గణపతికి నిత్యారాధనలు పునరుద్ధరించి కొనసాగించినట్లు కూడా తెలుస్తున్నది

ఆ తర్వాతి కాలంలో ఈ కపిలేశ్వరాలయం కరకంబాడిపాళెగార్ ఆధీనంలో వుండినది పిదప మహంతుల పాలనలో దేవస్థానం వారి ఆలయాల్లో చేరినట్లు తెలుస్తోంది.

పిదప 10-2-1865 తేదీన తిరుమల తిరుపతి దేవస్థానం అప్పటి విచారణకర్త అయిన మహంతు ధర్మదాసు కపిలతీర్థ కోనేటి మెట్లను, సంధ్యావందన మండపాలను జీర్ణోద్ధరణ చేసినట్లుగా కపిలతీర్థం కోనేటి దక్షిణగట్టున (నైరుతిమూలన) వున్న శిలాఫలకం స్పష్టం చేస్తున్నది.

ఆ తర్వాత తి.తి. దేవస్థానం ధర్మకర్తల మండలి పాలనలో ఆయా కార్యనిర్వహణాధికారుల పర్యవేక్షణలో అంచెలంచెలుగా ఈ కపిలేశ్వర క్షేత్రం అభివృద్ధి చెందుతూ, నిత్యమూ వేలాది భక్తజనసందోహంతో కోలాహలంగా ఉంటుంది.

## శ్రీ గోవిందరాజస్వామివారి చక్రస్నానం

ప్రాచీనకాలం నుంచి 'చక్రతీర్థం' అని ''చక్రత్తాళ్వారు తీర్థం'' అని ''ఆళ్వారు తీర్థం'' అని ప్రసిద్ధిపొందిన ''కపిలతీర్థం''లో తిరుపతి శ్రీగోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవాల్లో చివరిరోజున 'అవబృధం'' అనబడే 'చక్రస్నానం' క్రీ శ 1557 నుంచి జరుగుతున్నట్లు శాసనాలు స్పష్టం చేస్తున్నాయి

ప్రతి సంవత్సరం సౌరమానం ప్రకారం వృషభమాసం (వైయ్యాసి - అణి)లో అనూరాధ నక్షత్రానికి చక్రస్నానం జరుగునట్లుగా తొమ్మిదిరోజులు ముందుగా తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారికి బ్రహ్మోత్సవాలు ప్రారంభ మవుతాయి చివరి రోజున అనగా అనూరాధా నక్షత్రం రోజున ఉదయం పూట శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ గోవిందరాజస్వామివారు ఒక పల్లకిలోను, శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారు మరొక పల్లకిలోను వేంచేసి ఆలయం నుంచి ఊరేగింపుగా ఆళ్వారు తీర్థానికి (కపిలతీర్థం) వేంచేస్తారు అక్కడ వున్న శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ ముఖమండపంలో శ్రీదేవిభూదేవి సమేతంగా గోవిందరాజస్వామివారికి, శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు వారికి స్నపన తిరుమంజనం జరిగిన తర్వాత శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారుకు మాత్రం కోనేటిలో స్నానం చేయిస్తారు ఆ సందర్భంలో అనేక మంది భక్తులు కపిలతీర్థ కోనేట్లో పవిత్ర స్నానాలు చేస్తారు పిదప ఘనంగా నివేదనలు కర్పూర హారతులు జరిగిన తర్వాత భక్తులకు ప్రసాద వితరణ చేయబడుతుంది ఆ తర్వాత చక్రత్తాళ్వారుతోను దేవేరులతోను శ్రీ గోవిందరాజస్వామి ఊరేగింపుగా ఆలయానికి తిరిగివెళతారు. నేటికీ ప్రతి సంవత్సరం కపిలతీర్థంలో ''చక్రస్నానం'' కోసం శ్రీ గోవిందరాజస్వామి, చక్రత్తాళ్వారుతో కూడా తరలివస్తున్నారు.

## శ్రావణ పౌర్ణమి - జంధ్యాల పండుగ

ప్రతి సంవత్సరం శ్రావణమాసం పౌర్ణమినాడు జంధ్యాల పండుగ రోజున ఉదయం శ్రీ గోవిందరాజస్వామి ఒక్కరే ఒక పల్లకిపైన, శ్రీ కృష్ణస్వామివారు శ్రీ సుదర్శన భగవానుడు వేర్వేరు పల్లకిలపైన వేంచేసి, ఊరేగింపుగా ''చక్రతీర్థమ''ని పిలువబడే కపిలతీర్థానికి వేంచేస్తారు. అక్కడ వేణుగోపాల స్వామి ఆలయంలోని మండపంలో అర్చక స్వాములు, శ్రీ గోవిందరాజస్వామివారికి, శ్రీకృష్ణ సుదర్శనులకు తిరుమంజనాదులు వైఖానసాగమ శాస్త్రోక్తంగా నూతన-

యజ్ఞోపవీతాలు ధరింపజేసి ఘనంగా నివేదన హారతులు ఇస్తారు. తర్వాత యధాక్రమంగా శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయానికి ఊరేగింపుగా తిరిగి వెళతారు.

## కార్తీక పౌర్ణమి

కార్తీక మాసంలో పౌర్ణమినాడు, శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ గోవిందరాజ స్వామివారు, పల్లకిపైన వేంచేసి ఆళ్వారు తీర్థంలోని ఈ శ్రీ వేణుగోపాలస్వామి ఆలయానికి వేంచేస్తారు శ్రీ వేణుగోపాల స్వామి ముఖమండపంలో శ్రీ గోవిందరాజస్వామివారికి అభిషేకాలు అయిన తర్వాత ఘనంగా నివేదనలు జరుగుతాయి పిదప శ్రీ గోవిందరాజస్వామి ఆలయానికి తెరిగి వెళతారు శ్రీ గోవిందరాజస్వామి ఆలయానికి తిరిగి వెళ్లిన తర్వాత ఆ సాయంత్రం గోవిందరాజస్వామి ఆలయంలో కార్తీక దీపోత్సవం జరుగుతుంది

## శ్రీ ఆండాళ్ (గోదాదేవి) ఆస్థానం

ప్రతి సంవత్సరం కనుమ పండుగ రోజున తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయం నుండి శ్రీ గోదాదేవి ధరించిన పూలమాల తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామికి పంపబడుతుంది పిదప గోదాదేవి, గోవిందరాజస్వామి ఆలయం నుండి బయలుదేరి దక్షిణమాడ వీధిలోని పెరియాళ్వార్ (విష్ణుచిత్తుడు). ఆలయానికి ఊరేగింపుగా వెళుతుంది అక్కడ తండ్రియైన విష్ణుచిత్తునికి శ్రద్ధాంజలి ఘటించిన తర్వాత గోదాదేవి ఊరేగింపుగా ఆళ్వార్‌తీర్థ (కపిలతీర్థం)నికి వేంచేస్తుంది ఈ తీర్థ జలంతో శ్రీ గోదాదేవికి తిరుమంజనం, నివేదన హారతులు ఘనంగా జరుగుతవి తరువాత గోదాదేవి ముత్తైదువలకు వాయనమిచ్చిన పిదప ఊరేగింపుగా ఆలయానికి తిరిగివెళ్ళిన తరువాత శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలో శ్రీ గోదాపరిణయోత్సవ వేడుకలు జరుగుతవి.

## శ్రీ కోదండరామస్వామి వారి చక్రస్నానం

ప్రతి సంవత్సరం సౌరమానం ప్రకారం మీనమాసం (మార్చి – ఏప్రిల్)లో మృగశిర్షా నక్షత్రానికి అవబృధం (చక్రస్నానం) జరుగునట్లుగా తొమ్మిదిరోజులు ముందు నుంచి తిరుపతి శ్రీ కోదండరామస్వామివారికి బ్రహ్మోత్సవాలు జరుగుతాయి.

చివరి రోజున అనగా మృగశిర్ష నక్షత్రం రోజున ఉదయం పూట శ్రీ సీతాలక్ష్మణ సమేతంగా శ్రీ కోదండరామస్వామి ఒక పల్లకిపై, శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారు మరొక పల్లకిపై వేంచేసి, ఆలయం నుంచి ఊరేగింపుగా ఆళ్వారు తీర్థానికి (కపిలతీర్థం) చేరుకొంటారు. అక్కడ శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ ముఖమండపంలో శ్రీ సీతారామ లక్ష్మణులకు, చక్రత్తాళ్వారుకు పాలు, పెరుగు, తేనె, చందనం మున్నగు ద్రవ్యాలతో స్నపన తిరుమంజనం వైభవంగా జరుగుతుంది. పిదప చక్రత్తాళ్వారును మాత్రం కోనేట్లో ముంచి స్నానం చేయిస్తారు. ఈ చక్రస్నానం సందర్భంలో అనేకమంది భక్తులు పవిత్రస్నానాలు చేస్తారు. పిదప నివేదన హారతులు జరిగిన తర్వాత తిరిగి ఆలయానికి ఊరేగింపుగా వెళ్లడంతో ఈ కోదండరామస్వామి చక్రస్నానం ముగుస్తుంది

## కపిలేశ్వరస్వామి త్రిశూలస్నానం

ప్రతి సంవత్సరం మాఘమాసంలో మహాశివరాత్రి సందర్భంగా శ్రీ కామాక్షి సమేత శ్రీ కపిలేశ్వరస్వామి వారలకు ఐదురోజులపాటు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. చివరిరోజు ఫాల్గుణ శుక్ల ప్రతి పత్‌రోజున (పాడ్యమి) ఉదయం కపిలేశ్వరస్వామివారి ప్రధాన ఆయుధమైన త్రిశూలస్వామివారికి కపిలతీర్థ పుష్కరిణిలో ''త్రిశూలస్నానం'' జరుగుతుంది. ఆ సందర్భంగా శ్రీ చంద్రశేఖరస్వామి, మనోన్మణి అమ్మవారలు ఒక పల్లకిపైనా, శ్రీ త్రిశూలస్వామి మరొక పల్లకిపైనా వేంచేసి, ఆలయంలోపలినుంచి కపిలతీర్థ పుష్కరిణి వరకు బాజాభజంత్రీలతో ఊరేగింపుగా వస్తారు. కపిలతీర్థ పుష్కరిణివద్ద శ్రీ త్రిశూలస్వామివారి (పంచలోహప్రతిమకు) కి మాత్రం స్నపన తిరుమంజనం చేయిస్తారు. పిదప త్రిశూలస్వామిని కపిలతీర్థపుష్కరిణిలో ముంచి పవిత్ర స్నానం చేయిస్తారు. ఆ సందర్భంలో అనేక మంది భక్తులు కోనేట్లో మునిగి పవిత్ర స్నానాలు చేస్తారు.

పిదప శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలకు త్రిశూలస్వామికి ఘనంగా నివేదన హారతులు ఇస్తారు. తర్వాత శ్రీ స్వామివారలు ఆలయంలో ప్రవేశిస్తారు

ప్రతి సంవత్సరం మార్గశిర పౌర్ణమికి పూర్తి అగునట్లుగా మూడు రోజులపాటు ప్రతిరోజు సాయంత్రం కపిలతీర్థ పుష్కరిణిలో శ్రీ కపిలేశ్వరస్వామివారలకు తెప్పోత్సవాలు జరుగుతవి.

కపిలతీర్థంలో మొదటిరోజున చక్కగా అలంకరింపబడిన తెప్పపై శ్రీ సిద్ధి వినాయక స్వామివారికి, శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలకు, రెండవరోజున, శ్రీ వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారికి, మూడవ రోజున శ్రీ సోమాస్కందమూర్తికి, శ్రీ కామాక్షీ అమ్మవారలకు తెప్పోత్సవాలు వైభవంగా జరుగుతాయి. ఈ తెప్పోత్సవాలు వేలాదిమంది భక్తులు దర్శిస్తారు.

వేంకటాచల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామి అర్చావమూర్తిగా అవిర్భవించడానికి చాలా పూర్వమే, ప్రసిద్ధమైన శైవ, వైష్ణవ పుణ్యతీర్థ రాజంగా, దివ్యక్షేత్రంగా భాసిల్లుతూ వున్న ఈ కపిలతీర్థ క్షేత్రం నిత్యమూ భక్తులతో సందడిగా వుంటుంది. తిరుమల యాత్రికులు కూడా అనేకులు కపిలతీర్థంలో వెలసి వున్న శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారలను, శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామివారలను, శ్రీ లక్ష్మీనారాయణులను దర్శిస్తుంటారు.

అంతేగాక. భక్తులు, యాత్రికులు నిత్యమూ ఈ తీర్థంలో పవిత్ర స్నానాలు చేస్తూ ఆయా సన్నిధిల్లో దీపాలు వెలిగిస్తుంటారు. ముఖ్యంగా కార్తీకమాసం మొదలు మాఘమాసం వరకు నాలుగు నెలల వరకు పవిత్ర స్నానాలతో, అభిషేకార్చనలతో కపిలతీర్థం అత్యంత కోలాహలంగా వుంటుంది.

కేవలం దర్శనం, స్నానాదుల చేత మాత్రమే ఎందరికో పాపాలను పోగొడుతూ, మరెందరికో అంతుబట్టని రోగాలను విచిత్రంగా బాపుతూ, ఇంకెందరకో గ్రహదోషాలను నివృత్తి చేస్తూ, మరెందరికో లౌకిక పారలౌకిక ఇష్టార్థాలను ప్రసాదిస్తూ వున్న ఈ కపిలతీర్థ పుష్కరిణికి తూర్పు, దక్షిణ, పశ్చిమ దిక్కుల్లో భక్తుల స్నానాదుల సౌకర్యం కోసం చక్కని సోపానాలు (మెట్లు) నిర్మించబడినాయి.

ఈ కోనేటికి తూర్పు దిక్కున మెట్లకు పైభాగాన ఈ క్షేత్రంలో ప్రధాన అధిదైవంగా కొలువై వున్న శ్రీ కామాక్షీ సమేతంగా శ్రీ కపిలేశ్వరస్వామి వారి ఆలయం నెలకొని వుంది.

అలాగే ఈ కోనేటికి దక్షిణ దిక్కున ఎత్తైన సంభాలతో విరాజిల్లుతూవున్న 'రంగమండపం', ఆ మండపానికి అనుసంధానింపబడుతూ ఉత్తరాభిముఖంగా "శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం; దీనికి ప్రక్కనే తూర్పుముఖంగా 'శ్రీలక్ష్మీనారాయణస్వామి మందిరం" నిర్మింబడివున్నాయి.

ఇక కోనేటికి పడమటి దిక్కున మెట్లకు పై భాగాన తూర్పుముఖంగా, అనగా శ్రీ కామాక్షీ కపిలేశ్వరాలయానికి అభిముఖంగా ఒక గృహాలయం వుంది. దాన్ని 'నరసింహగుహ' అంటారు.

కపిలతీర్థానికి ఉత్తరం దిక్కున ఎత్తైన కోటగోడవలె శ్రీ వేంకటాచల శిలామయ పర్వతం వుంది. ఆ పర్వత శిఖరాల మీది నుంచి ఎన్నో పవిత్ర తీర్థ జలాలతో వర్షాకాలంలో విశేషంగాను, మిగిలిన కాలాల్లో సాధారణంగాను జాలువారుతూ వున్న సహజమైన, సుందరమైన జలపాతం, ఈ కపిలతీర్థానికి విశేషాకర్షణమేగాక భక్తుల మనస్సులను అహ్లాదపరుస్తూ వుంటుంది.

మనం ఇంతవరకు కపిలతీర్థ పుష్కరిణీ మహత్యాన్నీ, వేంకటాచల పర్వతం మీది నుంచి కపిలతీర్థ పుష్కరిణిలో కలిసే అనేక పవిత్ర తీర్థాలను గూర్చి తెలుసుకున్నాం. ప్రస్తుతం ముందుగా ఈ పుష్కరిణికి తూర్పుదిక్కున వున్న శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వర క్షేత్రాన్ని గూర్చి, అందలి ప్రతిమా మూర్తుల గూర్చి, ఆ ఆలయంలో జరిగే ఉత్సవాలను గూర్చి, ఊరేగింపుల గూర్చి వివరంగా తెలుసుకుందాం.

## శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామి ఆలయం

కపిలతీర్థ పుష్కరిణికి ఆగ్నేయమూలలో వున్న మెట్లను ఎక్కిపైకి వెళ్లితే శ్రీ కామాక్షీ కపిలేశ్వరాలయంలో ప్రవేశిస్తాం. మెట్లు ఎక్కితేనే ముందుగా శ్రీ కపిలేశ్వరస్వామివారి కల్యాణమండపం వుంది. విశాలమైన ఈ కల్యాణ మండపంలో శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారలకు ప్రతి సోమవారం సాయంత్రం ఊంజల్‌సేవ (డోలోత్సవం) జరుపబడుతుంది. అందువల్లే ఈ మండపాన్ని డోలోత్సవ మండపం అని కూడా అంటారు. ప్రతి నెలా మాసశివరాత్రి నాడు, మహాశివరాత్రి సందర్భంలోను ఈ మండపంలోనే శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారలకు కల్యాణోత్సవాలు జరగడమేగాక, ప్రతి సంవత్సరం దేవీ నవరాత్రులలో పదిరోజుల పాటు శ్రీ కామాక్షి అమ్మవారికి డోలోత్సవం జరుబడుతుంది. ప్రతి సంవత్సరం కార్తీక మాసం కృత్తికా నక్షత్రం రోజున ఈ మండపంలో దీపోత్సవం జరుగుతుంది. ఇలాగ అనేక విధాలుగా ఉపయోగపడుతున్న ఈ కల్యాణ మండపాన్ని దాటి లోపలికి వెళితే ఉండేదే ధ్వజస్తంభ మండపం. ఈ మండపంలో ముందుగా మనకు శ్రీ సిద్ధి వినాయక స్వామి దర్శనమిస్తాడు, దర్శించండి!.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!*

## శ్రీ సిద్ధి వినాయక స్వామి

"భక్తసంచిత పాపౌఘ
విధ్వంసన విచక్షణమ్
విఘ్నాంధకార భాస్వంతం
విఘ్నరాజ మహంభజే.

"ఏకదంతం శూర్పకర్ణం
గజవక్త్రం చతుర్భుజమ్.
పాశాంకుశ ధరం దేవం
ధ్యాయే త్సిద్ధివినాయకమ్.

కపిలతీర్థ పుణ్యక్షేత్రంలో తొలుదొల్త ఆలయం ముంగిట దర్శనమిస్తూ, భక్తుల పాపాలను విధ్వంసం చేస్తూ, విఘ్నాలనే చీకట్లను పారద్రోలుతూ దివ్యభాను తేజంతో ప్రకాశించే విఘ్నరాజు శ్రీ సిద్ధి వినాయకస్వామి

శ్రీ కపిలేశ్వరస్వామివారి ఆలయ ప్రాంగణంలో ధ్వజస్తంభమండపంలోనే పశ్చిమాభిముఖంగా శ్రీ సిద్ధివినాయక స్వామివారి సన్నిధి వెలసి వుంది సుమారు 5'X5' అడుగుల కొలతలతో నిర్మింపబడిన చిన్న గుడిలో 2 అడుగుల ఎత్తు వున్న తిన్నెపై (అరుగుపై) సుమారు 3 అడుగుల ఎత్తుతో శ్రీ సిద్ధి వినాయకస్వామివారు అర్చా (శిలా) మూర్తిగా ప్రతిష్ఠితుడై ఆనందంగా దర్శనమిస్తూ భక్తులను తరింపజేస్తూ వున్నాడు ఈ వినాయకుని సన్నిధి గడపకు లోపలివైపు చెక్క తలుపులు, వెలుపల ఇనుప కడ్డీల వాకిళ్లు అమర్చబడివున్నాయి

చతుర్భుజుడైన శ్రీ స్వామివారు పై కుడిచేతిలో అంకుశాన్ని క్రింది కుడిచేతిలో విరిగిన దంతాన్ని, అలాగే పై ఎడమ చేతిలో పాశాన్ని, క్రింది ఎడమచేతిలో మోదకాన్ని (కుడుము) పట్టుకొని దాన్ని తొండంతో స్వీకరిస్తున్నాడు పెద్ద బొజ్జతో, చేట చెవులతో, నాగాభరణాలతో, కిరీటహారాది అలంకారాలతో పీఠికపై ఆసీన భంగిమలో కుడిపాదాన్ని క్రిందికి జారవిడిచి, ఎడమకాలును మడిచి మూషికవాహనుడై దివ్యదర్శనాన్ని అనుగ్రహిస్తూ వున్నాడు

ప్రతిరోజు ఉదయం శ్రీ కామాక్షీదేవి శ్రీ కపిలేశ్వరస్వామివారలకంటే మునుముందుగా ఈ సిద్ధి వినాయకస్వామివారికి అభిషేక అర్చనలు జరుపబడుతాయి.

పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్లు, చందనం, పన్నీరు మున్నగు ద్రవ్యాలతోను, శుద్ధ జలంతోను అభిషేకం జరిగిన తర్వాత, శుభ్రమైన వస్త్రాలను

అలంకరించి వెండి కవచాలను అందంగా అమరుస్తారు. అనంతరం పుష్పాలంకరణ, అర్చన కావించిన తరువాత నివేదన సమర్పిస్తారు. ఈ నివేదనలు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం ఇలా మూడు పూటలా జరుపబడుతాయి.

ఉదయం శుద్ధాన్నం, పులిహోర, మిరియపు పొంగలి, మధ్యాహ్నం దధ్యోదనం, శుద్ధాన్నం, సాయంత్రం చక్కెరపొంగలి, పాయసం, వడలు నివేదింపబడుతాయి. ప్రతి శుక్రవారం నాడు సాయంత్రం పూట ప్రత్యేకంగా పోళీలు (పూరణపు భక్ష్యాలు) కూడా నివేదింపబడతాయి.

ప్రతిమాసంలో శుద్ధ చవితినాడు స్వామివారికి ఘనంగా విశేష అభిషేకార్చనలు నిర్వహింపబడుంటాయి.

భాద్రపద శుద్ధ చవితి (వినాయక చవితి)నాడు విశేషంగా ఈ వినాయకునకు అభిషేకార్చనలు జరిగిన తర్వాత, ఆ సాయంకాలం, అర్చన, అరాధనలు, నివేదనలు ప్రదోషకాల మహా మంగళ హారతులు నిర్వహిస్తారు. పిదప శ్రీ సిద్ధి వినాయకస్వామివారి ఉత్సవమూర్తిని, మూషిక వాహనంపై వేంచేయించి తిరుపతి పురవీధుల్లో ఊరేగింపు జరుపుతారు.

శ్రీ సిద్ధి వినాయకస్వామివారి శిలామూర్తితోపాటు క్షేత్రంలో లోపలి ముఖమండపంలో, శ్రీ కపిలేశ్వరస్వామివారి గర్భాలయ ప్రవేశద్వారానికి కుడివైపున - అంటే ఉత్తరం దిక్కున - పశ్చిమాభిముఖంగా సుమారు ఒక అడుగు ఎత్తుగల "ద్వార గణపతి" శిలా విగ్రహం ఉన్నది ఈ శిలా మూర్తియే గాక, "పరివార దేవతల మండపం"లో దక్షిణాభిముఖంగా "మహా గణపతి"గా పేర్కొనబడే 2 అడుగుల శిలాప్రతిమ, అదేవరసలో పశ్చిమాభిముఖంగా "ప్రమథ గణపతి" అని పిలువబడే 1½ అడుగుల శిలాప్రతిమ కూడా నెలకొని ఉన్నాయి. ఈ విగ్రహాలను గూర్చి తర్వాత ముచ్చటించుకొందాం.

విజయనగర చక్రవర్తి సదాశివరాయల కాలంలో తిరుపతిలో ఉండిన "సెవ్వసాని" అనే పేరుగల దేవదాసి (ఎంబెరుమానడియార్) ఒక గణపతి విగ్రహాన్ని ఈ క్షేత్రంలో ప్రతిష్ఠ చేయించినట్లు, ఆ గణపతికి నిత్యదీపారాధన, నివేదనలకు గాను 2 0 0 పణాలు నిధిని సమర్పించినట్లు, ఇంకా ఆ భక్తురాలు తాను స్వయంగా శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల సన్నిధిలో నృత్యం చేస్తూ, స్వామివారిని సేవించినట్లుగా దేవస్థాన శాసనాలు పేర్కొంటున్నాయి. కాని పైన పేర్కొన్న గణపతి మూర్తులలో సెవ్వసాని ప్రతిష్ఠించిన విగ్రహం ఫలానిదని నిర్ణయించేందుకు తగిన ఆధారాలు లేవు.

ఇవిగాక, శ్రీ సిద్ధివినాయకస్వామివారి స్థానక (నిలిచివున్న) పంచలోహ ఉత్సవమూర్తి కూడ ఆలయంలోని ఏకాంత సేవా మండపంలో నెలకొని వుంది. ఆ మూర్తికి జరిగే ఉత్సవ విశేషాలు మునుముందు తెలిసికొందాం.

సర్వగ్రహదోషాలను, సమస్త పాపాలను నివారించడమే గాకుండా, సర్వార్థ సిద్ధి ప్రదమూ అయిన శ్రీ కపిలేశ్వర క్షేత్రంలో తొలిపూజలనందుకొంటూ వున్న ఈ సిద్ధి వినాయకుని భక్తి ప్రపత్తులతో ఇలా ప్రార్థించుందాం.

శ్లో॥ *నమస్తుభ్యం గణేశాయ నమస్తే విఘ్ననాశన!*
*ఈప్సితం మేవరం దేహిపరత్ర చ పరాంగతిమ్*
*వినాయక! నమస్తుభ్యం సతతం మోదకప్రియ!*
*నిర్విఘ్నం కురుమే దేవ! సర్వకార్యేషు సర్వదా.*
*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

## బలిపీఠం - ధ్వజస్తంభం

శ్రీ కపిలేశ్వరస్వామివారి ఆలయం ముఖమండపం వెలుపల శ్రీ స్వామివారికి ఎదురుగా ఎత్తైన "ధ్వజస్తంభం", ఆ ధ్వజస్తంభ వేదికను ఆనుకొని పశ్చిమంగా "బలిపీఠం" ఏర్పాటు చేయబడివున్నాయి.

శ్రీ స్వామివారి ప్రధాన ప్రవేశద్వారానికి ఎదురుగా సుమారు ఐదు అడుగుల ఎత్తుగల ధ్వజస్తంభ పీఠం, చెక్కడపు శిలలతో నిర్మించబడింది. దీనిపై సుమారు 20 అడుగుల పొడవైన ధ్వజస్తంభం ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ పొడవైన దారు స్తంభానికి చక్కగా వెండి కవచం తొడబడి వుంది. ఈ ధ్వజస్తంభం మీద శ్రీ కపిలేశ్వరస్వామివారికి అభిముఖంగా తూర్పుముఖంగా త్రిశూలం, దక్షిణాభిముఖంగా శ్రీ సిద్ధివినాయకస్వామి, పశ్చిమాభిముఖంగా వృషభవాహనారూఢులైన పార్వతీపరమేశ్వరులు, ఉత్తరాభిముఖంగా, మయూర వాహనుడైన కుమారస్వామిమూర్తుల శిల్పాలు చెక్కబడి ఉన్నాయి.

ధ్వజస్తంభ పీఠాన్ని అనుకొని పశ్చిమంగా చెక్కడపు శిలలతో సుమారు ఐదు అడుగుల ఎత్తుగల బలిపీఠం నిర్మించబడింది.

ఆలయానికి అరుదెంచే భక్తులు ఆలయగోపురం, గర్భాలయశిఖరం, ధ్వజస్తంభం,బలిపీఠం,ప్రాకారం, అర్చకస్వామి, మూలమూర్తిగా ప్రతిష్ఠించబడిన

శివలింగం - శివభక్తుడైన చండికేశ్వరస్వామి - ఇలా ఆలయానికి సంబంధించిన ప్రధానమైన స్థలాల్లో పరమేశ్వరుణ్ణి మనసారా భావిస్తూ కళ్లారా దర్శిస్తూ, నోరారా కీర్తించవలెనని శాస్త్రాలు చాటుతూ వున్నాయి. ఈ నియమాన్ని అనుసరించి మనం శ్రీ కపిలేశ్వరస్వామివారి బలిపీఠాన్ని, ధ్వజస్తంభాన్ని స్పృశిస్తూ, ప్రదక్షిణం చేస్తూ సాక్షాత్తు పరమేశ్వరుని అంశాలుగా భావించి భక్తి ప్రపత్తులతో కొనియాడుదాం.

అంతేగాక ఆలయం గోపురాన్ని "స్థూలలింగం"గాను, మూల లింగాన్ని "సూక్ష్మలింగం"గాను, బలిపీఠాన్ని "భద్రలింగం"గాను శైవాగమం పేర్కొంటూ వుండటాన్ని బట్టి బలిపీఠం, ధ్వజస్తంభ ప్రాముఖ్యతలు మనకు చక్కగా వెల్లడవుతున్నాయి.

ఇలా పరమపవిత్రమైన బలిపీఠానికి, ధ్వజస్తంభ పీఠానికి ప్రతిరోజు ఉదయంపూట మాత్రం ఆలయంలోని అన్ని మూర్తులతోపాటు శుద్ధజలంతో అభిషేకం చేస్తారు. ఆ తరువాత ఆ యా దేవతామూర్తులందరకు నివేదనలు నిర్వహించిన అనంతరం ఈ బలిపీఠంపై శుద్ధాన్నాన్ని జలాన్ని బలిగా సమర్పిస్తారు. రాత్రింబవళ్లు సంచరించే భూత, ప్రేత, పిశాచ, శాకినీ, డాకినీ, పిశాచాది గణాలు ఈ బలిపీఠం మీద సమర్పించిన బల్యన్నాన్ని ఆహారంగా స్వీకరించి సంతృప్తి చెంది భక్తులకు కీడును చెయ్యకుండా వుంటాయని శాస్త్ర ప్రమాణం.

ఇంతటి ప్రాధాన్యతను సంతరించుకున్న బలిపీఠంతో సహా ధ్వజస్తంభానికి నమస్కరించి ఆలయంలోపల ప్రవేశించుదాం.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

## ద్వార పాలకులు

శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారి ప్రధాన ఆలయప్రవేశ ద్వారానికి ఇరువైపులా ఇద్దరు శివకింకరులు అహరహం అప్రమత్తులై కాపలా కాస్తుంటారు. ఈ ద్వార పాలకులను "దిండి", "ముండి" అని పిలుస్తారు.

సుమారు నాలుగు అడుగుల ఎత్తువున్న శిలామూర్తులైన ఈ ద్వారపాలకులు ఇరువురు పై కుడిచేతిలో ఢమరుకాన్ని, పై ఎడమచేతిలో త్రిశూలాన్నీ ధరించివున్నారు. ద్వారానికి ఉత్తరం దిక్కున వున్న 'దిండి' క్రింది కుడిహస్తాన్ని నడుముపై ఉంచి ఎడమచేతితో గదను నేలకానించి నిలిచి వుండగా,

దక్షిణదిక్కున వున్న 'ముండి' కుడి చేత్తో గదను నేలకానించి నిలిచి ఎడమచేతిని కటిపై (నడుము) ఉంచి నిలిచివున్నారు. వీరియువురుశ్రీ కపిలేశ్వరస్వామివారి దర్శనానికి వచ్చే భక్తులను నిశితంగా పరిశీలిస్తుంటారు. ఈ ద్వార దేవతలిరువురి యొక్క ఆకృతుల్లోను కిరీటాది ఆభరణాలు సూచితంగా శిల్పించబడి ఉన్నాయి

ద్వారపాలకులు కాపలాకాస్తూ వున్న ప్రవేశ ద్వారం చెక్కడపు శిలలతో నిర్మించబడి వుంది. ఈ ద్వారానికి లోపలివైపు చెక్క తలుపులు, బయటవైపు కర్ణీలవాకిళ్ళు బిగించబడి ఉన్నాయి.

ద్వారపాలకులు కాపలాకాస్తూ వున్న ఈ వాకిళ్ల ముందరే ప్రతిరోజు తెల్లవారు జామున వేదపండితుల చేత *"శ్రీ కామాక్షీ కపిలేశ్వర సుప్రభాతం"* పఠింపబడటం ద్వారా మేలుకొలుపు సేవ సాగుతుంది.

అయితే ధనుర్మాసంలో నెలరోజులు మాత్రం ఈ కపిలేశ్వర సుప్రభాత పఠనం జరుపబడదు! ఈ ధనుర్మాసం రోజుల్లో పూర్వం సుప్రభాతానికి బదులుగా మహాశివభక్తుడైన మాణిక్యవాచకర్ పాడిన "తిరువెంబావై" తమిళ తేవారాలు ఈ వాకిళ్లముందు గానం చేయబడేవి. ఇటీవలి కాలంలో ఈ తేవారగాన సంప్రదాయం నిలిచిపోయింది.

ప్రస్తుతం ధనుర్మాసం ఒక్క నెల రోజులు మాత్రం తెల్లవారు జామున "సుప్రభాత పఠనం" కాని "తిరువెంబావై" పఠనంకాని లేకుండానే ఆలయం తలుపులు తెరచిన వెంటనే ఆలయశుద్ధి, అర్చామూర్తులందరకు అభిషేకం అర్చన, నివేదన, మంగళహారతులు జరుపబడుతూ వున్నవి. ధనుర్మాసంలో తెల్లవారు జామున నిర్వహించే అభిషేకాదులను, 'ధనుర్మాసపూజ' అంటారు ఈ సమయంలో భక్తులు అనేకులు కపిలతీర్థ పుష్కరిణిలో స్నానమాడి శ్రీ కామాక్షీ కపిలేశ్వరులను, నవగ్రహ దేవతలను నియమనిష్ఠలతో సేవించి పునీతులు కావడం విశిష్టంగా గోచరిస్తుంది.

ప్రతిరోజు ఉదయం పూట మాత్రమే, ఆలయంలోని ఇతర పరివార దేవతలతో పాటుగా ఈ ద్వారపాలకులకు అభిషేకం, మూడు పూటలా నివేదనలు జరుపబడుతున్నవి.

శ్రీ కామాక్షీ కపిలేశ్వరుని సన్నిధిని నిత్యమూ అప్రమత్తులై కాపలా కాస్తూ వున్న ఈ ద్వారపాలకులను శ్రీ స్వామివారి సేవకు అనుమతించవలసినదిగా ప్రార్థిస్తూ ఆలయంలో ప్రవేశించుదాం.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

## ముఖమండపం

ధ్వజస్తంభ మండపంలో నుండి ద్వారపాలకులైన 'దిండి', 'ముండి' కాపలాకాస్తున్న ప్రవేశద్వారాన్ని దాటితే ముఖమండపంలో ప్రవేశిస్తాం.

కపిలేశ్వరస్వామివారి ఆలయం యొక్క ప్రధాన ద్వారంలో ప్రవేశించిన వెంటనే ఉన్న మండపాన్ని ముఖమండపం అంటారు. ఈ ముఖమండపమే శ్రీ కామాక్షీ శ్రీ కపిలేశ్వరస్వామివారలకు ప్రదక్షిణాపథంగా ఉపయోగపడు తున్నది. అర్ధవృత్తాకారంలో వున్న ఈ ప్రదక్షిణ మార్గం ముఖమండపం పరివార దేవతామండపాల గుండా కొనసాగుతుంది. ప్రాచీన కాలంలో దేవదాసీలు నిత్యమూ ప్రదోషవేళలో ఈ ముఖమండపంలో శ్రీ కామాక్షీ దేవి కపిలేశ్వరస్వామి వారలకు సంప్రీతిగా నృత్యం చేస్తూ భక్తి ప్రపత్తులతో నృత్య సంగీతాలతో కొనియాడుతూ నృత్యసేవ చేసేవారట. అందువల్లే ఈ ముఖ మండపం 'నృత్యమండపం'మని కూడా పిలువబడుతూ వుంది.

వరుసకు ఐదు స్తంభాల వంతున మూడు వరుసలుగా మొత్తం పదునైదు స్తంభాలతో నిర్మింపబడిన విశాలమైన ఈ ముఖమండపంలోని శిలాస్తంభాలపై కామధేనువు క్షీరంతో అభిషేకిస్తున్న కపిలేశ్వర లింగం, భక్త కన్నప్ప అర్చిస్తున్న శ్రీకాళహస్తి లింగం, ఆంజనేయ స్వామి, నందీశ్వరుడు, చతుర్భుజ గణపతి, మయూర వాహనుడైన కుమారస్వామి, మహర్షులు యోగులు ఇలాంటి శిల్పాలు చెక్కబడినాయి.

ఉత్తర దిశ వరుసలోను, దక్షిణదిశ వరుసలోను ఉన్న స్తంభాలు మాత్రం తరువాతి కాలాల్లో నిర్మింబడిన గోడల్లో కలిసిపోయి వున్నందున వాటి శిల్పాలు వివరాలు తెలియరావడం లేదు. పైగా ఇటీవలి కాలంలో ఆ స్తంభాలతో పాటు గోడలకు పూర్తిగా చలువరాళ్లను పరచినందువల్ల ఏ మాత్రం వివరాలు కానరావడం లేదు.

శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారల గర్భాలయాలకు రెండింటికి ఒకే ముఖమండపంగా నిర్మింబడిన ఈ మండపం నుండి ప్రారంభమయ్యే ప్రదక్షిణా మార్గం అర్ధవృత్తాకారంలో వుంటుంది.

ఈ ముఖమండపంలో శ్రీ కపిలేశ్వరమహాలింగానికి ఎదురుగా, స్వామివారికి అభిముఖంగా మనోహరమైన భక్తి రమణీయమైన నందీశ్వరుని శిలావిగ్రహం, అలాగే శ్రీ కామాక్షీఅమ్మవారికి ఎదురుగా 1½ అడుగుల శిలావేదికపై శిలా విగ్రహమైన సింహ వాహనం ప్రతిష్ఠింపబడినాయి.

ఇవిగాక శ్రీ కపిలేశ్వరస్వామివారి గర్భాలయంలో ప్రవేశించే ద్వారానికి ఇరువైపులా ద్వారగణపతి (ఉత్తరదిక్కున), ద్వార కుమారస్వామి (దక్షిణ దిక్కున) నిలిచి వుంటూ మయూర వాహనంతో శిలామూర్తులు వున్నాయి. వీటిలో గణపతిమూర్తి ఆసీన భంగిమలో సుమారు ఒక అడుగు ఎత్తు వుంటుంది. కుమారస్వామిమూర్తి స్థానక భంగిమలో మయూరవాహనంతో సుమారు రెండు అడుగుల ఎత్తు వుంటుంది.

ఈ మండపంలోనే శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల గర్భాలయాలు రెండింటి మధ్యన ఉన్న ప్రదేశంలో "శ్రీకపిలేశ్వర మహాలింగావిర్భావ శిల్పం" సిమెంటుతో నిర్మింపబడి వుంది. అత్యంత రమణీయమైన ఈ శిల్పం చూపరులకు అద్భుతంగా భక్తి పారవశ్యాన్ని కలిగిస్తున్నది.

"కూర్మస్య పరి సుస్థితే ఫణిపతౌ
తస్మిన్ధ్రా భూమౌ స్థితమ్
లింగం గోః పయసాభిషిక్తమనఘ
మణిం గోపాలరూపం హరిమ్
తత్రైవ శ్రీ కపిలర్షిణా పరమయా
భక్త్యా సుమ్నైః పూజితమ్
దృశ్యం చిత్ర మహో! త్రిమూర్తి మిళితం
ధ్యాయామి లింగోత్తమమ్."

- శ్రీ ఎం.వి.రామనాథ ఘనాపాఠి

శ్రీ కూర్మం మీద ఆదిశేషుడు - ఆ ఆదిశేషునిపై భూమండలం - ఆ భూమిని భేదించుకొని పైకి వచ్చిన పాతాళలింగం - ఆ మహాలింగాన్ని

బ్రహ్మదేవుడు గోరూపంలో క్షీరంతో అభిషేకిస్తున్నాడు. ఆ సమయంలో శ్రీహరి గోపాలుడై ఆ గోవుని సంరక్షిస్తున్నాడు. ఆ మహాలింగాన్ని కపిలమహాముని పరమ భక్తి మెయి "నాగలింగ సుమాలతో" అర్చిస్తున్నాడు. ఇలాగ త్రిమూర్తి తత్త్వ సమ్మిళితమై భవ్యమై దివ్యమై వెలుగొందుతూ వున్న ఆ సుందరదృశ్యం ఆలోచించే కొద్దీ మహా అద్భుతమై అలరారుతున్నది. అలా అలరారుతూ వున్న శ్రీ కపిలేశ్వర మహాలింగాన్ని ధ్యానిస్తున్నాను.

పైన వివరింపబడిన విశేషాలన్నీ క్రోడీకృతమై విలసిల్లుతున్న శ్రీ కపిలేశ్వరుని శిల్పం, ఎత్తు సుమారు పది అడుగులు వుంటుంది. ఈ శిల్పాకృతిలోని వివరాలు గర్భాలయంలోని మూలమూర్తియైన శ్రీ కపిలేశ్వర మహాలింగమూర్తిపై అత్యంత సహజంగా ఏర్పరుపబడి వున్నాయి. కాని గర్భాలయంలోని మూలమూర్తిని అన్నివేళలా దర్శించుటకు, నిశితంగా పరిశీలించుటకు వీలుపడదు. గనుక అందుకు ప్రత్యామ్నాయంగా భక్తాదులు దర్శించి ఆనందించేందుకు అనువుగా శ్రీ కపిలేశ్వర మహాలింగంపై వున్న వివరాలు కలిగిన ఈ సుందరశిల్ప సన్నివేశాన్ని ముఖమండపంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేయడం జరిగింది.

ప్రతిరోజు సాయంత్రం ప్రదోష సమయాల్లో ఈ ముఖమండపంలోనే శ్రీ కపిలేశ్వరుని సన్నిధి ప్రవేశ ద్వారం వద్ద మరియు శ్రీ కామాక్షీ అమ్మవారి సన్నిధి ప్రవేశద్వారం వద్ద పంచవాద్య సమ్మేళనంతో మహా మంగళ హారతులు ఛత్ర చామరాది సార్వభౌమోచిత ఉపచారాలు దేవేరులకు సమర్పింప బడుతవి.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

## నందీశ్వరుడు

ద్వారపాలకులైన దిండి, ముండీశుల అనుమతిని గైకొని ముఖమండపంలో ప్రవేశించిన భక్తులకు శ్రీ కపిలేశ్వరస్వామివారికి అభిముఖంగా సుమారు రెండడుగుల ఎత్తు, రెండున్నర అడుగుల పొడవు గల నందీశ్వరుని పురాతన శిలామూర్తి దర్శనమిస్తుంది. ఈ శిలామూర్తిని ఆ నాటి కళాకారులు రమణీయమైన అంగసౌష్ఠవం ఉట్టిపడేలాగున ఎంతో పనితనంతో మెడలో మువ్వల దండలతోను, కాళ్లకు గజ్జెలతోను అందంగా మనోహరంగా చిత్రించారు. తొలుత ఈ నందీశ్వరుని సేవించిన తర్వాతనే భక్తులు ఈయన యొక్క

అనుమతితో ఆ కామాక్షీ కపిలేశ్వరులను సేవించవలెనని సంప్రదాయం. శ్రీ కపిలేశ్వరస్వామికి అభిముఖంగా కొలువై శ్రీ స్వామిని అనుక్షణం తదేక దృష్టితో తిలకిస్తూ సేవిస్తున్న ఆ నందీశ్వరుని ఇలా ప్రార్థించాలి.

*'ధర్మ శ్చతుష్పాత్ యుక్తస్త్వం*
*స్వర్ణశృంగః త్రయీ వపుః*
*గోపతే! వాహరూపస్త్వం*
*శూలినః త్వాం నమామ్యహమ్*

*నందీశ్వర! నమస్తుభ్యం*
*సాంబానంద ప్రదాయక!*
*మహాదేవస్య సేవార్థం*
*అనుజ్ఞాం దాతుమర్హసి*

"తపస్సు, శౌచము, దయ, సత్యము" అనే నాలుగు పాదాలతో ధర్మస్వరూపుడవై విరాజిల్లుతూ, శూలి అయిన పరమేశ్వరునికి వాహనంగా సేవలందిస్తూ, విరాజిల్లుతూవున్న నందీశ్వరా! సాంబునికి ఆనంద ప్రదాయకుడవైన నీవు, మహాదేవుడైన పరమేశ్వరుని సేవించుటకై నాకు అనుజ్ఞను ప్రసాదించి నన్ను సంపూర్ణంగా అనుగ్రహించవయ్యా స్వామీ!" అని భక్తి ప్రపత్తులతో నమస్కరించి ప్రార్థించిన తర్వాతనే శ్రీ కపిలేశ్వరుని సేవకు ఉపక్రమించవలెను.

నందీశ్వరుని ప్రార్థించిన తదుపరి శివుని ఇలా దర్శించవలెనని శైవాగమ శాస్త్ర నియమ మొకటి ఉన్నది.

*వృషస్య వృషణం స్పృష్ట్వా*
*శృంగ మధ్యే సదాశివమ్,*
*దృష్ట్వా క్షణం నరోయాతి*
*కైలాసే శివ సన్నిధిమ్*

అని పేర్కొన్నట్లుగా శివాలయానికి వెళ్లిన భక్తులు ఎడమచేతితో నందీశ్వరుని వృషణ భాగాలను తాకుతూ, కుడిచేతి చూపుడు, బొటన వ్రేళ్లను నంది యొక్క రెండు కొమ్ములపై ఉంచి ఆ రెండు వేళ్ల నడుమ కొమ్ములమధ్య నుండి శివలింగాన్ని దర్శించాలి. అలా దర్శించిన భక్తులు శివానుగ్రహమునకు పాత్రులగుటయే గాక తుదకు కైలాసలోకంలో శివసాన్నిధ్యాన్ని పొందగలరని భావం.

ఈ నందీశ్వరుడు నిరంతరం శ్రీ కపిలేశ్వర శ్రీ మన్మహాదేవుని వైపు ముఖము పెట్టి పడుకొని, ఏ మాత్రము చెదరకుండా దృష్టిని ఆ మహాలింగంపై కేంద్రీకరించి, ప్రపంచంవైపు వీపును పెట్టి లౌకిక విషయాలయందు వైముఖ్యాన్ని చూపుతూ నిర్భయుడై వున్నట్లు దర్శనమిస్తూ లోకానికి మహత్తరమైన సందేశాన్ని ప్రబోధిస్తూ వున్నాడు.

ఈ నందీశ్వరుని వలెనే ప్రతి జీవుడూ పరమేశ్వరునిపై దృష్టిని పెడితేచాలు! లౌకిక, పార లౌకిక విషయాలు రెండింటి యందూ సర్వదా రక్షింపబడుతూ వుంటాడని తాత్పర్యం!

''నందీ శంకరయో ర్మధ్యే నాంతరాగమనం భవేత్'' అన్నట్లు, ప్రదక్షిణం చేసే సమయంలో మాత్రమే శివునకు నందీశ్వరునకు మధ్యలో నడువరాదు నందీశ్వరుని వెనుక నుంచి నడుస్తూ శివునకు ప్రదక్షిణం చేయవలెనని నియమం

ప్రతిదినం ఉదయం ఈ నందీశ్వరునకు తదితర దేవతామూర్తులతో పాటుగా అభిషేకం, మూడుపూటలా నివేదనలు సమర్పింపబడుతాయి.

ప్రతి త్రయోదశినాడు ప్రదోషకాలంలో (సాయంసంధ్య) ప్రత్యేకంగా ఈ నందీశ్వరునకు ''ప్రదోషపూజ'' జరుపబడుతుంది. ఈ త్రయోదశి ప్రదోషపూజలో నందీశ్వరునకు ముందుగా తైలాన్ని (నువ్వులనూనె) కలియబూసిన, తర్వాత శీకాయపొడిని బాగుగా అలది జలంతో అభిషేకం చేస్తారు. పిదప నమక చమక మంత్రపూర్వకంగా పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్లు వగైరా ద్రవ్యాలతోనూ, శుద్ధజలంతోనూ అభిషేకం చేసిన అనంతరం పూలమాలలతో అలంకరించి అర్చిస్తారు. ఆ యా పండ్లు ఫలాలతో పాటు దధ్యోదనం (పెరుగన్నం) నివేదిస్తారు.

పిమ్మట భేరీ, ఢమరుక, శంఖం మేళతాళాది భజంత్రీ వాద్యాలతో మహావైభవంగా చేసే మంగళహారతులను ఆ ప్రదోష వేళలో శ్రీ కపిలేశ్వరస్వామి వారితో పాటు నందీశ్వరునకు కూడా కలిపి ఒకేసారిగా ఇస్తారు.

ప్రతి త్రయోదశి రోజున ప్రదోష సమయంలో నందీశ్వరస్వామి వారికి జరిగే ప్రదోష పూజా సమయంలో శ్రీ కపిలేశ్వరస్వామివారికి నందీశ్వరునికి కలిపి ఒక విశిష్టమైన ప్రదక్షిణా క్రమాన్ని భక్తులు దిగువ నిర్వచించిన విధంగా ఆచరిస్తారు.

ముందుగా నందీశ్వరుని దగ్గర నిలబడి, నందీశ్వరునకు నమస్కరించి లోపల వెలసియున్న శ్రీ కపిలేశ్వర మహాలింగానికి నమస్కరించి, అక్కడి నుంచి ప్రదక్షిణంగా సోమసూత్రం (శ్రీ కపిలేశ్వరుని అభిషేకజలం ప్రవహించే గోముఖం) వరకు వెళ్లి, సోమసూత్రం దాటకుండా, అక్కడి నుంచి వెనుకకు అప్రదక్షిణంగా నందీశ్వరుని దగ్గరకు వచ్చి, నందీశ్వరునితోపాటు కపిలేశ్వరునకు నమస్కరించి, అక్కడి నుంచి అప్రదక్షిణంగా నడుస్తూ శ్రీ కామాక్షీ అమ్మవారికి నమస్కరించి, పరివార దేవతా మండపం గుండా అప్రదక్షిణంగానే శ్రీ కపిలేశ్వరుని సోమసూత్రం ప్రక్కనే వున్న శ్రీ చండికేశ్వరస్వామి వద్దకు వెళ్లి, చిటికెలు వేస్తూ ఆయనకు నమస్కరించి, సోమసూత్రం దాటకుండా వచ్చిన మార్గంలోనే వెనుకకు వస్తూ శ్రీ కామాక్షీ అమ్మవారికి నందీశ్వరునకు శ్రీ కపిలేశ్వరునకు నమస్కరిస్తే, అది ఒక ప్రదోషకాల ప్రదక్షిణం అవుతుంది.

ప్రతి త్రయోదశి ప్రదోష పూజా సమయంలో నందీశ్వరునకు పై రీతిలో 16 ప్రదక్షిణల నమస్కారాలకు తక్కువ కాకుండా చేస్తే సర్వదోషాలు తొలగి సకల శ్రేయస్సులు కలుగుతాయని శాస్త్ర నిర్దేశం.

శివకింకరులలో అత్యంత ప్రధానుడై నిరంతరం కపిలేశ్వరుని సేవలో దృష్టి నిలిపి, భక్తులకు సేవాభావాన్ని ప్రబోధిస్తూ వున్న నందీశ్వరునకు నమస్కరించి, తర్వాతి విషయాలను తెలుసుకుందాం.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## శ్రీ కపిలేశ్వర మహాలింగం

కపిలతీర్థంలో వెలసి వున్న ప్రధాన దైవం శ్రీ కపిలేశ్వరస్వామి. ఇచట ఈ పేరుతో స్వయంభూమూర్తిగా అర్చారూపియై శిలాలింగ రూపంలో పరమశివుడు పశ్చిమాభిముఖంగా ఆవిర్భవించి వున్నాడు.

ముఖమండపం దాటిన తర్వాత చిన్న అంతరాళం వుంది. ఈ అంతరాళ గదికి చెక్క తలుపులు బిగింపబడి వున్నాయి. ఈ అంతరాళ గది దాటిన తర్వాత 6'X7'X7' ఘనపుటడుగుల వైశాల్యంగల గర్భాలయం వుంది. ఈ గర్భాలయానికి శిలాద్వార బంధనం మాత్రం వుంది. ఈ శిలా ద్వార బంధానికి ఎలాంటి వాకిళ్లు లేవు.

గర్భాలయం మధ్యభాగంలో పశ్చిమాభిముఖంగా స్వయంభువై అర్చారూపంలో మహాలింగ రూపంలో శ్రీ కపిలేశ్వరస్వామి ఉద్భవించి వున్నారు. భూమితలం నుండి పాణవట్టంతో సహా ఈ శిలాలింగం ఎత్తు సుమారు 3 అడుగుల ఎత్తు ఉంటుంది. ఈ కపిలేశ్వర మహాలింగం పశ్చిమ, ఉత్తర, తూర్పు, దక్షిణ, ఊర్ధ్వముఖాలతో ఇంచుమించు దీర్ఘ చతురస్రాకారంతో దర్శనమిస్తున్నది. ఈ పంచముఖాలు వేద మంత్రాలలో

**"ప్రాచ్యాం తత్పురుషం విద్యా, దఘోరం దక్షిణాముఖమ్**
**సద్యోజాతం ప్రతీచ్యాం తు వామదేవ ముదఙ్ముఖమ్**
**ఈశాన మూర్ధ్వవక్త్రం స్యా ఛ్ఛంభోః పంచముఖ క్రమమ్॥"**

అని పేర్కొనబడినాయి. తూర్పు తత్పురషముఖం, దక్షిణం అఘోరముఖం, పశ్చిమం సద్యోజాతముఖం, ఉత్తరం వామదేవముఖం, ఊర్ధ్వం ఈశానముఖాలుగా వర్ణింపబడినాయి అంతేకాదు వివిధ రంగులతో ప్రకాశిస్తున్న ఈ కపిలలింగం పశ్చిమాభిముఖంతో, మూడుకన్నులతో భక్తులకు అద్భుతంగా దర్శనమిస్తున్నది. అనగా శ్రీ కపిలేశ్వరస్వామి భక్తులకు "సద్యోజాతమూర్తి"గా దర్శనమిస్తున్నాడు. సద్యోజాతమూర్తి ఎలాంటి కోరికలనైనా వెంటనే తీర్చడానికి ఆవిర్భవించినమూర్తి అని అర్థం. ఈ 'సద్యోజాతమూర్తి' విష్ణురూపమని వేదం ప్రతిపాదిస్తున్నది.

ఈ మహాశివలింగ ఆవిర్భావం గురించి వామన పురాణంలోని శ్రీ వేంకటాచలమాహాత్మ్యం ఇలా పేర్కొంటున్నది.

పూర్వం ఒకప్పుడు దుర్వాసమహర్షి బ్రహ్మదేవునికి ఈ కపిలేశ్వర మహాలింగాన్ని చూపిస్తూ, ఇలా వివరించినాడని, పరమేశ్వరుడు పార్వతీదేవికి ఆ వృత్తాంతాన్ని ఇలా తెలియజేశాడు.

**"సర్వలోక హితార్థాయ పావనం పుణ్య వర్ధనమ్**
**శంకరః ప్రాహ పద్మాక్షి! శృణు దుర్వాసస పురా**
**బ్రహ్మణా పృష్టతే ప్రోక్తం కాపిల లింగముత్తమమ్**
**ఋషిణా కపిలాఖ్యేన పాతాలే పూజితం సదా**
**క్షీరాబ్ధిస్థం సురభేః ఉద్భిద్య భువముద్గతమ్**
**పతితా సురభస్తస్య మూర్ధ్న్యాదాయయాశ్రుతాత్ ఖురమ్**
**"మామకస్య"తి విఖ్యాత నామధేయ ఖురాన్వితమ్**

*అదౌ రజతవర్ణస్య మధ్యే స్వర్ణప్రభం మహత్*
*అగ్రేఽరుణాభం సంధ్యాభం పఞ్చవక్త్రం త్రియంబకమ్*
*పంచవర్ణం మహాభీమం పాతాలాధిష్ఠితం సదా*
*మహర్షిణా కృతే పూర్వం కపిలేన ప్రపూజితమ్*
*'కపిలేశ్వర' ఇత్యేతత్కృతే ఖ్యాతం యుగే పురా*
*త్రేతాయామగ్నినా పశ్చాత్ 'అగ్నేయ' మితి కీర్తితమ్*
*వాద్యన్తం మహాలింగం ద్వాపరే చక్రపూజితమ్*
*కలౌయుగే భవిష్యం తత్ కపిలాపూజితం శివమ్*
*అగ్రే కాపిలలింగస్య సరోవర మనుత్తమమ్''*

*-వామన పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యం*
*అధ్యాయం 23 - శ్లో. 35 నుండి 42 వరకు*

పూర్వం ఒకానొకప్పుడు పాతాళలోకంలో భోగవతీ నదీ తీరంలో ఏర్పాటుచేసికొన్న ఆశ్రమంలో కపిలమహర్షి ఒక శివలింగాన్ని ప్రతిష్ఠించి ఆరాధించుచుండినాడు. కొంతకాలానికి ఆ శివలింగం రోజు రోజుకు చిత్రవిచిత్రంగా ఊర్ధ్వముఖంగా పెరుగుతూ చివరకు భూమిని పెకలించుకొని వేంకటాచల పర్వతమూలంలో వున్న పర్వత గుహలో పైకి వచ్చింది. ఇంకా ఇంకా పైకి పెరుగుతూ వున్న శివలింగాన్ని చూచి, కామధేనువు తన కాలిగిట్టను ఆ శివలింగంపై వుంచి "మావర్ధస్వ" అని అంటూక్షీరాభిషేకం చేస్తూ "చాలు చాలు ఇక పెరగకు" అని ప్రార్థించిందట! అప్పటి నుంచి ఆ లింగం పెరగటం ఆగిపోయింది. ఆ మహాలింగంపై ఆనాడు వుంచిన ఆవు కాలి గిట్ట గుర్తు అలాగే ఏర్పడింది.

అంతేగాక కృతయుగంలో ఈ మహాశివలింగాన్ని కపిలమహర్షి పూజించినందువల్ల "శ్రీ కపిలేశ్వర మహాలింగం"గా పిలువబడింది. త్రేతాయుగంలో ఈ శివలింగం అగ్ని దేవునిచే అరాధింపబడినందువల్ల "అగ్నేయలింగం" అని పేరు పొందింది. ఆద్యంతాలు లేని ఆ మహాలింగాన్ని ద్వాపరయుగంలో సుదర్శన చక్రదేవుడు అర్చించి కీర్తించినాడు. మరి కలియుగంలో ఈ లింగాన్ని కపిలగోవు తన క్షీరధారలచే అభిషేకించింది.

కృతయుగంలో కపిలమహర్షి పూజించిన ఆ శివలింగంతో పాటు పాతాళంలోని భోగవతీ తీర్థం కూడా పైకి పెల్లుబికింది. ఆ శివలింగం ఎదుట

ఒక బిలం (సొరంగం) ఏర్పడింది కపిలమహర్షి ఆ సొరంగ మార్గం నుండే పాతాళలోకం నుండి వేంకటాచల క్షేత్రానికి రాకపోకలు సాగించినాడు క్రమంగా ఆ బిలమార్గం పవిత్ర జలాలతో నిండిపోయి ఒక సరోవరం ఏర్పడింది ఆ సరోవరమే 'కపిలతీర్థం' అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది

ఆ మహాశివలింగం మూలంలో (మొదట్లో - క్రింది భాగంలో) రజతవర్ణం కలిగి తెల్లగాను, మధ్యభాగంలో సువర్ణకాంతులతో బంగారం వలె పసుపు రంగులోను, అగ్రభాగాన అనగా కొనభాగాన తామ్రం వలె ఎఱ్ఱని రంగుతోను ప్రకాశిస్తూ వుంటుంది అంతేకాదు, ఈ శివలింగం పశ్చిమ, ఉత్తర, తూర్పు, దక్షిణ, ఊర్ధ్వ దిక్కులుగా పంచముఖాలు కలిగి వుండటమే గాక, పశ్చిమాభి ముఖంతో, మూడు కన్నులు కలిగి గంభీరమై దర్శనమిస్తూ ఉంది శ్రీ కపిలేశ్వరమహాలింగంలో ఈ కన్నులను భక్తులు స్పష్టంగా చూడవచ్చును

పరమేశ్వరుని రూపమైన శివలింగాలు రెండు రకాలు మొదటిది స్థావర లింగాలు వీటినే అచలలింగాలనీ, స్థిరలింగాలనీ అంటారు ఇక రెండవది జంగమలింగాలు వీటినే చల లింగాలని కూడా అంటారు వీటిని ఎక్కడికైనా, ఎప్పుడైనా తీసుకెళ్ళవచ్చు, పూజించవచ్చు

దీన్ని బట్టి పరిశీలించినట్లయితే, కపిలేశ్వర మహాశివలింగం, ఒకప్పుడు ఊర్ధ్వముఖంగా పెరుగుతూ, పెరుగుతూ అచలమై, స్థిరంగా నిలిచివున్నందున స్థావరలింగం (అచల లింగం) గా పరిగణించవచ్చును

అంతేగాక లింగం ఏర్పడిన పదార్థాన్ని బట్టి కూడా శివలింగాలు ఆరు విధాలుగా చెప్పబడినాయి.

| | |
|---|---|
| 1. **మృణ్మయములు** | అనగా మట్టితో చేసినవి లేదా ఏర్పడినవి |
| 2 **లోహజములు** | వెండి, బంగారు మున్నగు లోహాలతో తయారు చేసిన శివలింగాలు |
| 3 **రత్నజములు** | వజ్రవైఢూర్య మరకత మాణిక్యాదులచేత తయారుచేయబడిన శివలింగాలు |
| 4 **దారుజములు** | కొయ్యతో తయారుచేయబడిన శివలింగాలు |
| 5. **శైలజములు** | శిలలతో తయారుచేసిన లేదా ఏర్పడిన శివలింగాలు |
| 6. **సైకతములు** | తాత్కాలికపూజకోసం చేసికొన్న ఇసుకలింగాలు |

నదీతీరాల్లో, సముద్రతీరాల్లో తాత్కాలిక శివపూజకోసం, ఇసుకతో తయారుచేసుకొని, అర్చనానంతరం వీటిని తొలగిస్తారు అందుకే వీటిని 'క్షణికలింగాల'ని కూడా అంటారు. (కొన్ని సందర్భాల్లో ఇసుకతోనేకాక, అన్నంతోను, చందనంతోను, మట్టితోను, పిండితోను, తయారుచేయబడిన క్షణిక లింగాలు పూజానంతరం తొలగించబడతవి )

ఇలా పేర్కొన్న పై ఆరు రకాలయిన శివలింగాల్లో శ్రీ కపిలేశ్వర మహాలింగం శిలతో ఏర్పడినది

ఇక ఆ యా శివలింగాలు ఏర్పడిన లేదా ప్రతిష్ఠ చేయబడిన విధానాన్ని బట్టి కూడా, వీటిని ఏడు రకాలుగా నిర్ణయించవచ్చును

| | |
|---|---|
| 1 **స్వయంభూలింగాలు** | సాక్షాత్తు పరమశివుడే లింగరూపంలో ఆ యా సందర్భాల్లో స్వయంభువై ఆవిర్భవించినవి |
| 2 **దివ్యలింగాలు** | ఆ యా దేవతలచేత ఆ యా సందర్భాల్లో ప్రతిష్ఠించబడిన శివలింగాలు |
| 3 **మానుష లింగాలు** | మానవుల చేత తయారుచేయబడి, ప్రతిష్ఠింపబడిన శివలింగాలు |
| 4 **ఆర్ష లింగాలు** | తపస్సంపన్నులైన అగస్త్యాది మహర్షుల చేత ప్రతిష్ఠింపబడిన శివలింగాలు |
| 5 **రాక్షస లింగాలు** | రాక్షసుల చేత ప్రతిష్ఠింపబడి, పూజింపబడిన శివలింగాలు |
| 6 **దైవిక లింగాలు** | అత్యంత సహజంగా ప్రకృతిలో జరిగే మార్పులవల్ల దైవికంగా ఏర్పడి, పూజింపబడుతున్న శివలింగాలు |
| 7. **బాణలింగాలు** | నర్మదాది నదీ గర్భాల్లో నీటి ప్రవాహం చేత ఒరిపిడి చేత ఏర్పడిన శివలింగాలు |

ఈ ఏడురకాలు శివలింగాల్లోశ్రీ కపిలేశ్వర మహాలింగం "స్వయంభువుగా ఆవిర్భవించిన అచలమైన స్థావర శిలాలింగం"గా పేర్కొనబడుతూ

యుగయుగాల్లో ప్రసిద్ధమై దేవ, గంధర్వ యక్ష కిన్నరాదుల చేతనే గాక, మహర్షుల చేత పండిత పామరులైన మానవులందరి చేతా ఆరాధింపబడుతూవున్న మహా మహిమాన్వితమైనదిగా పేర్కొనబడింది

శివాలయం యొక్క గోపురం, గర్భాలయ శిఖరం, ధ్వజస్తంభం, ప్రాకారం, బలిపీఠం, అర్చకస్వామి, మూలలింగం (గర్భాలయంలోని మూలమూర్తి), చండీశ్వరస్వామి - మున్నగు ఈ ఎనిమిది దివ్యస్థలాల్లో సాక్షాత్తుగా పరమశివుడు వున్నట్లుగా భావిస్తూ దర్శించాలి అలా దర్శించి ప్రార్థించినట్లయితేనే సంపూర్ణంగా ఫలప్రదమై శివానుగ్రహం కలుగుతుందని శైవాగమ శాస్త్ర సంప్రదాయం

ముఖ్యంగా ఆలయ గోపురం ''స్థూలలింగం''గాను, బలిపీఠం 'భద్రలింగం'గాను, ఆలయంలోని మూలమూర్తి అయిన మహాశివలింగం ''సూక్ష్మలింగం''గాను చెప్పబడినందువల్ల, ఈ కపిలేశ్వర క్షేత్రంలో మహాలింగం ''సూక్ష్మలింగం''గా భావిస్తూ ఆరాధించాలి అనగా విశ్వపరివ్యాప్తమైవున్న పరమేశ్వరుడు భూమండలాన్ని పీఠంగాను, అనగా పాణవట్టంగాను చేసుకొనగా, ఆకాశాన్ని పిండమయిన మహాలింగంగాను, చేసుకొని ఆవిర్భవించినట్లుగా భావింపబడుచున్నది ఇలా భూమ్యాకాశాలలో నిండివున్న బ్రహ్మాండమే శివలింగంగా భాసిస్తూ వున్న పరమశివుణ్ణి ఆరాధించడం సాధ్యం కాదు కనుక పరమేశ్వరుణ్ణి ''సూక్ష్మలింగం'' రూపంలో ఆరాధించి తరించవలయును

**లింగ గర్భం జగత్సర్వం త్రైలోక్యం చ చరాచరమ్**
**లింగ బాహ్యాత్పరం నాస్తి తల్లింగం చ ప్రపూజయేత్**

అను స్మృతి ప్రకారం లింగం నిరాకారం నిరాకారమగు లింగంలోపల సకల చరాచర లోకాలు ఇమిడి వున్నాయి అంతేకాదు, లింగానికి బాహ్యంగా ఏమీ లేదు లింగమే పూజింప తగింది అందుకే భక్తులు శివలింగాన్ని పూజిస్తూ, ఆ లింగాన్ని తనలో భావిస్తూ ఆరాధించవలెనని భావం

***లింగా న్నాస్తి పరం తత్త్వం యదస్మాజ్జాయతే జగత్***
***యదే తద్రూపతాం ధత్తే యద్రత్న లయమశ్నుతే***

***- సిద్ధాంత శిఖామణి***

స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు లింగంనుండే పుట్టుచున్నది ఈ లింగ రూపాన్ని పొందుతున్నది ఈ లింగంలోనే అణగిపోవుచున్నది కాన లింగం కంటే అన్యమైనదీ, శ్రేష్ఠమైనదీ లేనే లేదు

***తస్మాల్లింగం పరంబ్రహ్మ సచ్చిదానందలక్షణమ్***
***నిజరూప మితి ధ్యానాత్తదవస్థా ప్రజాయతే***

***- సిద్ధాంత శిఖామణి***

అందువల్ల సచ్చిదానందస్వరూపమైన సాక్షాత్తు పరబ్రహ్మమే ఈ శివలింగ రూపమని తెలిసి ధ్యానించడం వల్ల లింగమే నిత్యం అనే స్థితి కలుగుతుంది

***బ్రహ్మ విష్ణ్వాదయో దేవాః సర్వే వేదాదయస్తథా***
***లీయంతే యత్ర గమ్యంతే తల్లింగం బ్రహ్మ కేవలమ్***

***- సిద్ధాంత శిఖామణి***

బ్రహ్మవిష్ణ్వాది దేవతలు, వేదశాస్త్రాలు మున్నగు సర్వవస్తుజాలం అంతా దేనియందు లయమై, మళ్లీ దాని నుండే పుట్టుచున్నవో అదే ''పరబ్రహ్మం''గా పిలువబడుతున్న లింగము

అనగా సకల దేవాత్మకమైనది అది సాకార నిరాకార పరబ్రహ్మస్వరూపం సగుణారాధకులు సాకారంగాను, నిర్గుణారాధకులు నిరాకారంగాను ఉపాసిస్తారు

అందువల్లే సాక్షాత్తు పరమశివుడు లోకానుగ్రహార్థం పాతాళలోకం నుండి పెరుగుతూ పెరుగుతూ వేంకటాచల పర్వతమూలంలో స్వయంభువుగా ''శ్రీ కపిలేశ్వర మహాలింగమూర్తి''గా ఆవిర్భవించి అర్చనలందుకొంటున్నారు

***''బ్రహ్మే స్వయం పశుపతే పశురూపమేత్య***
***క్షీరాభిషేక మకరోత్కిల పూర్వమత్ర***
***గోపాల రూప మధిగచ్ఛతి కేశవోపి***
***కామాక్ష్యధీశ! కపిలేశ్వర సుప్రభాతమ్''***

అన్నట్లుగా, ''సాక్షాత్తు బ్రహ్మదేవుడు పశువు (గోవు) గా మారి, పశుపతి నాధుడైన కపిలేశ్వరస్వామికి క్షీరాభిషేకం చేస్తుండగా, సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు పశువుల కాపరియై రక్షించినాడట! అట్టి కామాక్షీ దేవికి అధినాయకుడైన కపిలేశ్వరునకు సుప్రభాతమగు గాక'' అని వర్ణింపబడిన ఈ శ్లోకంలో ''పశుపతి - పశువు - పశువుల కాపరి'' ఇలా శ్రీ కపిలేశ్వర మహాలింగం త్రిమూర్త్యాత్మకమై భాసిస్తున్నట్లు తెలుపబడింది

అంత మాత్రమే గాక, శ్రీ కపిలేశ్వరమహాలింగం మీద ఛాయగా ఈ క్రింది రూపం గోచరిస్తున్నది

***"కూర్మస్యో పరి సుస్థితే ఫణిపతౌ***
***తన్మూర్ధ్ని భూమౌ స్థితమ్***
***లింగం గోః పయసాభిషేచనక-***
***మజం గోపాలరూపం హరిమ్***
***తత్రైవ శ్రీ కపిలర్షిణా పరమయా***
***భక్త్యా సుమైః పూజితమ్***
***దృశ్యం చిత్రమహో! త్రిమూర్తి మిళితం***
***ధ్యాయామి లింగోత్తమమ్"***

**- శ్రీ ఎం.వి. రామనాథ ఘనాపాఠి**
*తి తి దేవస్థానం వేదపండితులు (1972)*

శ్రీ కూర్మం మీద ఆదిశేషుడు - ఆ ఆదిశేషునిపై భూమండలం - ఆ భూమిని భేదించుకొని పైకి వచ్చిన పాతాళ మహాలింగం - ఆ మహాలింగాన్ని బ్రహ్మదేవుడు గోరూపంలో క్షీరంతో అభిషేకం చేస్తుండగా, శ్రీ మహావిష్ణువు గోపాలుడై ఆ గోవును సంరక్షిస్తుండగా, ఆ సమయంలో కపిల మహాముని భక్తితో నాగలింగ పుష్పాలతో (శివలింగం) అర్చిస్తున్న సుందర చిత్రం త్రిమూర్తి తత్త్వ సమిశ్రితమై శ్రీ కపిలేశ్వర మహాలింగ మూలమూర్తి పైన సూక్ష్మరూపంలో గోచరిస్తున్నది అందువల్లే కపిలేశ్వరమహాలింగం త్రిమూర్తిలింగమనీ, త్రిమూర్తి రూపమైన దత్తాత్రేయ లింగమని కూడ పిలువబడుతున్నది శ్రీ కపిలేశ్వర మహాలింగంపైన వున్న పై రూపం యొక్క వివరాలు భక్తులు స్పష్టంగా పరిశీలించి దర్శించుటకు వలనుపడదు కనుక, ఈ వివరాలను భక్తులందరు తనివితీరా, కన్నులారా దర్శించి ఆనందించుటకుగాను శ్రీ కామాక్షీ కపిలేశ్వర ముఖమండపంలో సుమారు పది అడుగుల ఎత్తుతో సిమెంటుతో సుందరశిల్పాకృతి రూపొందించబడింది

అంతేకాదు-

**"మత్స్యః కూర్మః వరాహశ్చ నారసింహోథ వామనః**
**రామో రామ శ్చ రామ శ్చ కృష్ణః కల్కి రేవ చ"**

అని పేర్కొనబడిన శ్రీ మహావిష్ణువు దశావతారాల్లో, నృసింహమూర్తి అవతారం నాల్గవదిగా పేర్కొనబడింది ఈ నృసింహస్వామివారు కూడా "సద్యోజాతమూర్తి"గా ప్రసిద్ధి పొందినారు అనగా అప్పటికప్పుడు ఆవిర్భవించి ఇష్టార్థసిద్ధిని కలిగించేవాడని అర్థం

అంతేకాక నరసింహస్వామివారు త్రిమూర్త్యాత్మకమూర్తిగా నృసింహ పురాణంలోని శ్రీ నృసింహసహస్ర నామస్తోత్రంలో ఇలా కీర్తింపబడింది

***అనాభేః బ్రహ్మణోరూపం***
***ఆగళాత్ వైష్ణవం వపుః***
***ఆ శీర్షాత్ రుద్రమీశానం***
***తదగ్రే సర్వత శ్శివమ్***

శ్రీ నృసింహునికి పాదాలనుంచి నాభివరకు బ్రహ్మరూపమట! నాభి మొదలు కంఠం వరకు శ్రీ విష్ణురూపమట!! కంఠం మొదలు శిరస్సు వరకు రుద్రుడైన ఈశ్వరుని యొక్క రూపమట!!! ఇలా మంగళ స్వరూపంతో ప్రకాశిస్తున్న నృసింహునికి నమస్కారం ఇందులో శివునికి, నృసింహునికి అభేదం చెప్పబడింది కనుకనే తాళ్లపాక అన్నమాచార్యులు కూడ ఒకచోట ''నమక చమక హిత నారసింహా!'' అని నమక చమంత్రాలతో కీర్తింపబడిన నరసింహస్వామివారిని కీర్తించినాడు ఈ భావానికి అనుగుణంగా శ్రీ కపిలేశ్వరస్వామివారి గర్భాలయంపైన నిర్మింపబడిన ఏకకలశ గోపురంమీద పశ్చిమాభిముఖంగా సుమారు ఒకటిన్నర అడుగుల ఎత్తు వున్న శ్రీ నరసింహస్వామి విగ్రహం ప్రతిష్ఠింపబడింది శంఖు చక్రాలతో, వరదాభయ హస్తాలతో చతుర్భుజుడై విరాజిల్లుతున్న నరసింహస్వామి, శివాలయంపై వుండటం ఇరువురికి అభిన్నత్వం ప్రబోధిస్తున్నది

అంతేగాక, శ్రీ కపిలేశ్వరస్వామివారికి ఎదురుగా, కపిలతీర్థ పుష్కరిణికి పశ్చిమ దిక్కున ''నరసింహగుహ'' వుంది ఈ నరసింహగుహ ద్వారా వేంకటాచల పర్వతంపైకి బిలమార్గం వున్నదని, ప్రతీతి! ఈ మార్గం నుండే వకుళమాత తిరుమల నుండి వచ్చి శ్రీ కపిలేశ్వరస్వామివారిని సేవించినట్లు పురాణ ప్రసిద్ధి ఈ నరసింహగుహలో తాళ్లపాక పెద తిరుమాలాచుర్యులు ప్రతిష్ఠించినట్లు చెప్పబడుతున్న సువరారు ఒక అడుగుపైగా ఎత్తువున్న శ్రీ లక్ష్మీ నరసింహస్వామివారి శిలావిగ్రహం కూడా వుంది కాలాంతరంలో ఈ విగ్రహం నాసికవద్ద కొద్దిగా భిన్నమైంది. ఇలాగ నరసింహస్వామి, శ్రీ కపిలేశ్వరస్వామివారికి ఎదురుగా, శ్రీ కపిలేశ్వరస్వామివారి గర్భాలయ శిఖరంపైనా ప్రతిష్ఠింపబడటం ఎంతైనా పేర్కొనదగిన విశేషం!

మనం ఇప్పుడు దర్శిస్తున్న శ్రీ కపిలేశ్వరస్వామి పశ్చిముఖరూపుడై, నరసింహస్వామివారి మాదిరిగానే ''సద్యోజాతమూర్తి''గా పిలువబడుతూ

భక్తులకు సద్యః (వెంటనే) కోరికలను తీరుస్తున్నాడు అంతేగాక శ్రీ కపిలేశ్వరస్వామివారి శివలింగం యొక్క మూలభాగంలో బ్రహ్మదేవుడు, మధ్యభాగంలో శ్రీ మహావిష్ణువు, అగ్రభాగాన పరమేశ్వరుడు ఆవహించి వేంకటాచలక్షేత్ర మూలంలో కొలువుదీరి భక్తులకు దివ్యదర్శనమిస్తూ వున్నట్లుగా ఇలా పేర్కొనబడింది

***"బ్రహ్మ మురారి సేవిత లింగం***
***సృష్టి స్థితి లయ కారక లింగమ్***
***సర్వదోష పరిహారక లింగం***
***నౌమి మహా కపిలేశ్వర లింగమ్"***

అని కీర్తింపబడిన శ్రీ కపిలేశ్వర మహాలింగం యొక్క మహత్వం ఎంతగా వర్ణించినా తక్కువే అవుతుంది అందువల్ల శ్రీ కపిలేశ్వరుణ్ణి మనసా వాచా కర్మణా త్రికరణ శుద్ధిగా ఆరాధించిన వారి జన్మమే జన్మము వారికి ఇహ పర సౌఖ్యాలు కరతలామలకం అని చెప్పడం ఏ మాత్రం అతిశయోక్తి ఆవగింజంతయినా లేదు

కనుకనే అనాదిగా ఎందరో దేవతలు, మహర్షులు మానవులు నిత్యమూ కపిలేశ్వరుని అర్చించి, ఆరాధించి తమ కోరికలను నెరవేర్చుకుంటున్నారు సేవించి తరిస్తూనేవున్నారు

సాక్షాత్తు ఏడుకొండలవాడు అయిన శ్రీ వేంకటేశ్వరస్వామి ఒకప్పుడు వేటకు వెళ్లి నారాయణవనాన్ని పరిపాలించే ఆకాశరాజుకూతురు అయిన పద్మావతీ దేవిని చూచి మోహించినాడు ఆమెను వివాహమాడనిదే తాను ఉండలేనని తల్లి అయిన వకుళమాతకు తెలియజేసినాడు తనకు పద్మావతిని ఇచ్చి వివాహం చేయవలసిందిగా నారాయణవనానికి వెళ్లి ఆకాశరాజును కోరవలసిందిగా వకుళమాలికను ప్రార్థిస్తూ, ఇలా తెలియ జేసినాడు

***"అస్మా దేవ వరాన్మార్గాత్ అవరుహ్య గిరేస్త టాత్***
***త్వం గచ్ఛాధః ప్రదేశే చ కాపిలం లింగముత్తమమ్***
***తత్రా౽స్తే తీర్థరాజోయః కపిలేశ్వర సన్నిధౌ***
***తత్ర స్నాత్వా యథాయోగ్యం మదర్థం తీర్థపుంగవే***
***కపిలేశ్వర మాసాద్య యాచ్యతాం పరమవ్యయమ్***
***శ్రీనివాసేన బాలేన సదా కల్యాణ కాంక్షిణా***
***ప్రేషితాహం తదర్థం వై కురు మే౽భీప్సితం ప్రియమ్"***

***- భవిష్యత్తోర పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యం***

***(8 అధ్యాయం - శ్లో. 76 నుండి 79.)***

''అమ్మా వకుళాదేవీ! ఈ పర్వతాన్ని దిగి వెళ్లే మార్గంలో గిరి క్రింది ప్రదేశంలో మహిమాన్వితమైన ఉత్తమమైన కాపిలలింగం ఉంది. ఆ కపిలేశ్వరుని సన్నిధిలో వున్న పవిత్రమైన కపిలతీర్థంలో తీర్థవిధిగా స్నానం చేసి, నాయీ వివాహకార్యాన్ని నెరవేర్చవలసినదిగా శ్రీ కపిలేశ్వరస్వామివారిని దర్శించి ప్రార్థించ వలసింది నా వివాహకార్యం కోసం పంపబడుతున్న నీవు ఈ కార్యాన్ని నెరవేర్చి నాకు సంతోషాన్ని కలిగించవలసింద''ని శ్రీనివాసుడు వకుళమాతను ప్రార్థించినాడు

వరాహపురాణంలోని ఈ వృత్తాంతం శ్రీనివాసుడు వేంకటాచల క్షేత్రంలో అర్చామూర్తిగా వెలయుటకు ముందే, అత్యంత ప్రాచీనమైన ప్రసిద్ధమైన శైవక్షేత్రంగా 'కపిలతీర్థం' గూర్చి తెలియజెప్పడంతో పాటు ఈ శ్రీనివాసుని వివాహ ప్రయత్నం, వివాహం కావలసిన యువతీ, యువకులు ఈ కపిలేశ్వర స్వామివారిని సేవించినట్లయితే విఘ్నాలు అన్నీ తొలగి శీఘ్రంగా వివాహాలు జరుగుతాయని కూడా స్పష్టం చేస్తోంది

ఇలా వేంకటేశ్వరస్వామి తన పెళ్లి జరిగేట్లు అనుగ్రహించమని వకుళమాత ద్వారా కపిలేశ్వరుని ప్రార్థించగా, కపిలేశ్వరస్వామి కూడా నిరంతరం వేంకటాచలపతిని ధ్యానిస్తూ వుంటాడట! అందువల్లే శ్రీ వేంకటేశ్వరస్వామివారి సహస్రనామావళిలో ''ఉపత్యకా ప్రదేశస్థ శంకర ధ్యాతమూర్తయే నమః'' అని శ్రీనివాసుడు కీర్తింపబడినాడు అనగా పర్వతమూలంలో వున్న శ్రీ కపిలేశ్వరస్వామి చేత ధ్యానింపబడుతున్న శ్రీనివాసునకు నమస్కారం అని అర్థం అంతేగాక

*ఓం శంకర ప్రియ మిత్రాయ నమః*

*ఓం వామదేవ ప్రియాయనమః*

*ఓం హరమోహక మాయావినే నమః*

*ఓం బ్రహ్మ రుద్రాది సంసేవ్యాయ నమః*

అని అనేక విధాల స్తుతింపబడిన శ్రీ వేంకటేశ్వరస్వామివారు పరమేశ్వరుని తన వేంకటాచలక్షేత్రానికి క్షేత్రపాలకునిగా చేశాడు అందువల్లే రుద్రుడు క్షేత్రపాలకునిగా తిరుమల క్షేత్రంలో వేంచేసి నిత్యమూ నివేదనలందుకుంటూ వుండటం నేటికీ మనం గమనించవచ్చు

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో ధ్వజస్తంభ మండపం ఆవరణలో బలిపీఠానికి ఈశాన్యమూలన బలిపీఠం లాంటి ఆకారంతోనే సుమారు రెండడుగుల ఎత్తుగల చిన్న శిలాపీఠం వుంది. దీన్నే క్షేత్ర పాలకశిల, అంటారు.

తిరుమల పుణ్యక్షేత్రానికి పాలకుడు రుద్రుడు (శివుడు) తిరుమల క్షేత్రపాలకుడైన రుద్రునికి గుర్తుగా అనాదిగా ఈ శిల ఉందట అయితే ఈ శిల పూర్వం రుద్రుని పూర్ణాంశతో ప్రకాశిస్తూ, తిరుమల గుడి చుట్టూ తిరుగుతూ కాపలాకాస్తూ వుండేదట! ప్రతిరోజూ రాత్రి అర్చకులు ఇంటికి వెళ్లేప్పుడు, గుడి తాళాలను ఈ శిలపై పెట్టి నమస్కరించి వెళ్ళేవారు మళ్లీ తెల్లారిన తర్వాత వచ్చి అర్చకులు ఆ శిలకు నమస్కరించి తాళం చెవులను తీసుకొనేవారు ఒకనాటి రాత్రి ఆలయంచుట్టూ తిరుగుతూవున్న ఈ క్షేత్రపాలకగుండు కింద ఒక బాలుడు పడి మరణించాడట! మళ్లీ అలాంటి అనర్థం జరగకుండా, ఆ శిల, ఇక్కడ నుండి తిరుమలకు సమీపంలో వున్న గోగర్భతీర్థం వద్దకు తరలింపబడిందనీ, అందులోని ఒక చిన్న భాగమే ప్రస్తుతం తిరుమల ఆలయంలో ధ్వజస్తంభ బలిపీఠాలకు దగ్గరలోవున్న 'క్షేత్రపాలకశిల' అని పెద్దలమాట

ఆనాటి నుండి రుద్రుడు (శివుడు) పూర్ణాంశంతో అటు గోగర్భతీర్థంలో "క్షేత్రపాలక గుండు"గాను, అంశా స్వరూపంతో తిరుమల ఆలయంలో బలిపీఠం దగ్గర "క్షేత్రపాలకశిల" గాను వెలుగొందుతూ వేంకటాచలక్షేత్ర పాలకుడై వరలుతున్నాడు

ప్రతి సంవత్సరం మహాశివరాత్రి పర్వం నాటి ఉదయం తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయ అర్చకులు, అధికారులు, యాత్రికులు మంగళ వాద్యాలతో పాండవ (గోగర్భ) తీర్థానికి వెళ్లి, అక్కడ వెలసివున్న "క్షేత్రపాలక గుండు (శివుడు)"నకు నమక చమక రుద్రాభిషేకం చేస్తారు అనంతరం విష్ణుభక్తుడైన శివునకి - అనగా ఆ గుండునకు వెండితో చేసిన ఊర్ధ్వపుండ్రాలు, కండ్లు అతికించి, పుష్పమాలాలంకరణ కావిస్తారు పిదప ధూపదీప, అర్చన నివేదనాదులు ఘనంగా శాస్త్రోక్తంగా నిర్వహిస్తారు చివరగా ఆ శివునకు ఆరగింపు అయిన వడపప్పు, పండ్లు, పానకం, చక్కెర పొంగలి వగైరా ప్రసాదాలు భక్తులందరికీ వితరణ చేయబడతాయి పిదప అర్చక స్వాములు మంగళవాద్య సహితంగా శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి తిరిగి వెళతారు

నేటికీ ప్రతిరోజూ తెల్లవారు జామున శ్రీనివాసుని పూజకోసం వచ్చే అర్చకస్వాములు ముందుగా తమతాళం చెవుల గుత్తిని ఆలయంలో వున్న ఈ "క్షేత్రపాలక శిల"కు తాకించి నమస్కరిస్తూ లోనికి వెళతారు అలాగే రాత్రి ఏకాంత సేవానంతరం ఆలయాన్ని మూసి బంగారు వాకిళ్లకు తాళాలు వేసిన

తర్వాత ఆ తాళం చెవులను మళ్లీ ఈ క్షేత్రపాలకునికి తాకిస్తూ , నమస్కరించి, ఆ రుద్రుని అనుజ్ఞ తీసుకొని ఇంటికి వెళతారు. ఇది ఈనాటికీ నిత్యమూ తిరుమల క్షేత్రంలో అమలులో వున్న సంప్రదాయం.

ఇలాగ తిరుమల క్షేత్రానికి క్షేత్రపాలకుడైన రుద్రుడు వేంకటాచల క్షేత్ర మూలంలో శ్రీ కపిలేశ్వర మహాలింగ రూపంలో ఆవిర్భవించి, యుగయుగాల్లో తనను సేవించినవారికి అనేకులకు అనేక విధాలుగా అనుగ్రహిస్తూ, వైభవంగా నిత్యాభిషేకాలతో నిత్యార్చనలతో, ఉత్సవాలతో, ఊరేగింపులతో అంగరంగ వైభవంగా అలరారుతూ వున్నాడు

ప్రతిరోజూ తెల్లవారు జామున 5 గంటలకు ధ్వజస్తంభం ముందర ద్వారపాలకులైన ''దిండి'', ''ముండి''ల ముందర

*''కపిలేశ్వర దేవేశ ప్రాతస్సంధ్యా ప్రవర్తతే*
*ఉత్తిష్ఠ కపిలారాధ్య త్రైలోక్యం మంగళం కురు॥*
*పాతాళోత్థిత లింగేశ వృషభధ్వజ హేప్రభో*
*కామాక్షీ వల్లభోత్తిష్ఠ జగతాం మంగళం కురు॥*

......................................

అను కపిలేశ్వర సుప్రభాతం, కపిలేశ్వర స్తోత్రం, శ్రీ కపిలేశ్వర ప్రపత్తి, శ్రీ కపిలేశ్వర మంగళ స్తవాల పఠనంతో ఆలయ ద్వారాలు తెరవబడతాయి తరువాత అర్చకస్వాములు శ్రీ కపిలేశ్వరస్వామివారికి, శ్రీ కామాక్షీ అమ్మవారికి ప్రాతః కాల ఉపచారాలు సమర్పించి కర్పూర నీరాజనాలిస్తారు అనంతరం భక్తులకు ప్రాతః కాలదర్శనం ఉంటుంది ఆ తర్వాత శ్రీ సిద్ధి వినాయక స్వామివారికి, శ్రీ కపిలేశ్వర స్వామివారికి, శ్రీ కామాక్షీ అమ్మవారితో పాటు ఆలయంలో వున్న ఇతర ప్రధాన, పరివార దేవతామూర్తులన్నింటికి అభిషేకాదులు నిర్వహింపబడతవి

శ్రీ కపిలేశ్వర మహాలింగానికి ప్రతిరోజు రెండుమారులు నమక చమక సహితంగా రుద్రాభిషేకం జరుగుతుంది

ఉదయం 7 గంటల సమయంలోను, మధ్యాహ్నం 3 గంటల సమయంలోను, వేద పండితులు రుద్రాధ్యాయంలోని నమక చమక మంత్రాలను స్వరయుక్తంగా పఠిస్తుండగా, అర్చకస్వాములు శ్రీ కపిలేశ్వర మహాలింగానికి అభిషేకం చేస్తారు. ఈ అభిషేకంలో పాలు, పెరుగు, నెయ్యి, తేనె, కొబ్బరినీళ్ళు, చందనం, విభూతి మున్నగు ద్రవ్యాలను ఉపయోగిస్తారు

తొలుత శుద్ధ జలంతో శివలింగానికి అభిషేకం చేసిన తర్వాత పాలతో అభిషేకం చేస్తారు. మళ్ళీ శుద్ధ జలంతో అభిషేకం చేసిన తర్వాత పెరుగుతో అభిషేకం చేస్తారు. ఇలా అన్ని ద్రవ్యాలతో అభిషేకం చేసిన తర్వాత శ్రీ కపిలేశ్వరునికి విభూతితో కూడా అభిషేకం చేసి నివేదన హారతులిస్తారు మళ్ళీ చివరగా కలశ జలంతో అభిషేకిస్తారు ఇలా అభిషేకం పూర్తి అయిన తర్వాత తెరలు వేసి, లోపల మహాలింగాన్ని బాగా తుడిచి, వెండి లేదా బంగారు పాణవట్టాలను ఐదు శిరస్సులు కలిగిన నాగ పడిగెలను శివలింగంపై అమర్చి పుష్పాలతోను, కిరీటాది ఆభరణాలను త్రిపుండ్రాలను తీర్చిదిద్ది నయనానందకరంగా అలంకరిస్తారు అలంకారం పూర్తి అయిన తర్వాత అర్చకస్వాములు, అర్చన చేస్తారు

వేదపండితులు అష్టోత్తర శత శివనామావళిని (108) పఠిస్తుండగా అర్చకస్వాములు, శ్రీ కపిలేశ్వరస్వామివారికి ఆచమనాది ఉపచారాలు సమర్పించి, మారేడు (బిల్వం) దళాలతోను, పుష్పాలతోను అర్చిస్తారు

ఇలా 108 నామాలతో అర్చన అయిన తర్వాత, ఇదే సమయంలో శ్రీ కామాక్షీ అమ్మవారికి అభిషేకం పూర్తి అయిన తర్వాత లలితా అష్టోత్తరశత నామాలతో (108) కుంకుమార్చన జరుగుతుంది

ఇలా ఉదయం పూట అష్టోత్తర శతనామార్చనలు పూర్తి అయిన తర్వాత శ్రీ కపిలేశ్వరస్వామివారికి, శ్రీ కామాక్షీ అమ్మవారికి ఇంకా ఆలయంలోని అందరు పరివార దేవతలకు మహానివేదనానంతరం భక్తులకు తీర్థ ప్రసాద వితరణ జరుగుతుంది

మధ్యాహ్నం 3 గంటలకు రెండవమారు కూడా శ్రీ కామాక్షి సమేత శ్రీ కపిలేశ్వరస్వామికి ఉదయం మాదిరిగానే నమక చమక సహితంగా రుద్రాభిషేకం జరుగుతుంది కాని సాయంత్రం శ్రీ కపిలేశ్వరునికి శివసహస్ర నామాలతో (1008) ను, శ్రీ కామాక్షీ దేవికి లలితా సహస్రనామాలతోను కుంకుమార్చన జరుపబడుతుంది

ఇలా రోజుకు రెండుమార్లు శ్రీ కపిలేశ్వర మహాలింగానికి అభిషేకం జరుగుతుంది. కాని ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో ఒక్కనెల రోజులు మాత్రం పై రెండు మార్లు అభిషేకాలతో పాటు గుడి తెరచిన వెంటనే, శుద్ధజలంతో కపిలేశ్వరునికి అమ్మవారికి అభిషేకాలు చేస్తారు.

ఇదిగాక మహాశివరాత్రి పర్వంనాడు మాత్రం శ్రీ కపిలేశ్వర మహాలింగానికి ప్రతిరోజు మాదిరిగా రెండుమార్లు అభిషేకంతో పాటు అర్ధరాత్రి 12 గంటల నుండి తెల్లవారు జామున నాలుగు గంటల వరకు నాలుగుమార్లు నమక చమక సహితంగా మహన్యాస పూర్వక రుద్రాభిషేకాలు జరుగుతాయి

ప్రతి సోమవారం నాడు, ప్రతి మాస శివరాత్రినాడు, కార్తీక, మార్గశిర, పుష్య, మాఘ మాసాల్లో వచ్చే సోమవారాల్లోను, పౌర్ణిమల్లోను, శని త్రయోదశి లోను, ఆశ్వయుజ పౌర్ణమి అన్నాభిషేకం రోజున, కార్తీక మాసంలోని కృత్తికా దీపోత్సవంనాడు ఇలా విశేష దినాల్లో శ్రీ కపిలేశ్వర మహాలింగానికి ఘనంగా అభిషేకార్చనలు జరుపబడతాయి ఆయా విశేషదినాల్లో వేలాది భక్తులు కపిలేశ్వరుని దర్శించి ధన్యులవుతుంటారు

నిత్యమూ లేదా ఆయా విశేష మాసాల్లో కపిలేశ్వరునికి అభిషేకానికి ద్రవ్యాలను సమకూర్చిన వారికి పాపాలు నశిస్తాయి ఇష్టార్థాలు కలుగుతాయి

ఒకప్పుడు ఈశ్వరుడు పార్వతీదేవితో సంభాషిస్తూ ఇలా వివరించాడు

***కార్తీకస్య తు మాసస్య క్షీరేణ స్నాపయే న్నమ***
***అర్చయేజ్జాతి పుష్పైస్తు శివం పశ్యన్నిరంజనమ్.***

''ఓ పార్వతీ! కార్తీక మాసంలో పాలతో అభిషేకించిన తర్వాత మంచి సువాసన గల జాజిపూవులతో అర్చించినవాడు నిరంజనమైన శివస్థానాన్ని పొందుతాడు'' అని శివరహస్య ఖండం అనే గ్రంథంలో తెలుపబడింది ఇంకా ఆ గ్రంథంలోనే

***"మాఘస్యైవతు యో దేవి! హరం బిల్వేన అర్చయేత్***
***బాలార్క శశియుక్తేన - విమానేన సగచ్ఛతి"***

''ఓ దేవీ! మాఘమాసంలో ఎవడయితే హరుని బిల్వ (మారేడు) దళాలతో అర్చించి, ఆరాధించునో, అతడు లేత సూర్యుడు, చంద్రుడు కలిగిన విమానంలో పరమపదం పొందుతాడు

***"జ్యేష్ఠమాసి తతో ధధ్నా, స్నాపయేత్సతం నరః***
***అర్చయేత్ పద్మ పుష్పేణ సోఽపి గచ్ఛేత్ పరాంగతిమ్"***

జ్యేష్ఠమాసంలో నిత్యమూ పెరుగుతో పరమశివుణ్ణి అభిషేకించి, తామర పూవులతో అర్చించిన మానవుడు పొందుతాడు

అలాగే వైశాఖమాసంలో నేతితో అభిషేకం చేసిన తర్వాత తెల్లమందారాలతో ఆరాధించిన మానవునికి అశ్వమేధయాగ ఫలితం కూడ కలుగుతుందని శివరహస్య ఖండంలో ఇలా చెప్పబడింది

**"వైశాఖస్య చ మాసస్య ఘృతేన స్నాపయేత్సదా**
**అర్చయే చ్ఛుక్లమందారై రశ్వమేధ ఫలం లభేత్"**

అలాగే

**"ఫాల్గుణస్య తు మాసస్య గంధతోయేన స్నాపయేత్**
**అర్చయేత్ ద్రోణ పుష్పేణ ఇంద్రస్యార్ధాసనం లభేత్"**

ఫాల్గుణమాసంలో సుగంధం కలిపిన జలంతో (పన్నీరు, చందనా జలం) శివుడికి అభిషేకం చేసిన తర్వాత తుమ్మి పూలతో పూజించినట్లయితే ఇంద్రుని అర్ధసింహాసనం లభిస్తుంది

అంతేగాక పరమేశ్వరునికి వివిధ సుగంధ పుష్పాలతో పూజచేస్తే కూడా అనంత ఫలం కలుగుతుందని శాస్త్రాలు పేర్కొంటున్నాయి

**"ఏకపుష్ప ప్రదానేన లింగేషు ప్రతిమాసువా**
**అశీతి కల్పకోటీనాం, దుర్గతిం న నరో వ్రజేత్"**

శివలింగానికి గాని లేదా శివ ప్రతిమకు గాని కనీసం ఒక పుష్పం సమర్పించినా చాలట! వారికి ఎనభై కల్పాలకైనా ఎలాంటి దుర్గతి కలుగనే కలుగదు

**"ఆషాఢస్య తు మాసస్య స్నాత్వా కృష్ణచతుర్దశీ**
**సకృచ్చ గుగ్గిలం దగ్ధ్వా దత్వా పుష్ప స కుండికామ్.**
**నిర్భిత్వా బ్రహ్మ లోకేషు తేఽపి యాంతి పరాంగతిమ్"**

ఆషాడ మాసంలో ఎవడయితే ఆషాఢ కృష్ణ చతుర్దశినాడు శుచి స్నాతుడై సాంబ్రాణితో ధూపం వేస్తూ, తొడిమలతో వున్న పుష్పాలతో శివుణ్ణి అర్చించినట్లయితే, వాడు బ్రహ్మలోకాన్ని దాటి పరమపదాన్ని పొందుతాడు

**శ్రావణస్య తు మాసస్య ఏకాహారేణ యో జనః**
**అర్చయేత్ కరవీరేణ గో సహస్రఫలం లభేత్**

శ్రావణ మాసంలో ఏకభుక్తంతో వుంటూ గన్నేరు పుష్పాలతో ఎవడైతే శివుణ్ణి అర్చిస్తాడో వాడు, వేయి గోదాన ఫలాలను పొందుతాడు

*మాలా భిత్వా సుగంధాభిర్యో లింగం పూజయేన్నరః*
*సవేదికా విశేషేణ సోనంత ఫల మశ్నుతే*

ఏ నరుడు పూలమాలచేతగాని లేదా సుగంధ భరితమైన పుష్పాలతో గాని శివలింగాన్ని విశేషంగా అర్చించినట్లయితే వాడు అనంత ఫలాన్ని పొందుతాడు.

*బిల్వపత్రై రఖండై శ్చ*
*సకృల్లింగం ప్రపూజయేత్*
*సర్వపాప వినిర్ముక్తః*
*శివలోకే మహీయతే*

ఒకసారైనా భిన్నంకాని, చిరుగని, ముక్కలుగాని మారేడు దళాలతో శివుని భక్తితో పూజించినవాడు సమస్త పాపాలనుండి విముక్తుడై కైలాసాన్ని చేరుకుంటాడు

*శివస్యో పరియః కుర్యాత్*
*సుఘనం పుష్ప మండపం*
*శోభితం పుష్పస్రగ్దామై*
*ఆ పీఠాంతం ప్రలంబిభిః*

ఎవడు శివలింగంపైన వివిధ పుష్పాలచేత అలంకరించి, పాదపీఠం వరకు పూలమాలలు వ్రేలాడునట్లు పుష్పమండపాన్ని రచించునో అలాంటివాడు

*అత్యాశ్చర్యైర్మ హాయానై ర్దివ్య పుష్పోప శోభితైః*
*సర్వైః పరిచితైః శ్రీమానాస్తే శివపురే సుఖీ.*

దివ్యమైన పుష్పాలతో అలంకరింపబడిన అద్భుతమైన దివ్య విమానాన్ని ఎక్కి కైలాసానికి వెళ్లి, పరిచితులైన వారందరితో కూడి సుఖంగా వుంటాడు

*అనేకాకార సంయుక్తం*
*యః శివేకుసుమం గృహమ్*
*కుర్వీత పర్వకాలేషు*
*విచిత్ర కుసుమోజ్జ్వలమ్*

విశేషమైన పర్వదినాల్లో శివునికి పుష్పాలతో చిత్ర విచిత్రమైన అద్భుతమైన పుష్ప గృహాలు - పుష్పమండపాలు అనేకంగా ఏర్పాటు చేయునో లేదా శివాలయాలకు చక్కగా పై విధంగా అలంకరించునో వాడు,

***సపుష్పక విమానేన సహస్ర పరివారితః***
***దివ్య స్త్రీ సుఖ సంభోగ క్రీడారతి సమన్వితః***

అతడు వేయి మంది పరివారంతో పుష్పక విమానంలో తిరుగుతూ దివ్య స్త్రీ సుఖాలను పొందుతాడు,

***అక్షయం మోదతే కాల మతిరస్కృత శాసనః***
***శివాది సర్వలోకేషు యత్రేష్టం తత్రయాతి సః***

అతడు అక్షయమైన అనంతకాలం వరకు తిరుగులేని విధంగా అధికారం కలిగి వుంటూ, కైలాసాది సమస్త లోకాల్లో ఇష్టమున్నచోటికి తిరుగుతుంటాడు

నిత్యమూ భక్తులు శ్రీ కపిలేశ్వరస్వామివారికి జరిపే అర్చనలవల్ల, అభిషేకాల వల్ల కేవలం వ్యక్తిగతంగానే గాక, సామాజిక ప్రయోజనాలు కూడా సిద్ధిస్తాయి లోకకల్యాణం కలుగుతుంది

శ్రీ కపిలేశ్వర మహాలింగానికి కరువు కాటకాల్లో విశేషార్చనలు, నిర్వహించినట్లయితే దేశం సుభిక్షంగా వుంటుంది ముఖ్యంగా తీవ్రమైన అనావృష్టి సంభవించిన సమయాల్లో శ్రీ కపిలేశ్వర మహాలింగానికి ''సహస్ర ఘటాభిషేకం'' చేయడంతో పాటు లక్ష బిల్వార్చన నిర్వహిస్తారు ఆ సమయంలో తప్పక వర్షం పడుతుందని భక్తుల ప్రగాఢ విశ్వాసమే గాక, పెద్దల అనుభవ సత్యం కూడా

శ్రీ కపిలేశ్వర మహాలింగమునకు ప్రతిరోజు అభిషేక సమయంలో చిట్టచివరగా ''విభూతి''తో అభిషేకం చేసి నీరాజనాలివ్వబడతవి శ్రీ కపిలేశ్వర మహాలింగానికి అభిషేకం చేసిన విభూతిని భక్తులకు ప్రసాదంగా ఇస్తారు దానిని భక్తులు నొసటన త్రిపుండ్రాలుగా ధరిస్తారు ''విభూతి ర్భూతి రైశ్వర్యమ్'' - విభూతి అంటేనే ఐశ్వర్యం దాన్ని ధరిస్తే అనంతమైన ఐశ్వర్యం కలుగుతుంది ఈ విభూతికి భసితం, భస్మం, విభూతి, క్షారం, రక్ష - అను ఐదు పేర్లు వున్నాయి

***భాసకం భసితం చోక్తం భస్మ కల్మష భక్షణాత్***
***భూతి ర్భూతికరం పుంసాం క్షార రక్షాకరం పరమ్***
***భస్మోద్ధూలనం చైవ తథా తిర్య క్త్రి పుండ్రకమ్***
***స్నానత్వే నైవ సర్వేషాం విధత్తే వైదికే స్మృతిః***

భసితం ప్రకాశింపజేస్తుంది. విభూతి సర్వపాపహరం, సంపత్కరం, రాక్షసబాధా నివారకం, విభూతిని త్రిపుండ్రాలుగా ధరిస్తే చాలు స్నానఫలం

కలుగుతుందని వేదప్రమాణం. భస్మాన్ని భస్మం చేయు వస్తువు ఏదీ లేనే లేదు కావున శివభక్తుడు అన్నివేళలా విధిగా భస్మాన్ని ధరించి నిర్మలుడై ప్రకాశిస్తాడు

''సయేస భస్మ జ్యోతిః సయేస భస్మజ్యోతిః'' అను స్మృతి వాక్యానుసారం ఏ వస్తువు శివనామంతో ప్రకాశిస్తూ, శివుని రూపాన్ని ప్రకాశింపజేయుచున్నదో దాన్ని ''భసితం'' అంటారు అన్నింటిని (మాలిన్యాలను) దహించి పరిశుద్ధి చేస్తూ, జ్యోతి స్వరూపంగా ప్రకాశిస్తూ వున్న శంకరుడే సాక్షాత్తు భస్మ స్వరూపంగా భావించి ధ్యానిస్తూ భస్మధారణ చేయాలి

ఇలా ఎప్పుడు ఏ వేళ శ్రీ కపిలేశ్వరస్వామివారిని దర్శించినా అప్పుడు ఆ వేళ ఆ స్వామి ధరించిన విభూతిని ప్రసాదంగా స్వీకరించి నొసటన ధరించిన వాని జన్మమే జన్మము వాని భాగ్యమే మహాభాగ్యం

శ్రీ కపిలేశ్వరస్వామివారి మూలమూర్తికి (శివలింగం) ప్రతిరోజు సాయంకాలం అభిషేక అర్చనలు నివేదనలు అయిన తర్వాత ''ప్రదోషకాల దీపారాధన'' అనబడే మహా మంగళహారతి జరుగుతుంది ఢమరుకం, భేరీలు, తాళాలు, శంఖాలు, భజంత్రీలు మున్నగు వాయిద్యాలు మ్రోగిస్తుండగా పరమేశ్వరునికి నయనానందకరంగా, ప్రతి ప్రదోషకాలంలో సమర్పించే మహామంగళ నీరాజనాలు కన్నులారా చూచి తీరవలసిందే చెవులారా ఆ మంగళ ధ్వనులు విని తీరవలసిందే తప్ప వర్ణించడానికి సాధ్యం కానేకాదు పిదప ప్రతిరాత్రి చివరగా ఏకాంత సేవామండపంలో శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారలకు ''ఏకాంతసేవ'' నిర్వహించడంతో ఆలయ కార్యక్రమాలు పూర్తి అవుతాయి

శ్రీ కపిలేశ్వరస్వామి భక్తవశంకరుడు, భోళాశంకరుడు ''నచ రుద్రాత్ పరాదేవా'' అన్నట్లుగా రుద్రునికి సాటిరాగల పరదైవం లేనే లేదు ''అభిషేక ప్రియో శివః'' - అన్నట్లుగా కేవలం అభిషేకం మాత్రం చేతనే సంతృప్తి చెందుతూ సమస్త పాపాలను పోగొడుతూ, ఇహ, పర సౌఖ్యాలను ఇబ్బడి ముబ్బడిగా ప్రసాదించే దైవం శ్రీ కపిలేశ్వరస్వామి

సాక్షాత్తు 'కలౌ వేంకట నాయకః' అని ప్రసిద్ధిని పొంది కోరిన వరాల రాయడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి, సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అయిన పద్మావతి అమ్మవారి వివాహమునకు కారణ భూతుడయినవాడు, తాను వెలసిన నాటినుండి ఎందరెందరో ఆర్తులకు, గ్రహబాధితులకు ఉపశమనం కలిగిస్తూ

ఇష్టార్థాలను అనుగ్రహిస్తూ వున్న శ్రీ కపిలేశ్వరస్వామివారిని ఇలా గొంతెత్తి ప్రార్థిస్తూ నతమస్తకులమవుదాం

***అనాద్యాయాఖిలాద్యాయ***
***మాయినే గతమాయినే***
***అరూపాయ స్వరూపాయ***
***శివాయ గురవేనమః***

తనకు మొదలు (ఆది) అనునది లేనివాడు కాని అన్నింటికి మొట్టమొదటి (ఆది) వాడు మాయను తన ఆధీనంలో వుంచుకొన్నవాడు కాని తనకు మాయలేనివాడు తనకు రూపమే లేనివాడు, అయినా స్వరూపాన్ని ధరిస్తాడు. ఇలాంటి విశిష్టమైన, అద్భుతమైన గుణాలతో విరాజిల్లుతూ జగద్గురువై భాసిస్తూ వున్న పరమశివునకు నమస్కారము

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## శ్రీ కామాక్షీ దేవి

***శ్రీవాణీ ప్రతిరూపికాం భగవతీం లోకైక దీపాంకురాం***
***నానామంత్రం నివాసినీం భగవతా శర్వేణ సంవాసినీం***
***వేదోక్తామృత రూపిణీం ప్రతిపద ప్రాణానిలాం కాళికాం***
***కామాక్షీం కపిలేశ్వర ప్రియతమాం వందే జగన్మాతరమ్***

**- కామాక్షీస్తోత్రం - శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ**

శ్రీ మహాలక్ష్మి సరస్వతీ స్వరూపురాలై సమస్త లోకాలను ప్రకాశింపజేస్తూ, సమస్త మంత్రాలకు ఆలవాలమై, వేదరూపిణిగా జగన్మాతగా అయిన శ్రీ కపిలేశ్వరునికి ప్రియతమురాలైన శ్రీ కామాక్షీ దేవికి నమస్కారము.

శ్రీ కపిలేశ్వరస్వామివారి దేవేరి అయిన పార్వతీదేవి ఈ క్షేత్రంలో 'కామాక్షీదేవి' అని పిలువబడుతున్నది. ఈ అమ్మవారు కరుణాపూరితమైన తన అక్షులతో (నేత్రాలతో) వీక్షిస్తూ, భక్తుల కామన (కోరిక) లన్నింటిని తీరుస్తూ, చిరుమందహాసంతో దర్శనమిస్తూ "కామాక్షీదేవి" అని సార్థక నామధేయంతో విరాజిల్లుతూ వుంది.

శ్రీ కామాక్షీ దేవి చతుర్భుజియై స్థానక (నిలిచివున్న) భంగిమతో చల్లని చూడ్కులతో దర్శనమిస్తున్నది పై కుడి చేతిలో అంకుశాన్ని, పై ఎడమచేతిలో పాశాన్ని ధరించి, క్రింది కుడి ఎడమ చేతులను వరుసగా అభయ వరద ముద్రలతోను, సన్నని నడుముతో కొంచెం వయ్యారంగా, సొంపైన రీతిలో నిలిచివుండి అనుగ్రహరూపిణిగా వున్న ఈ అమ్మవారి శిలామూర్తి పీఠంతో కలిపి సుమారు మూడు అడుగుల ఎత్తు ఉంటుంది

శ్రీ కామాక్షీ అమ్మవారికి (మూలమూర్తి) ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండు పూటలా తెరలమాటున ఏకాంతంగా అభిషేకం జరుపబడుతున్నది

ముందుగా ఈ మూర్తికి తైలాన్ని బాగా అలదిన తర్వాత శీకాయ నీళ్లతో అభిషేకం చేస్తారు పిదప వరుసగా శుద్ధజలం, గోక్షీరం, పెరుగు, నెయ్యి, తేనె, ఫలరసాలు (పంచామృతాలు), కొబ్బరినీరు, సుగంధతీర్థం (ఏలకులు, పచ్చకర్పూరం, కుంకుమపువ్వు మున్నగువాటి మిశ్రణం), చందనం, పసుపు మున్నగు ద్రవ్యాలతో కామాక్షి అమ్మవారికి అభిషేకం జరుగుతుంది ముఖమండపంలో కూర్చున్న వేదపండితులు నమక చమక మంత్రాలను, శ్రీసూక్త, భూసూక్త, దుర్గాసూక్తాదిగా మంత్రాలను పఠిస్తుండగా ఒకేసారి శ్రీ కపిలేశ్వరస్వామివారికి, శ్రీ కామాక్షీ అమ్మవారికి అభిషేకాలు జరుపబడుతవి

అభిషేకానంతరం అమ్మవారికి పట్టువస్త్రాలను అలంకరించిన తర్వాత అభయ వరద హస్తాలకు, పాశాంకుశాలను ధరించిన హస్తాలకు, పాదాలకు వెండి కవచాలను అమరుస్తారు వెండి కిరీటాన్ని కూడా అలంకరిస్తారు వెండి ముక్కుపుడకను ధరింపజేస్తారు కొన్ని విశేష పర్వదినాల్లోను, శుక్రవారాల్లోను ఉదయం అభిషేకం అయిన వెంటనే అమ్మవారికి నిలువెల్లా బంగారు కవచాలను ధరింపజేస్తారు

ఆ తర్వాత పుష్పమాలాలంకరణ చేసిన తర్వాత నొసటన చందనం, కుంకుమను తీర్చిదిద్దుతారు అనంతరం లలితా అష్టోత్తర శతనామాలను వేదపండితులు పఠిస్తుండగా; అర్చకస్వాములు అమ్మవారి పాదాల ముందువున్న శ్రీచక్రయంత్రానికి కుంకుమార్చన చేస్తారు మధ్యాహ్నం పూట మాత్రం అభిషేకానంతరం అమ్మవారికి లలితా సహస్రనామాలతో కుంకుమార్చన జరుగుతుంది

ఇలా అభిషేకాలు పూర్తి అయిన వెంటనే శ్రీ కపిలేశ్వరస్వామివారితోపాటు, అమ్మవారికి, ఆలయంలో వున్న అందరు పరివార దేవతలకు ఘనంగా నివేదనలు జరుగుతవి

ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండువేళలా శ్రీ కామాక్షి అమ్మవారికి అభిషేకాలు జరపడంతోపాటు, ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో ఒక్క నెల రోజులు మాత్రం, తెల్లవారు జామున ఆలయం వాకిళ్ళు తెరచిన వెంటనే అన్ని మూర్తులతో పాటు శ్రీ కామాక్షీ అమ్మవారి మూలమూర్తికి ధనుర్మాసపు అభిషేకం జరుగుతుంది పిదప అర్చన అయిన వెంటనే ధనుర్మాస నివేదనానంతరం పంచవాద్య సమ్మేళనంతో కర్పూర హారతి జరుపబడుతుంది

***బిల్వపత్రం యధాప్రీతికరం దేవ్యా వరాననే***
***న తథాన్యత్ కించి దస్తి పుష్పేషు ప్రీతి కారకమ్.***
***అ తో యత్నేన దాతవ్యం బిల్వపత్రం త్రిపత్రయుక్.***

***- ఉత్తరామ్నాయ మహాకాల సంహిత***

దేవికి మారేడు దళం అంటే ఎంతో ప్రీతికరం దానిని మించిన పుష్పంకాని పత్రం కాని లేనే లేదు అందువల్ల ప్రయత్నించి మూడు ఆకుల కలిగివున్న బిల్వదళాన్ని అమ్మవారికి సమర్పించవలెను

***బిల్వ పత్రైశ్చ జలజైః - సత్ర్యైశ్చ పరిపూజయేత్***
***పూర్వవత్ పరమేశాని - మాసమాత్రం ప్రసన్నధీః***
***సమృద్ధిమాన్ భవేన్మంత్రీ - సర్వపాపం హరేత్సదా***

***- "జ్ఞానార్ణవం"***

పార్వతీదేవిని ఒక నెల పాడవునా మారేడు దళాలతో, తామర పుష్పాలతో ప్రసన్నమైన బుద్ధితో అర్చించినచో సర్వపాపాలు నశించి సమృద్ధి గలిగినవాడగునని చెప్పబడింది.

***చంపకైః పుత్రకామస్తు త్రిసంధ్యా దుఃఖ మోక్షకా***
***ద్రోణాత్ మోక్ష మవాప్నోతి - సేవంతీ సర్వసిద్ధి దా.***

***- ఊర్ధ్వామ్నాయం మరియు వామకేశ్వరతంత్రం***

సంపెంగ పుష్పాలతో దేవిని అర్చించిన పుత్రులను కలిగిస్తుంది త్రిసంధ్య అనే మూడు దొంతుల మందారం దుఃఖాల్ని పోగొడుతుంది తుమ్మిచే పూజిస్తే మోక్షం కలుగుతుంది. అలాగే చేమంతులతో అర్చించినట్లయితే వారికి సమస్త కోరికలు తీరుతాయని పై రెండు గ్రంథాలు పేర్కొంటున్నాయి.

ప్రతి శుక్రవారం మధ్యాహ్నం అభిషేకానంతరం శ్రీ కామాక్షి అమ్మవారికి, నిలువెల్ల బంగారు కవచం అమర్చబడుతుంది చీర, రవిక, వరదాభయ హస్తాలు కిరీటం సువర్ణ ఛాయలతో ప్రకాశిస్తూ వుండగా అమ్మవారు వింత వింతకాంతులతో భాసిస్తూ వుండగా భక్తులు మైమరచి ఒక దివ్యానుభూతికి లోనవుతారు ఇలా అలంకారం అయిన వెంటనే అమ్మవారికి ప్రతి సాయంత్రం లలితా సహస్ర నామాలతో కుంకుమార్చన జరుగుతుంది. అమ్మవారికి పాదాల ముందు వున్న శ్రీ చక్రయంత్రం మీద ఈ కుంకుమ సమర్పింపబడుతుంది

ఈ కామాక్షి అమ్మవారికి శరన్నవరాత్రులనబడే దసరా పండుగ దినాలలో విశేషంగా అర్చనలు, నివేదనలు జరుపబడుతవి ప్రత్యేకంగా, ఏకాంత సేవా మండపంలో కలశస్థాపన చేసి, అందులో శ్రీ కామాక్షి అమ్మవారిని ఆవాహనా చేసి, ప్రత్యేకంగా కుంకుమార్చనలు, నివేదనలు, ప్రదోషకాల దీపారాధనలు జరుపబడుతవి

ప్రతి సంవత్సరం కార్తీకమాసం కృత్తికా నక్షత్రం రోజున శ్రీ కపిలేశ్వరస్వామి వారితో పాటు శ్రీ కామాక్షి దేవికి కూడా కృత్తికా దీపోత్సవం అనే మహామంగళ హారతి వేడుకలు ఆనాటి ప్రదోష సమయంలో ఘనంగా జరుపబడుతుంది

సౌరమానం ప్రకారం ప్రతి సంవత్సరం మకరమాసంలోని పున్నమికి ముందు వచ్చే శుక్రవారం నాడు - అనగా తెలుగు పుష్యమాసం (తమిళుల తైనెల) పున్నమికి ముందు శుక్రవారంనాడు శ్రీ కామాక్షిదేవి మూలమూర్తికి పాదాది శిరసాదిగా నిలువెత్తు చందనాలంకారం జరుపబడుతుంది ఈ చందనాలంకార సేవ వార్షికోత్సవంగా ఘనంగా నిర్వహింపబడుతున్నది

ఆనాటి సాయంత్రం నాడు అభిషేకానంతరం శ్రీ కామాక్షి అమ్మవారి మూలమూర్తిని శుభ్రమైన వస్త్రంతో బాగా తుడుస్తారు పిదవ చందనం, పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు, పన్నీటి మిశ్రణాన్ని (చందనపు ముద్ద) శ్రీ కామాక్షి అమ్మవారి మూలమూర్తి కిరీటం మొదలు పాదాలవరకు పూర్తిగా అలదుతూ

అలంకరిస్తారు రవికగా, పట్టుచీరగా చందనాన్ని తీర్చి దిద్దిన తర్వాత అంచులుగా చందనం మీద సరిగను అతికిస్తూ తీర్చిదిద్దడం జరుగుతుంది.

అలాగే అమ్మవారి ముఖానికి, కన్నులకు, చెవులకు, అభయ వరద హస్తాలకు కిరీటానికి, పాదాలకు చందనాన్ని అలంకరిస్తారు. పిదప చెవులకు బంగారు కర్ణాభరణాలను, ముక్కుపుటకను, బంగారు కిరీటాన్ని కంఠాభరణాలను, నొసట తిలకా భరణాన్ని బంగారు వరదాభయహస్తాలను, బంగారు పాదకవచాలను అమరుస్తారు పిదప చందనం అద్దిన ముఖారవిందంపై కన్నులను, కనురెప్పలను, కనుబొమ్మలను అందంగా తీర్చిదిద్దుతారు

శ్రీ కామాక్షి అమ్మవారికి చందనాలంకారాన్ని అర్చకస్వాములు తెరలమాటున ఏకాంతంగా తీర్చిదిద్దుతారు

ఇలా ఆపాదమస్తకం అర్చకస్వాములచే తీర్చిదిద్దబడి అలంకరించిన శ్రీ కామాక్షి అమ్మవారి చందనాలంకార దర్శనం భక్తులకు ఒకమైమరుపుతో కూడిన దివ్యానుభూతిని కల్గిస్తుంది ఇలా చందనాలంకారంతో శోభాయమానంగా ప్రకాశిస్తూ వున్న కామాక్షి అమ్మవారికి లలితా సహస్రనామాలతో కుంకుమార్చన జరుపబడుతుంది ఇదే సమయంలో శ్రీ కపిలేశ్వర మహాశివలింగానికి బిల్వదళాలతో సహస్ర నామార్చన జరిగిన తర్వాత నివేదన జరుగుతుంది ఈ నివేదన సమయంలో చందనాలంకారంలో ప్రకాశిస్తున్న శ్రీ కామాక్షీ అమ్మవారికి, మామూలు అన్న ప్రసాదాలు, పూరణం పోలీలతో పాటు ప్రత్యేకంగా చక్కెర పొంగలి, నివేదింపబడుతుంది. ఆ తర్వాత ప్రదోషకాలంలో జరిపే మహాదీపారాధన పంచవాద్య సమ్మేళనంతో నిర్వహిస్తారు

ఇలా నిత్యమూ, నిత్యోత్సవాల్లో, వారోత్సవాల్లో మాసోత్సవాలతో, వార్షికోత్సవాల్లో ప్రకాశిస్తూ వున్న కామాక్షీ అమ్మవారు భక్తుల కామనలన్నీ తీరుస్తూ ఇష్టార్థ ప్రదాయినిగా ప్రసిద్ధికెక్కింది.

స్వయంభువుగా వెలసిన శ్రీ కపిలేశ్వర మహాశివలింగమూర్తికి, దేవేరి అయిన శ్రీ కామాక్షి అమ్మవారి స్థానక (నిలిచివున్న భంగిమ) శిలామూర్తి ఎప్పుడు ప్రతిష్ఠింపబడిందో చరిత్రకు అందడంలేదు శ్రీ కపిలేశ్వరస్వామివారితో పాటు నిత్యమూ అభిషేకార్చనలతో విరాజిల్లుతూ వున్న శ్రీ కామాక్షీ దేవికి నకలు ప్రతిమామూర్తులుగా ''శుక్రవారపుదేవి'', 'కామాక్షి దేవి' అనే పేర్లతో పంచలోహ

మూర్తులు ఈ క్షేత్రంలో చల ప్రతిష్ఠతో చోటుచేసుకున్నాయి ఈ పంచలోహ మూర్తుల వివరాలు తర్వాత తెలుసుకుందాం.

శ్రీ కామాక్షి అమ్మవారి గర్భాలయంపైన ఏకల కలశ గోపురం నిర్మింపబడింది ఆ గోపురంపై నాలుగు దిక్కుల దేవీ ప్రతిమలు వున్నాయి

***బ్రహ్మా జగత్సృజతి పాలయ తీందిరేశః***
***శంభు ర్వినాశయతి దేవి తవ ప్రభావైః***
***నస్యాత్కృపా యది తవ ప్రకట ప్రభావే***
***నస్యుః కథంచి దపి తే నిజకార్య దక్షాః***

జగన్మాత కరుణవల్లే బ్రహ్మదేవుడు సమస్త చరాచరాలను సృష్టింపగలుగుచున్నాడు విష్ణులోకాలను పాలించుచున్నాడు ఇక సాక్షాత్తు పరమేశ్వరుడు సృష్టినంతను లయం చేస్తూ లయకారునిగా ప్రసిద్ధినందివున్నాడు అమ్మవారి అనుగ్రహ విశేషంవల్లే జరుగుతున్నాయని, అమ్మవారి ప్రభావాన్ని, కృపావిశేషాలను ఎందరో మహనీయులు ఎన్నో విధాలుగా ప్రకటించారు

అంతేగాక త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులచేత సర్వలోకాల చేత జగన్మాతగా కీర్తింపబడుచున్న మహాదేవి ఈ కపిలతీర్థ క్షేత్రంలో శ్రీ కామాక్షీ దేవిగా వెలసి వున్నది. ఆయమను నమస్కరించుటకుగాని, స్తుతించుటకు గాని ఎంతయో పుణ్యము చేసికొన్న వారికి మాత్రమే దక్కుతుంది అనగా అకృత పుణ్యుడు ఆ దేవిని పూజింప సమర్థుడు కాడు అలాంటి కామాక్షిదేవి జగన్మాత, మోక్షప్రదాయిని ఆమే శ్రీమాత శ్రీ లలిత అందువల్లే ప్రతినిత్యమూ శ్రీ లలితా సహస్రనామాలతోను, అష్టోత్తర శతనామాలతోను ఆరాధింపబడుచున్నది

ఇలాగ భక్తులందరిచేత ఎన్నో విధాల కీర్తింపబడుతూ, ఆ భక్తులందరికీ కోరిన కోరికలను నిండుగా, మెండుగా అనుగ్రహిస్తూ సార్థక నామధేయురాలైన శ్రీ కామాక్షీ అమ్మవారిని భక్తితో కీర్తిస్తూ ప్రణామాలు సమర్పించుదాం.

***అకారాది క్ష కారాన్తాం***
***అద్యాం ఆనందరూపిణీమ్***
***అఖిలార్థ ప్రదాం దేవీం***
***నమామి జగదంబికామ్***

అకారం నుంచి క్ష కారం వరకు గల సర్వవర్ణాల చేత వర్ణింపబడుతున్న సాక్షాత్తు జగదంబ ఆ దేవి ప్రకృతి కంతటికి ఆది అనగా త్రిమూర్తులకు త్రిశక్తులకు కూడా ఆమెయే మూలము ఆది కూడ ఆనంద స్వరూపిణి. సర్వార్థాలతో పాటుగా చివరకు ముక్తిని కూడా ప్రసాదించే అమ్మలగన్న అమ్మ శ్రీ కామాక్షి దేవి అట్టి జగదాంబికకు నమస్కరిస్తున్నాను

## శ్రీ చండికేశ్వరస్వామి

పరమశివుని పరివారంలో అత్యంత ప్రధానుడు, ప్రకృష్ట శివభక్తుడు నిరంతర శివధ్యాన పరాయణుడు శ్రీ చండికేశ్వరస్వామి ఈ స్వామి శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల ప్రదక్షిణ పథంలో సోమసూత్రం వద్ద ధ్యాన నిమగ్నమూర్తిగా దక్షిణాభిముఖుడై వేంచేసి ఉన్నాడు

శ్రీ కపిలేశ్వరస్వామివారి గర్భాలయంలోని అభిషేక జలం వెలుపలికి పారే సోమసూత్రం వద్ద సుమారు ఒకటిన్నర అడుగుల ద్విభుజ సమేతుడై ఈ చండికేశ శిలామూర్తి దర్శనాన్ని అనుగ్రహిస్తున్నాడు పీఠం మీద అధివసించి ధ్యాన విలీనుడైన ఈ స్వామివారి కుడిచేతిలో అంకుశం ప్రకాశిస్తున్నది ఎడమ చేయి మడచిన ఎడమకాలుపై ఆని వుంది కుడికాలు కొద్దిగా క్రిందికి జారవిడువబడి వుంది

శ్రీ కపిలేశ్వర క్షేత్రంలో ప్రతిరోజూ మొదటి పూజ ఈ క్షేత్రంలోనే వేంచేసి వున్న ''శ్రీ శివ సూర్యస్వామి''కి జరుగుతూ వుండగా, రాత్రి చిట్టచివరి పూజ ఈ చండికేశ్వరస్వామివారికి నిర్వహించబడుతున్నది

*చండికేశ! మహాభాగ!*
*శివధ్యాన పరాయణ!*
*శివపూజా ఫలం దేహి*
*ధ్వని శ్చండ నమోస్తుతే*

ప్రతి భక్తుడు శ్రీ కామాక్షీ కపిలేశ్వరులను సేవించిన తదుపరి కపిలేశ్వరస్వామివారి దగ్గర ప్రసాదంగా బిల్వ పత్రాన్ని (మారేడు దళాలు) స్వీకరించి, ప్రదక్షిణం చేస్తూ సోమసూత్రం వద్ద శివధ్యానంలో వున్న చండికేశ్వరుని దగ్గర చేతితో మెల్లగా చిటికెలు వేస్తూ, ఆయనకు మెలకువ కలిగించాలి. తదేకంగా నిరంతరం శివధ్యానంలో మునిగి వున్న చండికేశునికి భక్తులు చేసే

చిటికెల శబ్దం వల్ల ధ్యానభంగం అయి కళ్లు తెరచి ఉగ్రుడవుతాడట! ఆ క్షణంలోనే భక్తులు ఆయనకు కోపం రాకుండా తమ వద్ద వున్న కపిలేశ్వరుని ప్రసాదమైన బిల్వదళాలను ఆయనకు సమర్పిస్తూ పైన తెల్పిన విధంగా ప్రార్థించాలి శివ నిర్మాల్యాన్ని ప్రసాదంగా స్వీకరిస్తూ శాంతించిన చండికేశుడు పరమ సంతోషంతో శ్రీ కపిలేశ్వరస్వామి వారి అనుగ్రహం నిండుగా మెండుగా కలుగవలెనని ప్రార్థిస్తూ భక్తులను ఆశీర్వదిస్తాడట!

ఈ చండికేశునికి ''ధ్వనిశ్చండుడు'' అని కూడా పేరు అంటే భక్తులు తాము శ్రీ కపిలేశ్వరుని సేవించిన సంగతిని చిటికెల ద్వారా ధ్వనిచేసి మేల్కొలుపుతూ ఆ చండికేశ్వరునికి వినిపిస్తారని భావం

శివుని సోమసూత్రం దగ్గర వున్న ఈ ధ్వనిశ్చండునితో పాటు, గణేశుని నిరంతరం ధ్యానిస్తున్న ''శ్రీ కుంభ చండికేశ్వరుడు'' అలాగే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని ధ్యానిస్తూ వున్న ''శ్రీ సుమిత్ర చండికేశ్వరుడు'', ఆ యా దేవతల సన్నిధిల్లో వుండటం శైవాగమ సంప్రదాయం కాని ఈ విగ్రహమూర్తులు ప్రస్తుతం ఇక్కడ లేకపోయినా అర్చకస్వాములు ఆయా చోట్ల ఆ మూర్తులు వున్నట్లుగానే భావిస్తూ అర్చన నివేదనాదులను మానసికంగా సమర్పించి వారిని పూజిస్తారు

శివుని సోమసూత్రం దగ్గర వెలసి వున్న శ్రీ చండికేశ్వరస్వామివారికి నందీశ్వరుడు మున్నుగాగల తదితర పరివార దేవతామూర్తులతోపాటు ప్రతి ఉదయం ఒకసారి అభిషేకం, మూడు పూటలా నివేదనలు జరుపబడుతున్నవి.

అంతమాత్రమేగాక రాత్రివేళ శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారలకు ఏకాంత సేవ జరిగిన అనంతరం చండికేశ్వరస్వామికి చిట్టచివర పూజ జరుపబడుతుంది.

చండికేశ్వరుడు ప్రదక్షిణ మార్గంలో శిలామూర్తిగానే గాక ఏకాంత సేవా మండపంలో సుమారు ఒకటిన్నర అడుగుల ఎత్తుగల పంచలోహమూర్తిగా కూడా వేంచేసి వున్నాడు. ఈ పంచలోహమూర్తి ప్రాధాన్యాన్ని పిమ్మట తెలుసుకుందాం. భక్తులు శ్రీ కామాక్షీ కపిలేశ్వరులను సేవించిన ఫలితాన్ని సంపూర్ణంగా ఒనగూర్చే ఈ చండికేశ్వరుణ్ణి పరమభక్తితో ప్రార్థించుదాం.

*శివాంజలి కృతం చండం*
*శివధ్యాన పరాయణమ్*
*శివార్చాఫల దాతారం*
*శివచండేశ్వరం భజే!*

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## పరివార దేవతా మండపం

శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల సన్నిధికి దక్షిణంగా ఈ పరివార దేవతా మండపం వుంది ఈ మండపం శ్రీ కామాక్షీ కపిలేశ్వరులకు ప్రదక్షిణా మార్గంగా కూడా ఉపయోగపడుతున్నది

ముఖ్యంగా ఈ మండపంలో ఉత్తర, తూర్పుగోడలకు ఆనుకొని వున్న పొడవైన అరుగుపై వరుసగా శ్రీ దక్షిణామూర్తి, కాలభైరవస్వామి, మహాగణపతి, మహాశాస్త, కాశీవిశ్వేశ్వరస్వామి, ఉమామహేశ్వరస్వామి, రామలింగేశ్వరస్వామి, ప్రమథగణపతి, శ్రీ శివసూర్యస్వామి శిలామూర్తులు వున్నాయి.

ఇవిగాక ఈ పరివార దేవతా మండపంలోనే ప్రత్యేకంగా ఆగ్నేయమూలన ''నవగ్రహదేవతా వేదిక'', దీనికి ఎదురుగా శ్రీ వల్లీ దేవసేనా సమేత షణ్ముఖుని సన్నిధి, దీనికి ఆనుకొని ఉత్తరం వారకు ''ప్రతిమా మండపం'' అనబడే '''ఏకాంతసేవా మండపం'' చోటు చేసుకున్నాయి. వీటిని గురించి వరుసగా తెలుసుకుందాం.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## శ్రీ దక్షిణామూర్తి

శ్లో॥ *ఓం నమః ప్రణవార్థాయ శుద్ధ జ్ఞానైక మూర్తయే*
*నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః*

శ్లో॥ *గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్*
*నిధయే సర్వవిద్యానాం దక్షిణా మూర్తయే నమః*

పరివార దేవతల మండపంలో రెండడుగుల పొడవుగల అరుగుమీద దక్షిణాభిముఖంగా కొలువుదీరి ప్రప్రథమంగా సాక్షాత్కరించే స్వామి శ్రీ మేధా దక్షిణామూర్తి పంచముఖాలతో విరాజిల్లే పరమేశ్వరుని ఐదురూపాలలో దక్షిణాభిముఖంగా వున్న మూర్తిని ''దక్షిణామూర్తి'' అంటారు ఈ స్వామి సకల జగద్గురుమూర్తిగా ప్రశస్తిగాంచిన జ్ఞాన ప్రదాత.

కపిలేశ్వర క్షేత్రంలో శిలావేదికపై ఆసీన భంగిమలో దర్శనమిస్తున్న దక్షిణామూర్తి చతుర్భుజాలతో విరాజిల్లుతూ భక్తులను ఆకర్షిస్తూ వున్నాడు పై కుడిచేతిలో నాగపాశాన్ని, పై ఎడమ చేతిలో త్రిశూలాన్ని , క్రింది కుడిచేతిలో జపమాలను ధరించి చిన్ముద్ర (జ్ఞానముద్ర) వహించి వున్నాడు క్రింది ఎడమ చేతిలో పుస్తకాన్ని ధరించి ధ్యానంలో మునిగివుంటూ వటవృక్షం క్రింద పీఠంపై ఆసీనుడై కుడికాలుపై ఎడమకాలును వైచి, క్రిందికి జారవిడిచిన కుడికాలితో అపస్మారుడనే రాక్షసుని అణచివేస్తూ (భంజిస్తూ) ఉన్నాడు

వటవృక్షమూలంలో వేదికపై చిన్ముద్రా ధారియై ధ్యానయోగంలో సంలీనుడై ఉన్న సద్గురుమూర్తి అయిన శ్రీ మేధా దక్షిణామూర్తి స్వామివారికి వృద్ధులైన మహర్షులు యోగులు శిష్యత్వంతో పరివేష్టించి వున్నారు

జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులవారు వచించిన శ్రీ దక్షిణామూర్తి స్తోత్రంలోని వర్ణనకు ఆకృతిని కల్పించి ప్రతిష్ఠించిన మూర్తిగా ఈ దక్షిణామూర్తి దర్శనమిస్తూ చూపరులకు ఆనందాన్ని ప్రసాదిస్తూ వున్నాడు

**శ్లో॥ మన్దస్మితం స్ఫురిత ముగ్ధ ముఖారవిందం**
**కందర్పకోటి శతసుందర దివ్యమూర్తిమ్**
**ఆ తామ్ర కోమల జటాఘటితేందు లేఖాం**
**ఆలోకయే వటతటీ నిలయం దయాలుమ్**

**శ్లో॥ వట విటపి సమీపే భూమిభాగే నిషణ్ణం**
**సకలముని జనానాం జ్ఞానదాతార మారాత్**
**త్రిభువన గురుమీశం దక్షిణామూర్తిదేవం**
**జననమరణ దుఃఖచ్ఛేద దక్షం నమామి.**

**శ్లో॥ చిత్రం వట తరోర్మూలే వృద్ధా శ్శిష్యా గురుర్యువా.**
**గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః**

**శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానం**
**వర్షిష్ఠాన్తే వసదృషి గణై రావృతం బ్రహ్మనిష్ఠైః**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం**
**స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తి మీడే.**

వృద్ధులైన బ్రహ్మనిష్ఠులకు, ఋషులకు కేవలం జ్ఞానముద్ర (చిన్ముద్ర) తో మౌనంతోనే వారివారి సంశయ సందేహ పరంపరలను నివారిస్తూ ఆనంద మూర్తియై భాసిస్తున్న శ్రీ దక్షిణామూర్తి వారి శిలా విగ్రహం పీఠంతో సహా సుమారు మూడు అడుగుల ఎత్తు వుంటుంది ఈ శిలామూర్తికి చుట్టూ ఇత్తడి మకరణ తోరణం ఏర్పాటు చేయబడి వుంది

శ్రీ కపిలేశ్వరస్వామి వారి ఆలయంలోని అన్ని మూర్తులతో పాటు ఈ స్వామివారికి ప్రతిరోజు ఉదయం అభిషేకం, మూడుపూటలా నివేదనలు జరుగుతవి ఉదయం పులిహోర, మిరియపు పొంగలితోపాటు శుద్ధాన్నం కూడా నివేదిస్తారు మధ్యాహ్నం దధ్యోదనం, సాయంత్రం పులిహోర, పాయసం, చక్కెర, పొంగలి, వడలు నివేదన చేస్తారు

ప్రతి గురువారం ఉదయం శ్రీ దక్షిణామూర్తికి విశేషంగా పాలు, పెరుగు, తేనె మొదలగు పంచామృతాలతో అభిషేకాలు నిర్వహించిన పిదప వస్త్రాలంకరణ, పుష్పాలంకరణ సమర్పిస్తారు అనంతరం అష్టోత్తర శతనామాలతో అర్చనలు నివేదనలు ఘనంగా నిర్వహిస్తారు

శ్రీ వేంకటాచల క్షేత్రమూలంలోని శ్రీ కపిలతీర్థంలో పవిత్రంగా వెలసి వున్న సకల సద్గురుమూర్తియైన ఈ దక్షిణామూర్తిని దృఢ దీక్షతో కూడిన ఒక ప్రత్యేక దృష్టితో నియమబద్ధంగా ఉపాసించినట్లయితే, ఆరాధించినట్లయితే ఇహ పరాలు కరతలామలకం కాగలవని అనుభవజ్ఞులైన పెద్దలు చెప్పిన మాట

అనాదిగా ఎందరెందరో భక్తులు, నిజ జీవితాల్లో అనేక సమస్యలకు లోనై బాధపడేవారు, గురుదోషం వున్నవారు, జ్ఞాపకశక్తి సరిగా లేని బాలబాలికలు జ్ఞానం కోరేవారు, ఉద్యోగం వాంఛించువారు – ఇలా ఎందరో ఈ దక్షిణామూర్తిని ఉపాసించి, ఆరాధించి ఇష్టార్థసిద్ధిని పొందుతున్నారు.

అలాంటి సకల లోక సద్గురువమూర్తి అయిన శ్రీ దక్షిణావమూర్తి స్వామివారిని ఇలా స్తుతించి ప్రార్థించుదాం.

శ్లో॥ ఈశ్వరో గురు రాత్మేతి మూర్తిభేద విభాగినే
వ్యోమ వద్వ్యాప్త దేహాయ దక్షిణామూర్తయే నమః

ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!

★ ★ ★ ★

## శ్రీ కాలభైరవస్వామి

శ్లో॥ దేవరాజ సేవ్యమాన పావనాంఘ్రి పంకజం
వ్యాళయజ్ఞ సూత్ర మిందుశేఖరం కృపాకరమ్
నారదాది యోగి బృంద వందితం దిగంబరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే.

ఆనందకాననమని ప్రసిద్ధిగాంచిన శ్రీ కాశీక్షేత్రం (వారణాశి)లో క్షేత్రపాలకుడై దేవతలందరిచేత పూజలందుకొంటున్న శ్రీ కాలభైరవస్వామి భూలోక వైకుంఠమయిన శ్రీ వేంకటాచలక్షేత్రం మూలంలోని శ్రీ కపిలేశ్వర క్షేత్రంలో కూడా క్షేత్రపాలకుడై ఆరాధనలందుకొంటూన్నాడు

పరివార దేవతా మండపంలో శ్రీ దక్షిణామూర్తికి ప్రక్కనే ఒకటిన్నర అడుగుల ఎత్తుగల శిలామూర్తిగా స్థానక (నిలిచివున్న) భంగిమలో వేంచేసి వున్న మూర్తి శ్రీ కాలభైరవస్వామి

అసితాంగో, రురు, శ్చండ
క్రోధ, శ్చోన్మత్త భైరవః
కపాలీ, భీషణశ్చైవ
సంహార, శ్చాష్ట భైరవాః

అని పేర్కొనబడిన ఎనిమిది మంది కాలభైరవుల్లో ఆరవమూర్తి అయిన కపాలభైరవుడు ఈ కపిలతీర్థ క్షేత్రంలో వెలసి ఉన్నాడు జడలు దాల్చి, చతుర్భుజాలతో విరాజిల్లుతూ, పై కుడిచేతిలో త్రిశూలాన్ని, పై ఎడమ చేతిలో డమరుకాన్ని, క్రింది కుడిచేతిలో మొనపైకి తేలివున్న ఖడ్గాన్ని, క్రింది ఎడమచేతిలో కపాలాన్ని ధరించి, దిగంబరుడైన కాలభైరవస్వామి వాహనమైన శునకరాజంతో కూడా విరాజిల్లుతూ దర్శనమిస్తున్నాడు. ఈ మూర్తేకాక ఆలయ ప్రాంగణంలోని

నాగులకట్టలో కూడా ప్రాచీనమైన రెండు కాలభైవర విగ్రహాలు చోటు చేసికొని వున్నాయి కొద్దిగా విరిగి భిన్నమైనప్పటికీ ఈ శిలా విగ్రహాలు కళానైపుణ్యం మిగుల మనోజ్ఞంగా గోచరిస్తూ వుంది.

శ్రీ కపిలేశ్వర క్షేత్రంలో క్షేత్ర పాలకుడై పూజలందుకొంటూ వున్న శ్రీ కాలభైవరస్వామి ''సంతాన ప్రదాత, సంతాన రక్షకుడు' అనే ప్రసిద్ధి ఉన్నది అంత మాత్రమే గాక దుష్ట సమయాల్లో సంకట వేళల్లో తప్పనిసరిగా ప్రయాణం చేయవలసి వస్తే, లేదా రాత్రి వేళల్లో చీకట్లో వెళ్ళవలసి వచ్చినప్పుడు

*శ్రీ కాలభైరవా! శ్రీ కపిలేశ్వరా!!*

*శ్రీ కాలభైరవా! శ్రీ కాశీ ఈశ్వరా!!*

అనే నామ సంబోధనలను భక్తి శ్రద్ధలతో ఉచ్చరిస్తే ఎలాంటి ప్రమాదాలుగాని, వృశ్చిక సర్పాది విషకీటకాల బాధలు కాని వుండవనీ, ప్రయాణం సుఖమయం కావడమే గాక జయప్రదం అవుతుందని క్షేత్ర పాలకుడైన శ్రీ కాలభైరవుని మహిమలను గూర్చిన ప్రఖ్యాతి అనాదిగా ఇచ్చట నెలకొని వుంది

ఇతర మూర్తులకు వలెనే శ్రీ కాలభైరవస్వామివారికి ప్రతిరోజు ఉదయం పూట అభిషేకం, మూడుపూటలా నివేదనలు జరుపబడుతున్నవి

ప్రతిరోజు ఉదయం ఆలయం తెరచిన వెంటనే తొలి పూజతోపాటు రాత్రి శ్రీ కామాక్షి కపిలేశ్వరుల ఏకాంత సేవానంతరం చివరగా మంత్ర పూర్వకంగా ఆలయం తాళంచేతుల సమర్పణ వంటి కార్యక్రమాలు ఈ కాలభైరవుని సన్నిధిలో జరుపబడుతున్నాయి

కాశీ క్షేత్రంలో వలెనే సుప్రసిద్ధమైన శ్రీ కపిలేశ్వర క్షేత్రంలోనూ క్షేత్రపాలకుడై సకల గ్రహదోష నివారకుడై వెలసివున్న శ్రీ కాలభైరవస్వామివారిని భక్తి ప్రపత్తులతో ఆరాధించి అభీష్టార్థసిద్ధిని పొందుదాం

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## మహాగణపతి

***గణాధిప నమస్తేస్తు ఉమాపుత్ర గజానన!***
***వినాయకేశతనయ! సర్వసిద్ధి ప్రదాయక***
***ఏకదంతైక వదన! తథా మూషిక వాహన***
***కుమార గురవే తుభ్యం సమర్పయామి సుమాంజలిమ్.***

పరివార దేవతా మండపంలోని రెండడుగుల ఎత్తు వున్న పొడవైన శిలావేదికపై కాలభైరవస్వామి ఎడమ ప్రక్కన ఆనుకొని దక్షిణాభిముఖంగా వేంచేసి వున్న మూర్తి శ్రీ మహాగణాధిపతి

చతుర్భుజుడైన ఈ శిలామూర్తి సుమారు రెండున్నర అడుగుల ఎత్తు వుంటుంది మూషిక వాహనుడై ఆసీన భంగిమలో వేంచేసి వున్న ఈ మూర్తి పైకుడిచేతిలో అంకుశాన్ని పై ఎడమ చేతిలో పాశాన్ని, క్రింది కుడిచేతిలో విరిగిన దంతాన్ని, క్రింది ఎడమ చేతిలో మోదకాన్ని ధరించి దానిని తొండంతో స్వీకరిస్తూ ఉన్నాడు

ఈ మహాగణపతి మూర్తికి ఆలయంలోని ఇతర పరివార దేవతా మూర్తులతో పాటు ఉదయం పూట ఒకసారి అభిషేకమూ, ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం ఇలా మూడు పూటల నైవేద్యాలు జరుప బడుతున్నాయి

వినాయక చవితినాడు విశేషంగా భక్తులచే పూజలందుకొంటూ కార్యసిద్ధిని కలిగించే ఈ గణేశుణ్ణి ఇలా ప్రస్తుతించుదాం

***గజాననం భూత గణాధి సేవితం***
***కపిత్థ జంబూ ఫలసార భక్షితమ్***
***ఉమాసుతం శోకవినాశ కారణం***
***నమామి విఘ్నేశ్వర పాద పంకజమ్.***

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## మహాశాస్త

శాస్త అనగా శాసించేవాడని అర్థం శైవ క్షేత్రంలో ఎలాంటి భూతప్రేత పిశాచాది గణాలు ప్రవేశించకుండా, అవి ఏవీ భక్తులను బాధించకుండా వాటిని శాసించేవాడే మహాశాస్త

ఈ కపిలేశ్వర క్షేత్రంలోని పరివార దేవతా మండపంలో దక్షిణాభిముఖంగా మహాగణాధిపతికి ఎడమ ప్రక్కన రెండడుగుల ఎత్తుగల శిలామూర్తిగా మహాశాస్త దర్శనమిస్తున్నాడు

ఈ స్వామివారికి ఇతర పరివార దేవతలతో పాటు ఉదయం అభిషేకం, మూడుపూటలా నివేదనలు జరుగుతున్నాయి

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## కాశీ విశ్వేశ్వరస్వామి (శివలింగం)

**గంగాతరంగ కమనీయ జటాకలాపం**
**గౌరీ నిరంతర విభూషిత వామభాగమ్**
**నారాయణ ప్రియమనంగ ముదాపహారం**
**వారాణసీపురపతి భజ విశ్వనాథమ్**

పరివార దేవతా మండపంలోనే గోడవారకు అరుగుపై లింగరూపుడై పశ్చిమాభిముఖంగా విలసిల్లుతున్న అర్చామూర్తి శ్రీ కాశీవిశ్వేశ్వరస్వామి పానవట్టంతో కూడ ఈ శిలాలింగం ఎత్తు సుమారు రెండున్నర అడుగుల ఈ కాశీ విశ్వేశ్వర స్వామివారి లింగానికి ప్రతిరోజు ఉదయం అభిషేకంతో పాటు రోజూ మూడు పూటలా నివేదనలు జరుగుతున్నాయి

శ్రీ కపిలేశ్వర స్వామి క్షేత్రంలో వేంచేసి వున్న ఈ కాశీ విశ్వేశ్వరస్వామి మహాలింగానికి ప్రతి శివరాత్రి పర్వంనాడు భక్తులు విశేషంగా అర్చనలు నిర్వహింపజేసి, ఇష్టార్థాలను పొందుతుంటారు

**తేజోమయం సగుణ నిర్గుణ మద్వితీయం**
**ఆనంద కంద మపరాజిత మప్రమేయమ్**

**వాగాత్మకం సకల విశ్వం మాత్మరూపం**
**వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్!**

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## ఉమామహేశ్వరస్వామి

**నమశ్శివాభ్యాం నవ యౌవనాభ్యాం**
**పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యామ్**
**నగేంద్ర కన్యా వృషకేతనాభ్యాం**
**నమో నమశ్శంకర పార్వతీభ్యామ్**

పరివార దేవతా మండపంలోనే కాశీ విశ్వేశ్వర మహాలింగానికి ప్రక్కనే పశ్చిమాభిముఖంగా శ్రీ ఉమామహేశ్వరస్వామి దర్శనమిస్తున్నాడు పీఠంతో సహా సుమారు నాలుగు అడుగుల ఈ ఏక శిలామూర్తిని ''ఆలింగన చంద్రశేఖరుడు'' అని కూడా వ్యవహరిస్తారు.

శిలావేదికపై ఆసీనుడై వున్న ఈ మూర్తి చతుర్భుజాలు కలిగి వున్నాయి పై కుడిచేతిలో త్రిశూలం, పై ఎడమ చేతిలో జింక (సారంగం)ను ధరించి వున్నాడు. అలాగే క్రింది కుడిచేతి యందలి అభయ ముద్రతో భక్తులను అనుగ్రహిస్తూ, క్రింది ఎడమచేతితో తన ఎడమ తొడపై కూర్చొనియున్న ఉమాదేవిని ఆలింగనం చేసికొంటున్నాడు కుడికాలును క్రింద పరుండి వున్న నందీశ్వరునిపై మోపియున్నాడు. ఇక అమ్మవారు స్వామివారి తొడపై కూర్చుండి కుడిచేతిలో కమలాన్ని ధరించి, ఎడమ చేతిని వయ్యారంగా వేలవేసి కాళ్ల క్రిందికి జారవిడిచి వుంది. ఈ శిల్పం మొత్తంగా ఒకే రాతిలో మలచినదిగా గోచరిస్తున్నది.

ఈ క్షేత్రంలో పార్వతీ సహితుడై, నందివాహనుడై చతుర్భుజాలతో దర్శనమిస్తున్న పరమేశ్వరుని రూపం ఇదొక్కటే! మిగిలిన మూర్తులన్నీ లింగ (స్థాణు) రూపంలో మాత్రమే ఉన్నవి.

ఈ ఉమామహేశ్వరస్వామివారికి ఇతర పరివార దేవతలతోపాటు ప్రతిరోజు ఉదయం అభిషేకం, మూడు పూటలా నివేదనలు జరుపబడుతున్నవి.

మనోజ్ఞమైన మూర్తిగా దర్శనమిస్తూ అశేష భక్తావళికి హితాలను అనుగ్రహిస్తూ ఉన్న వృషభ వాహనుడైన శ్రీ ఉమామహేశ్వరస్వామివారికి అంజలి ఘటించి మనసారా ఇలా కీర్తించుదాం

**శ్లో॥ నమశ్శివాభ్యాం వృషవాహనాభ్యాం**
**విరించి విష్ణ్వింద్ర సుపూజితాభ్యామ్**
**విభూతి పాటీర విలేపనాభ్యాం**
**నమో నమశ్శంకర పార్వతీభ్యామ్.**

**శ్లో॥ నమశ్శివాభ్యా మతి సుందరాభ్యాం**
**అత్యంత మాసక్త హృదంబుజాభ్యామ్**
**అశేష లోకైక హితంకరాభ్యాం**
**నమో నమశ్శంకర పార్వతీభ్యామ్.**

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## రామలింగేశ్వరస్వామి

**రామప్రియాయ రఘునాథ వర ప్రదాయ**
**నామ ప్రియాయ నరకార్ణవ తారకాయ**
**పుణ్యేషు పుణ్య భరితాయ సురార్చితాయ**
**దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ**

పరివార దేవతా మండపంలో శ్రీ ఉమామహేశ్వరస్వామివారికి ఎడమ ప్రక్కన అనగా దక్షిణం వైపున శ్రీ రామలింగేశ్వరస్వామివారు శివలింగం రూపంలో పశ్చిమాభిముఖులై దర్శనమిస్తూ వున్నారు

ఇతర పరివార దేవతామూర్తులకు మాదిరే ఈ రామలింగేశ్వరునకు ప్రతిరోజు ఉదయం అభిషేకం, మూడు పూటలా నివేదనలు జరుపబడు తున్నాయి.

భక్త ప్రియుడై భవరోగాల్ని నివారణ చేస్తున్న ఈ స్వామివారిని స్తుతించి ముందుకు సాగుదాం.

**భక్తప్రియాయ భవరోగ భయాపహాయ**
**ఉగ్రాయ దుఃఖ భవసాగర తారణాయ**
**జ్యోతిర్మయాయ గుణనామ సునృత్యకాయ**
**దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ**

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## ప్రమథ గణపతి

***నమస్తే గజ వక్త్రాయ హేరంబాయ నమో నమః***
***ఓంకారాకృతి రూపాయ సగుణాయ నమో నమః***

పరివార దేవతా మండపంలోనే పశ్చిమాభిముఖంగా కూర్చున్న భంగిమలో చతుర్భుజుడై మూషిక వాహనంతో దర్శనమిస్తున్న శిలామూర్తి శ్రీ ప్రమధ గణపతి

శ్రీ రామలింగేశ్వరస్వామి శివలింగానికి దక్షిణ దిక్కున ఆనుకొని వున్న ఈ ప్రమధ గణపతి శిలామూర్తి సుమారు ఒకటిన్నర అడుగులు వుంటుంది పై రెండు చేతుల్లో పాశ అంకుశాలను క్రింది కుడిచేతిలో విరిగిన దంతాన్ని, ఎడమ చేతిలో మోదకాన్ని ధరించి గుజ్జు రూపంతో నిండుగా దర్శనమిస్తున్నాడు

ఈ గణపతికి కూడ ఇతర పరివార దేవతల మాదిరే ఉదయం అభిషేకం, మూడు పూటలా నివేదనలు జరుగుతున్నాయి ఉపాసించిన వారికి అణిమాది అష్టసిద్ధులను ప్రసాదించే ఈ ప్రమధ గణాధిపతిని ఇలా స్తుతించుదాం

*జై గణేశ పాహిమాం! శ్రీ గణేశ రక్షమాం!!*
*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## శివసూర్యస్వామి

**వైకర్తనో వివస్వాం శ్చ మార్తాండో భాస్కరో రవిః**
**లోక ప్రకాశకః శ్రీమాన్ లోక చక్షుర్గ్రహే శ్వరః**

**లోకసాక్షీ త్రిలోకేశః కర్తాహర్తా తమిస్రహో**
**తపనస్తాపన శ్చైవ శుచిః సప్తాశ్వవాహనః**

**గభస్తి హస్త్ర బ్రహ్మేద సర్వదేవ నమస్కృతః**
**ఏకవింశతి రిత్యేష స్తవ ఇష్ట స్సదా మమ.**

**శరీరారోగ్యద శ్చైవ ధనవృద్ధి యశస్కరః**
**స్తవరాజ, ఇతి ఖ్యాత స్త్రిషు లోకేషు విశ్రుతః**

**య ఏతేన మహాబాహో ద్వేసంధ్యే  స్తమయోదయే**
**స్తోతిమాం ప్రణతో భూత్వా సర్వపాపైః ప్రముచ్యతే**

**మానసం వాచికం వాపి కాయికం యచ్చ దుష్కృతం**
**ఏక జాప్యేన తత్సర్వం ప్రణశ్యతి మమాగ్రతః**

**ఏష జప్య శ్చ హోమ శ్చ సంధ్యోపాసన మేవ చ**
**బలి మంత్రో ఒ ర్ఘ్య మంత్రో ఒ థ ధూపమంత్ర ఒ స్తధైవచ**

సూర్యభగవానుణ్ణి పైన పేర్కొన్న ఇరువది యొక్క నామాలతో ఎవరైతే కీర్తిస్తారో, అర్చిస్తారో వారికి శరీరారోగ్యం, సంపదలు, కీర్తి సిద్ధిస్తాయి అని భవిష్య పురాణం ఘోషిస్తూన్నది

ప్రత్యక్ష దైవమయిన సూర్యభగవానుడు కపిలేశ్వర క్షేత్రంలో ''శ్రీ శివసూర్యస్వామి'' పేరుతో విరాజిల్లుతూ పూజలందుకొంటున్నాడు

**సౌరభావ నివృత్యర్థం**
**శివ సూర్య పూజాం కరిష్యే**

అనే సంకల్ప వాక్యానుసారంగా సూర్యగ్రహం వల్లగాని, సూర్యకిరణాలవల్ల గాని శివక్షేత్రం అయిన కపిలతీర్థంలో దోషాలు కలుగకుండా, ఒకవేళ కలిగినా తొలగడానికి గాను తొలదొల్త శ్రీ శివసూర్యస్వామి వారికి పూజ జరుపబడుతుంది ఈ సూర్య పూజ జరిగిన తర్వాతనే నిత్యమూ శ్రీ కామాక్షీ కపిలేశ్వరల ఆరాధన చేయబడుతుంది

పరివార దేవతా మండపంలో పశ్చిమాభిముఖంగా రెండడుగుల ఎత్తు వేదికపై దక్షిణం వారకు చిట్టచివర నిలిచివున్న శిలామూర్తి శ్రీ శివసూర్యస్వామి

రెండు చేతుల్లోను పద్మాలను ధరించి కిరీటాది అలంకారాలతో స్థానకమూర్తిగా దర్శనమిస్తున్న ఈ శిలా విగ్రహం ఎత్తు సుమారు నాలుగు అడుగులు వుంటుంది.

ఈ శివసూర్యస్వామివారికి ప్రతిరోజు ఉదయం అభిషేకం, ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం నివేదనలు జరుగుతున్నాయి

సూర్యభగవానుడు ఈ క్షేత్రంలో శివసూర్యస్వామిగానే కాకుండా ప్రత్యేకంగా నవగ్రహ మండపంలో ఇతర గ్రహదేవతలతో పాటు ప్రధాన గ్రహ దేవతగా కూడా విరాజిల్లుతూ అర్చనలందుకుంటున్నాడు

భక్త జనుల పాపాలను పరిహరిస్తూ బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపంతో త్రిమూర్త్యాత్మకుడై ప్రత్యక్ష భగవానుడిగా దర్శనమిస్తున్న శ్రీ శివసూర్య స్వామివారిని ఈ క్రింది ''అష్టకం''తో ప్రార్థించుదాం

**ఆదిదేవ! నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర!**
**దివాకర! నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే**

**సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్**
**శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**లోహితం రథమారూఢం సర్వలోక పితామహమ్**
**మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**త్రైగుణ్యం చ మహాశూరం బ్రహ్మ విష్ణు మహేశ్వరమ్**
**మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**బృంహితం తేజసాం పుంజం వాయురాకాశ మేవచ**
**ప్రభుం చ సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**బంధూక పుష్ప సంకాశం హారకుండల భూషితమ్**
**ఏక చక్రధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**విశ్వేశం విశ్వకర్తారం మహాతేజః ప్రదీపనమ్**
**మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**శ్రీ విష్ణుం జగతాంనాథం జ్ఞానవిజ్ఞాన మోక్షదమ్**
**మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

**సూర్యాష్టకం పఠేన్నిత్యం గ్రహపీడా ప్రణాశనమ్**
**అపుత్రో లభతే పుత్రం, దరిద్రో ధనవాన్ భవేత్**

**ఆమిషం, మధుపానం చ యః కరోతి రవేర్దినే**
**సప్త జన్మ భవేద్రోగీ జన్మ జన్మ దరిద్రతా.**

**స్త్రీ తైల మధుమాంసాని యే త్యజంతి రవేర్దినే**
**న వ్యాధి శోక దారిద్ర్యం, సూర్యలోకం చ గచ్ఛతి**

*ఓం శివ సూర్యాయ నమః! ఓం శివ సూర్యాయ నమః!!*

★ ★ ★ ★

## నవగ్రహ మండపం

శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారల ప్రదక్షిణా మార్గంలోని పరివార దేవతా మండపంలో నవగ్రహదేవతలు ప్రతిష్ఠింపబడిన వేదిక నెలకొని వుంది. సుమారు నాలుగు అడుగుల ఎత్తు వున్న అరుగుపై ఆయా స్థానాలలో ఆయా గ్రహమూర్తులు ప్రతిష్ఠింపబడినాయి.

**ఆదిత్యాయ చ సోమాయ**
**మంగళాయ బుధాయచ**
**గురు శుక్ర శనిభ్య శ్చ**
**రాహవే కేతవే నమః**

ఈ వేదికపై ఒక్కొక్క విగ్రహం సుమారు ఒక అడుగు పరిమాణం గలిగిన నవగ్రహాల శిలామూర్తులు నెలకొల్పబడి వున్నాయి.

### ఆరాధనా విశిష్టత

శ్రీ వేంకటేశ్వరస్వామివారికి శనివారమనిన మహాప్రీతి ఆయనను సేవించివారికి శనిగ్రహాది దోషాలు శీఘ్రకాలంలోనే నివారణమవుతాయి. తిరుమలలో ప్రతిరోజు శ్రీ వేంకటేశ్వరస్వామి శనిగ్రహప్రీతిగా నువ్వుల పిండిని నివేదనగా స్వీకరిస్తారు. అందువల్ల శనివారంనాడు శ్రీ వేంకటేశ్వరస్వామివారిని

కొలవడం శ్రీ వేంకటాచలయాత్ర చెయ్యడం విశిష్టంగా పేర్కొనబడింది. ఆ తిరుమలయాత్రలో ముందుగా ఆ క్షేత్రం మూలంలో వున్న ప్రసిద్ధమైన పుణ్యస్థలం కపిలతీర్థాన్ని దర్శించి సేవించడం మరింత విశిష్టంగా చెప్పబడింది.

ఈ పుణ్యక్షేత్రంలో స్వయంభూమూర్తిగా వెలసిన స్వామి శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వరస్వామి. భక్తులు, యాత్రికులు అనేక తీర్థాల సంగమమైన, పుణ్యతమమైన కపిలతీర్థంలో స్నానం చేసి శ్రీ కామాక్షీ కపిలేశ్వరులను దర్శించిన అనంతరం తమ గ్రహశాంతి కోసం ఇచట నవగ్రహాలను ఆరాధించినట్లయితే విశేష ఫలితాలు కలుగుతాయి

ఆ యా గ్రహదోషాలతో పీడింపబడుతూ. సుఖశాంతులకు దూరమైన వారు, ముఖ్యంగా గురుదోషం, అష్టమ గురుడు, కుజదోషం, సర్పదోషం, నాగదోషం, ఏలినాటి శని, అష్టమశని, అర్ధాష్టమశని, రాహు, కేతు దోషాలు..... . ఉన్నవారు శాంతి చేసుకొని ఆ దోషాల నుండి నివృత్తిని పొందడానికి ప్రశస్తమైన క్షేత్రంగా ఈ కపిలతీర్థం ప్రఖ్యాతి గాంచింది.

సర్వతీర్థ సంగమమైన ఇక్కడి కపిలతీర్థ పుష్కరిణిలో స్నానమాడిన తరువాత శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారలను ఇచటి నవగ్రహదేవతలను అభిషేక అర్చనాదులతో, ప్రదక్షిణ నమస్కారాలతో సేవించినట్లయితే సకల గ్రహదోషాలు తొలగడమే గాక, భయంకరమైన కర్మవ్యాధులు కూడా నశిస్తాయనేది విశ్వాసమే గాక భక్తుల అనుభవాల్లో నిరూపితమైన సత్యం కూడ

ఉదయం ఆలయం తెరచింది మొదలు రాత్రి ఆలయం మూసేంత వరకు భక్తులు ఈ నవగ్రహాలకు అర్చనలు నిర్వహించుకోవచ్చు. ప్రదక్షిణ నమస్కారాలు చేసుకోవచ్చు.

ముఖ్యంగా భక్తులు తమ తమ నక్షత్రంతో కూడిన రోజులలోగాని, ఆయా గ్రహదేవతలకు సంబంధించిన ఆయా రోజుల్లో గాని, నిర్ణీత రుసుమును చెల్లించి ఆ రోజు ఉదయం పూట మాత్రమే అభిషేకాదులు చేయించుకోవచ్చు అభిషేకంలో ఉపయోగించే పాలు, పెరుగు, వగైరా అభిషేక ద్రవ్యాలను భక్తులు తెచ్చుకోవలసి వుంటుంది.

ప్రధానంగా ప్రతి శనివారం నాడు, త్రయోదశితో కూడిన శనివారం (శనిత్రయోదశి), అమావాస్యతో కూడిన శనివారం, అమావాస్యతో కూడిన సోమవారం, మాసశివరాత్రి, మహాశివరాత్రి ..... ఇలాంటి విశేష దినాల్లో భక్తులు

ఈ నవగ్రహాలకు అభిషేకం చేయించుకోవచ్చు. ఇలాంటి ప్రత్యేక దినాల్లో వేలాదిమంది భక్తులు ఈ క్షేత్రాన్ని దర్శించి గ్రహ శాంతులను చేయించు కొంటారు

ఈ నవగ్రహాలకు తైలం (నువ్వులనూనె), క్షీరం, పెరుగు, తేనె, కొబ్బరి నీళ్లు, చందనం, పన్నీరులాంటి ద్రవ్యాలతో శుద్ధజలంతో నమక చమక మంత్రాలతో అభిషేకాలు జరుగుతవి. పిదప ఈ నవగ్రహాలకు వస్త్రాలంకరణ, పుష్పాలంకరణ చేసిన తర్వాత వరుస క్రమంలో ఆదిత్యాది నవగ్రహాలను ఆయా అష్టోత్తర శతనామాలతో అర్చిస్తారు పిదప ఘనంగా కొబ్బరి కాయలు, పండ్లు నివేదనలు చేసి కర్పూర మంగళ హారతులిస్తారు భక్తులు ప్రదక్షిణ సాష్టాంగ నమస్కారాలు సమర్పించిన అనంతరం తమ తమ గ్రహదోషాలకు అనుగుణంగా నవధాన్యాలను దక్షిణ తాంబూలాలను దానం చేసుకొని పునీతులైన తర్వాత, మళ్లీ శ్రీ కామాక్షి కపిలేశ్వర స్వామివారల దర్శనం చేసుకొని సంతృప్తులవుతారు

వివాహం కావలసినవారు, సంతానం లేనివారు, సంతాన నష్టం అయ్యేవారు, రోగ పీడితులు, దారిద్ర్య పీడితులు, మనశ్శాంతి లేనివారు, నిరుద్యోగులు, పరీక్షల్లో కృతార్థులు కాలేని విద్యార్థులు, . .ఇలా ఎందరెందరో ఎన్నెన్నో సమస్యలతో సతమతమవుతూ బాధలు పడేవారు ఈ క్షేత్రంలో దీక్షగా స్నాన అభిషేక అర్చనాదులు నిర్వర్తించుకొంటూ వుంటారు ఇలా సమస్త బాధల నుండి నివారణ పొందగలిగే పుణ్యక్షేత్రంగా భాసిల్లుతున్న కమనీయ తీర్థ రాజం శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వర క్షేత్రం.

ఈ క్షేత్రంలో నెలకొని వుండి భక్తుల ప్రార్థనలన్నిటిని ఆలకిస్తూ అనుగ్రహిస్తూ వున్న నవగ్రహదేవతలను ఇలా ప్రార్థిద్దాం.

## నవగ్రహ స్తోత్రం

**సూర్యుడు**

***జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్***
***తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్***

**చంద్రుడు**

***దధిశంఖ తుషారాభం క్షీరార్ణవ సముద్భవమ్***
***నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్***

కుజుడు

ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తి హస్తం చ తం మంగళం ప్రణమామ్యహమ్

బుధుడు

ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్
సౌమ్యం సౌమ్య గుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్

గురుడు (బృహస్పతి)

దేవానాం చ ఋషీణాం చ గురుం కాంచన సన్నిభమ్
బుద్ధిభూతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్

శుక్రుడు

హిమకుంద మృణాలాభం దైత్యానాం పరమం గురుమ్
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్

శనైశ్చరుడు

నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్

రాహువు

అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్

కేతువు

ఫలాశ పుష్ప సంకాశం తారకాగ్రహమస్తకమ్
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్

స్తోత్రఫలం

శ్లో॥ ఇతి వ్యాస ముఖోద్గీతం యః పఠేత్ సుసమాహితః
దివా వా యది వా రాత్రౌ విఘ్నశాంతిర్భవిష్యతి.

శ్లో॥ నరనారీ నృపాణాంచ భవేద్దుస్స్వప్ననాశనమ్
ఐశ్వర్యమతులం తేషామారోగ్యం పుష్టివర్ధనమ్

***శ్లో॥ గ్రహనక్షత్రజాః పీడాః తస్కరాగ్ని సముద్భవాః***
***తాః సర్వాః ప్రశమం యాన్తి వ్యాసో బ్రూతే నసంశయః***
***ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ***
***గురు శుక్ర శనిభ్య శ్చ రాహవే కేతవే నమః***

ఓం నవగ్రహదేవతాయై నమః ఓం నవగ్రహదేవతాయై నమః!!

★ ★ ★ ★

## శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి

***కార్తికేయం మహాభాగం మయూరోపరి సంస్థితమ్***
***తప్తకాంచన వర్ణాభం శక్తి హస్తం వరప్రదమ్***
***ద్విషడ్భుజం శత్రుహంతం నానాలంకార భూషితమ్***
***ప్రసన్న వదనం దేవం సర్వసేనా సమావృతమ్***

***- శ్రీ శంకర భగవత్పాదులు***

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారికే కుమారస్వామి, షణ్ముఖుడు, స్కందుడు, కార్తికేయుడు - అని అనేక పేర్లు వున్నాయి

కపిలేశ్వర క్షేత్రంలో పరివార దేవతా మండపంలో ఏకాంతసేవా మండపానికి ప్రక్కన ప్రత్యేకంగా శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి సన్నిధి వుంది ఈ చిన్న సన్నిధి అంతరాళం, గర్భాలయం అని రెండు భాగాలుగా వుంది సుమారు ఐదడుగుల చతురస్ర అంతరాళం దాటిన తర్వాత సుమారు ఐదడుగుల నలుచదరపు గర్భాలయంలో మూడడుగుల ఎత్తు వున్న వేదిక మీద శ్రీ వల్లీదేవసేనా సమేతంగా షణ్ముఖుండైన సుబ్రహ్మణ్యస్వామివారి శిలామూర్తి సుప్రతిష్ఠితమై అలరారుతూ వుంది.

సుబ్రహ్మణ్యుడు మయూర వాహనంపై ఆసీనుడై షణ్ముఖుడై వివిధ ఆయుధాలు, అభయ వరదముద్రలు ధరించిన ద్వాదశ భుజాలతో విరాజిల్లుతూ వున్నాడు. ఈ స్వామివారికి ఇరుప్రక్కల ఆయన దేవేరులు వల్లీ, దేవసేనలు స్థానక (నిలుచున్న) భంగిమలో ద్విభుజాలతో దర్శనమిస్తూ వున్నారు. శ్రీ స్వామివారికి కుడివైపున వున్న వల్లీదేవి తన ఎడమ చేతిలో కలువ పువ్వును ధరించి, కుడిచేతిని హొయలు మెఱయ వ్రేలాడదీసి (లంబితం) వుంటుంది

శ్యామాం పంకజ ధారిణీం మణిలస
త్తాటంక కర్ణోజ్జ్వలాం
సవ్యే లంబకరాం కిరీట మకుటాం
తుంగస్తనీ కంచుకామ్
పవ్యాం వ్యాధ నృపాన్వయాం శరవణో
ద్భూతస్య సవ్యే స్థితాం
గుంజా మాల్యధరాం ప్రవాళవదనాం
వల్లీశ్వరీం తాం భజే.

శ్రీ వల్లీదేవి శ్యామలమైన (నల్లని) శరీర ఛాయ గలది మణులతో విలసిల్లుచున్న ఉజ్జ్వలమయిన చెవి కమ్మలు ధరించినది రత్నాలతో ఒప్పారుచున్న సువర్ణ కిరీటంతో ప్రకాశించుచున్నట్టిది ఎత్తైన స్తనములను కప్పుచున్న పట్టు రవిక (కంచుకము) కలిగినదై గురువింద దండలను ధరియించి పవడం వలె నెఱ్ఱనైన ముఖమండలంతో తేజరిల్లుచున్నది త్రిభంగి (మూడు వంపులు)గా నిలిచియున్న ఈ దేవి కుడిచేయి లంబితంగా ఉన్నది ఎడమ చేతిలో కలువ పువ్వును ధరించి యున్నది.

ఇటువంటి దివ్యాకృతితో, కిరాత రాజు వంశంలో అవతరించి యున్నదియును షణ్ముఖ స్వామికి కుడి ప్రక్కన వేంచేసివున్న శ్రీ వల్లీదేవిని భక్తితో సేవించుచున్నాను.

అలాగే దేవసేనాదేవి కుడిచేతిలో కలువపువ్వును ధరించి ఎడమ చేయిని లంబితముగా వ్రేలదీసి సుబ్రహ్మణ్యస్వామికి ఎడమ భాగంలో నిలిచి ఉన్నది

పీతా ముత్పల ధారిణీం శచిసుతాం
దివ్యాంబరాలంకృతాం
వామే లంబకరా మహేంద్ర తనయాం
మందార మాల్యోజ్జ్వలామ్
దేవై రర్చిత పాదుకాం శశిముఖీం
సేనాదివామే స్థితాం
దివ్యాం భూషణ భూషితాం ద్వినయనాం
సేనాం త్రిభంగీం భజే

దేవసేనాదేవి బంగారు వంటి పసుపు పచ్చని శరీరకాంతులు కలిగి, దివ్య వస్త్రాలచే అలంకరింపబడినదై కుడి హస్తంలో కలువపూవును ధరించినదై ఎడమ చేయిని లంబితముగా జేసి కల్పవృక్షహారములను వివిధములగు మణిమయ భూషణాలను దాల్చి శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఎడమ ప్రక్కన విలసిల్లుచున్నది శచీదేవికి ఇంద్రునకు ముద్దుల బిడ్డయై దేవతలందరిచేత పూజింపబడుతున్న దేవసేనాదేవిని భజించుచున్నాను.

ఈ రీతిగా ఉభయ దేవేరులతో విరాజిల్లుతూవున్న షణ్ముఖునికి పాలు, పెరుగు మొదలైన పంచామృతాలతో ప్రతిరోజు ఉదయం అభిషేకం జరుపబడుతుంది. ప్రతిదినం ఉదయం, మధ్యాహ్నం,సాయంత్రం - మూడు పూటలా నివేదనలు సమర్పింపబడుతున్నవి

ప్రతి మంగళవారం ఉదయం, ప్రతి నెలా కృత్తికానక్షత్రం రోజున, షష్ఠిరోజున విశేషంగా పంచామృతాలతో అభిషేకాలు జరిగిన తర్వాత వస్త్రాభరణాలతో, పుష్పమాలలతో అలంకరించి అష్టోత్తర శతనామాలతో అర్చనలు ఘనంగా నివేదనలు నిర్వహింపబడుతవి

అంతమాత్రమేగాక ప్రతి ఆదివారం, ప్రతి మంగళవారం, శని త్రయోదశి, మాసశివరాత్రి, శనివారం అమావాస్య, అమావాస్యతో కూడిన సోమవారం నాడు ఇలాటిం రోజుల్లో కుజదోషం, నాగదోషం, సర్పదోషం, నవగ్రహ దోషం ఉన్న భక్తులు నవగ్రహాలను అర్చించిన తరువాత ఈ సుబ్రహ్మణ్యేశ్వరుని అర్చించినట్లయితే పై దోషాలన్నీ తొలగుతాయని ప్రసిద్ధి ఎందరో భక్తులు పెళ్లి కావలసిన వారు, సంతానం కావలసినవారు కపిలేశ్వర క్షేత్రంలోని సుబ్రహ్మణ్యేశ్వరుని దీక్షతో భక్తి శ్రద్ధలతో నియమ నిష్ఠలతో సేవించి ఇష్టార్థసిద్ధిని పొందినవారున్నారు, పొందుతూనే ఉన్నారు.

క్రీ.శ. 15వ శతాబ్దానికి చెందిన వాగ్గేయ కారుడు సుబ్రహ్మణ్యేశ్వరుని పరమభక్తుడైన అరుణగిరినాధర్ అను తమిళ వాగ్గేయకారుడు కపిలతీర్థంలో వెలసిన షణ్ముఖుడైన కుమారస్వామిని తమిళంలో చాలా గొప్పగా కీర్తించినాడు. అరుణాచల నివాసియైన ఈ భక్తుడు దేశసంచారం చేస్తూ ఎన్నో క్షేత్రాల్ని దర్శించి కీర్తించిన మహనీయుడు ఈయన.

ఇంతటి ప్రశస్తి గాంచిన ఈ షణ్ముఖస్వామికి ప్రతి సంవత్సరం మార్గశిర మాసంలో శుద్ధ షష్ఠినాడు (ప్రదోషకాలంలో షష్ఠి ఉన్న రోజున) ''స్కంద షష్ఠి ఉత్సవం'' జరుగుతుంది. ఈ రోజున షణ్ముఖుని మూలమూర్తులతో పాటు, ఉత్సవమూర్తులకును అభిషేకార్చనలు నివేదనలు జరుగుతవి విశేష అలంకరణలు చేయబడతవి. ఆ సాయంత్రం వల్లీ, దేవసేనా సమేతంగా శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారికి నెమలి వాహనంపై తిరుపతి పురవీధుల్లో వైభవంగా ఊరేగింపు జరుగుతుంది.

ప్రతి సంవత్సరం మార్గశిరమాసం పున్నమకు పూర్తి అయ్యేటట్లు కపిలతీర్థ పుష్కరిణిలో జరుపబడే మూడు రోజుల తెప్పోత్సవంలో, రెండవ రోజున శ్రీ వల్లీ దేవసేనా సమేతంగా శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని ఉత్సవమూర్తులకు తెప్పోత్సవం జరుగుతుంది. విద్యుద్దీపాలతో, పూలమాలలతో శోభాయమానంగా అలంకరింపబడిన తెప్పపై వేద పారాయణలతో సంగీత గానాలతో మంగళవాద్య పురస్సరంగా జరిగే ఈ ప్లవోత్సవం నయనానందకరంగా వుంటూ వేలాదిమంది భక్తులకు అలరిస్తుంది

సర్వదోష పరిహారకుడు, సంతాన ప్రదాత జ్ఞానప్రదాత, యోగప్రదాత అయిన శ్రీ షణ్ముఖుని నిత్యమూ దీక్షగా సేవించి, సుప్రసిద్ధమైన అష్టక స్తోత్రంతో ఇలా స్తుతించుదాం!

## శ్రీ సుబ్రహ్మణ్యాష్టకం

*హే స్వామినాథ! కరుణాకర! దీనబంధో*
*శ్రీ పార్వతీశ ముఖపంకజ పద్మబంధో*
*శ్రీ శాది దేవగణపూజిత పాదపద్మ*
*వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్.*

*దేవాదిదేవ నుత దేవగణాధినాథ*
*దేవేంద్ర వంద్య మృదుపంకజ మంజుపాద*
*దేవర్షి నారద మునీంద్ర సుగీత కీర్తే*
*వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్*

నిత్యాన్నదాన నిరతాఖిల రోగహారిన్
తస్మాత్ప్రదాన పరిపూరిత భక్తకామ
శ్రుత్యాగమ ప్రణవ వాచ్య నిజస్వరూప
వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్.

క్రౌంచా సురేంద్ర మదఖండన శక్తి శూల
పాశాది శస్త్ర పరిమండిత దివ్యపాణే
శ్రీకుండలీశ ధృతతుండ శిఖీంద్రవాహ
వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్.

దేవాదిదేవ! రథమండల మధ్యవేద్య
దేవేంద్ర పీడనకరం దృఢచాప హస్తమ్
శూరం నిహత్య సురకోటిభి రీడ్యమాన
వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్.

హీరాది రత్న మణియుక్త కిరీటహార!
కేయూర కుండల లసత్కవచాభిరామ!
హే వీర తారక జయామరబృంద వంద్య
వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్.

పంచాక్షరాది మనుమంత్రిత గాంగతోయైః
పంచామృతైః ప్రముదితేంద్ర ముఖైర్మునీంద్రైః
పట్టాభిషిక్త హరిపుత్ర వరాసనాథ!
వల్లీ సనాథ! మమదేహి కరావలంబమ్.

శ్రీ కార్తికేయ కరుణామృత పూర్ణదృష్ట్యా
కామాది రోగ కలుషీకృత దుష్టచిత్తమ్
సిక్త్వాతు మామవ కళాధర కాంత కాంత్యా
వల్లీ సనాథ! మమదేహికరావలంబమ్

## ఫలశ్రుతి

**సుబ్రహ్మణ్యాష్టకం పుణ్యం యే పఠన్తి ద్విజోత్తమాః**
**తే సర్వేముక్తి మాయాన్తి సుబ్రహ్మణ్య ప్రసాదతః**
**సుబ్రహ్మణ్యాష్టక మిదం ప్రాత రుత్థాయ యః పఠేత్**
**కోటి జన్మకృతం పాపం తత్క్షణా దేవనశ్యతి.**

**ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!**

★ ★ ★ ★

## ఏకాంతసేవా మండపం

శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారి పరివార దేవతా మండపంలో ''ఏకాంతసేవా మండపం'' ప్రత్యేకంగా ఎత్తైన శిలావేదికగా తూర్పుముఖంగా అమరివుంది ఈ మండపానికి ఇనుక కడ్డీలతో కూడిన తలుపులు అమర్చబడి ఉన్నాయి

ప్రతిరాత్రి చిట్టచివరగా శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారలకు ఏకాంతసేవ (పవళింపుసేవ) నిర్వహిస్తారు అందువల్లే ఇది ఏకాంతసేవా మండపం అని పిలువబడుతున్నది

ప్రతి సంవత్సరం దసరా నవరాత్రులలో ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు శుద్ధదశమి వరకు ఈ మండపంలోనే ఆ కామాక్షీ అమ్మవారి ''కలశ స్థాపన'' చేసి లలితా సహస్ర నామాలతో కుంకుమార్చనలు నిర్వహింప బడతవి

అట్లే తులామాసం పున్నమినాడు శ్రీ కపిలేశ్వర మహాశివలింగానికి జరిగే అన్నాభిషేక సమయంలో ఈ ఏకాంత సేవా మండపంలో ''శ్రీ కపిలేశ్వరస్వామివారి కలశ స్థాపన'' చేయబడి వేదపండితుల చేత ఏకాదశవార రుద్ర మంత్ర పారాయణ నిర్వహింపబడుతుంది

ఇదిగాక ఈ ఏకాంతసేవా మండపం ''ఉత్సవ ప్రతిమామండపం''గా కూడ ఉపయోగపడుతున్నది ఈ మండపంలో చల ప్రతిష్ఠతో నెలకొల్పబడిన ఆయా పంచలోహ ప్రతిమలు చోటు చేసికొని ఉన్నాయి ఉత్సవ ప్రతిమలతో నిండియున్న ఈ ఏకాంతసేవామండపం సాక్షాత్తు కైలాసమే దిగివచ్చిందా! అన్నట్లుగా చూపరులకు గోచరిస్తూ ఆనందాన్ని ప్రసాదిస్తూ వుంటుంది

ఇక్కడ శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల ఉత్సవమూర్తులైన శ్రీ సోమస్కందమూర్తి, శ్రీ కామాక్షీ దేవి, శ్రీ శుక్రవారపు దేవి, శ్రీ చంద్రశేఖరస్వామి శ్రీమనోన్మణి అమ్మవారలు, శ్రీ నటరాజస్వామి శివకామసుందరి అమ్మవారలు, శ్రీ విఘ్నాయక స్వామి, శ్రీ వల్లీ దేవసేనా సమేత కుమారస్వామి, శ్రీ త్రిశూల స్వామి, శ్రీ చండికేశ్వరస్వామి, శ్రీ మాణిక్యవాచకర్‌స్వామి మున్నగు పంచలోహమూర్తులు ఈ మండపంలో నెలకొని వున్నాయి

అయా మూర్తుల రూప విశేషాలను గూర్చి ఆ మూర్తులకు జరిగే ఉత్సవ విశేషాలను గూర్చి తెలిసికుందాం

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## శ్రీ సోమస్కందమూర్తి

శ్రీ కపిలేశ్వరస్వామివారికి అత్యంత ప్రధానమైన ఉత్సవమూర్తి శ్రీ సోమాస్కందమూర్తి పరమశివునకు ఉన్న ఇరవై ఐదు రూపాలలో ఇది మిక్కిలి ప్రశస్తమైనదిగా శైవాగమంలో చెప్పబడుతున్నది

స ఉమా స్కందమూర్తి అనగా ఉమాదేవి (పార్వతి)తోను, స్కందుని (కుమారస్వామి) తోను కలిసి వున్న శివమూర్తి అనగా ఒకే పీఠంపై విడదీయకుండా ఏర్పాటు చేయబడిన ముగ్గురు మూర్తుల సమాహారమే శ్రీ సోమాస్కందమూర్తి

ఎల్లప్పుడు స్కందునితోను పార్వతితోను విడివడకుండా ఒకే పీఠంపై వుండే ఈ సోమాస్కందమూర్తికి ఉత్సవాల్లోనూ, ఊరేగింపుల్లోనూ విశేషమైన ప్రాధాన్యం ఉంది ఈ మూర్తి రూప విశేషాలు ఇలా పేర్కొనబడినాయి

శ్లో॥ *ఉద్యద్భాను నిభం చతుష్కరయుతం కేయూర హారభిః*
*దివ్యం వస్త్రధరం జటామకుటినం సంశోభి నేత్రత్రయమ్.*
*వామే గౌరియుతం సుఖాస ముభయోర్మధ్యే కుమారస్థితం*
*సోమాస్కంద విభుం మృగాభయ వరాన్ టంకం దధానం భజే.*

శ్లో॥ *సోమాస్కందేశ్వరం ప్రోక్తం భోగశక్తి సమన్వితమ్*
*చతుర్భుజం త్రినేత్రం చ జటా మకుట మండితమ్*

శ్లో॥ సర్వాభరణ సంయుక్తం వరాభయ హస్తకమ్
కృష్ణంటంకం దధానం చ దక్షిణే వామకేఒపిచ

శ్లో॥ పత్రంతు వామకర్ణేతు దక్షిణే నక్రకుండలమ్
ఉపవీతధరం చైవ శయానం వామపాదకమ్

శ్లో॥ లంబితం దక్షిణం పాదం వామే గౌరీ సమన్వితమ్
తయోర్మధ్యగతం స్కందం సర్వలక్షణ సంయుతమ్.

శ్లో॥ సోమాస్కంద మితి ప్రోక్తం గంగాచంద్ర సమన్వితమ్
సోమాస్కందస్య పార్శ్వేతు భోగశక్తి శ్చ వామకే

శ్లో॥ వీరాతు దక్షిణే పార్శ్వే చాసీనా వాస్థితాచ వా
పంచవింశతి మూర్తీనాం సోమాస్కందో మహాన్ మతః

శ్లో॥ ఉత్సవారంభ కాలే తు సోమాస్కందో విశేషతః
ధరాం తు కుముదం దేవం వామే వరద సంయుతం
శయానం దక్షిణ పాదం వామపాదం తు లంబితమ్.

ఒకే పీఠంపై వేంచేసి ''సోమాస్కందమూర్తి'' అని పిలువబడుతున్న పరమశివుడు ఉదయిస్తున్న సూర్యుని వలె ఎర్రని శరీరచ్ఛాయతో, మూడు కన్నులతో, గంగాదేవిచే చంద్రరేఖచే అలంకరింపబడిన 'జటా జూటంతో, జన్నిదంతో ఎడమ భాగంలో భోగశక్తి అని పిలువబడే గౌరీ దేవితో నాలుగు చేతులతో, ఆభరణాలు అలంకరింపబడిన సర్వాంగాలతోను, కుడిచెవియందు మకర కుండలంతోను, ఎడమ చెవి యందు తాటంకం (స్త్రీలు ధరించుకమ్మ)తో, మధ్య భాగంలో బాలుడైన కుమారస్వామితో సుఖాసీనుడై దివ్యమగు వస్త్రాలను ధరించి దర్శనమిస్తుంటాడు.

ఈ స్వామి పై కుడిచేతిలో టంకమును, పై ఎడమ చేతిలో లేడిని (జింకను) క్రింది కుడిచేయి అభయముద్రలోను, క్రింది ఎడమ చేయి కటకముద్ర (సింహకర్ణముద్ర)లో కలిగివున్నాడు. (సాధారణంగా క్రింది ఎడమ చేయి వరదముద్రలో వుండవలెను. కాని ఇక్కడ కటకముద్ర విశేషంగా కనబడుతున్నది ) కుడికాలు క్రిందికి వేలాడుతూ ఎడమకాలును మడచి కూర్చొన్నట్లుగా వున్న ఈ పంచలోహ ప్రతిమ ఎత్తు సుమారు రెండున్నర అడుగులు ఉంటుంది

ఇదే పీఠంపైన స్వామివారికి ఎడమవైపున ద్విభుజ అయిన ఉమాదేవి (పార్వతీదేవి) కుడిచేతిలో కలువపూవును ఎడమచేతిని వరదభంగిమ గలదై, అత్యంత సౌమ్యరూపంతో కరుణా దృక్కులతో విరాజిల్లుతూ దర్శనమిస్తున్నది కుడికాలు మడిచి ఎడమకాలును క్రిందికి వ్రేలుతూ కూర్చొని వున్న ఈ పంచలోహ ప్రతిమ సుమారు రెండడుగులుంటుంది

వీరిద్దరి మధ్య బాల రూపంతో మూడు కన్నులతో రెండు చేతులతో పద్మాలను ధరించి సర్వాభరణాలతో స్థానక (నిలిచివున్న) భంగిమలో వున్న సుమారు అర అడుగు ఎత్తుకుపైగా వున్న పంచలోహమూర్తి స్కందుడు

**శ్లో॥ బాలరూప స్థితం స్కందం త్రినేత్రం ద్విభుజాన్వితమ్**
**తరకాబ్జ ధరం హస్తే సర్వాభరణ భూషితమ్**

అని ప్రార్థింపబడినాడు! స్వామి రక్త వర్ణుడు కాగా దేవి శ్యామవర్ణయుట! ఈ ఇరువురి నడుమ నున్న స్కందుడు నీలవర్ణుడట!

పరమశివ భక్తుడైన రాజేంద్ర చోళ చక్రవర్తికి పరమేశ్వరుడు ఉమాదేవి (పార్వతీదేవి) తోను, స్కందునితోను కలిసి స్వప్నంలో సాక్షాత్కరించాడట! అందువల్ల ఆ రాజు తన ఏలుబడిలో వున్న ప్రాంతంలోగల అన్ని శివాలయాల్లోను కలలో తనకు దర్శనమిచ్చిన "శ్రీ సోమా స్కందమూర్తి" (ఉమతో స్కందునితో కూడివున్న శివుడు) యొక్క ఉత్సవమూర్తులను ఒకే పీఠంపై నెలకొల్పజేసినాడట! ఈ సోమాస్కందమూర్తి ఆ కాలంలో అటు తమిళనాడు నుండి ఇటు శ్రీ కాళహస్తి - తిరుపతి వరకు ఆ రాజు పాలనలో వుండినందువల్ల కాబోలు తిరుపతిలోని కపిలతీర్థ క్షేత్రంలోను ఈ 'సోమాస్కందమూర్తి' మనకు దర్శనమిస్తున్నాడు.

ప్రతిరోజు ఈ మూర్తికి మూడు పూటలా నివేదనలు నిర్వహింప బడుతున్నాయి.

ప్రతిరాత్రి చివరగా ఈ సోమాస్కందమూర్తికి, మరొక పీఠంపై ప్రత్యేకంగా వేంచేసి వున్న శ్రీ కామాక్షి అమ్మవారికి ఈ ఏకాంత మండపంలోనే ఏకాంతసేవ జరుపబడుతుంది.

ప్రతి సంవత్సరం మాఘ మాసంలో మహాశివరాత్రి పర్వదిన సమయంలో జరిగే బ్రహ్మోత్సవాల్లో ఒక నందివాహనోత్సవం తప్ప, మిగిలిన వాహన సేవలన్నీ ఈ సోమాస్కందమూర్తికి జరుపబడుతున్నవి. మహాశివరాత్రి మరునాటి సాయంత్రం శ్రీ సోమాస్కందునికి శ్రీ కామాక్షీ దేవికి కల్యాణోత్సవం జరుపబడుతుంది.

ప్రతి సంవత్సరం మార్గశిర మాసం (ధనుర్మాసం)లో కపిలతీర్థ పుష్కరిణిలో మూడు రోజులపాటు జరిగే తెప్పోత్సవంలో చివరిరోజున శ్రీ సోమాస్కందమూర్తి, శ్రీ కామాక్షి దేవితోపాటు పాల్గొంటారు

శ్రీ సోమాస్కందమూర్తితో పాటు తప్పనిసరిగా మరొకపీఠంపై వేంచేసి వుంటూ అన్ని సేవల్లో పాల్గొనే శ్రీ కామాక్షీ దేవిని గూర్చి తెలుసుకుందాం

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## శ్రీ కామాక్షీదేవి

శ్రీ సోమాస్కందమూర్తికి దేవేరియై ప్రత్యేకంగా మరొకపీఠంపై వేంచేసి వుంటూ అన్ని ఉత్సవాల్లోను ఊరేగింపుల్లోను, కల్యాణోత్సవాల్లోను పాల్గొంటూ వున్న పంచలోహ ప్రతిమామూర్తి 'శ్రీ కామాక్షీ దేవి'. స్థానక (నిలిచివున్న) భంగిమలో వుంటూ కుడిచేతిలో కమలాన్ని ధరించి, ఎడమచేతిని ఒయ్యారంగా సొంపుగా క్రిందికి జారవిడిచి (లంబితం), కిరీటాది అభరణాలతో విరాజిల్లుతూవున్న ఈ ఉత్సవమూర్తి ఎత్తు సుమారు రెండడుగులు

ప్రతి మాసశివరాత్రినాడు మరియు బ్రహ్మోత్సవంలో మహాశివరాత్రి మరునాడు శ్రీ సోమాస్కందునికి, ఈ కామాక్షీ దేవికి మాత్రమే కల్యాణోత్సవం జరుగుతుంది సోమాస్కందునికి జరిగే కల్యాణోత్సవంలో స్వామికి ఎడమ ప్రక్కన మరొక పీఠంపై ఉన్న ఈ కామాక్షీదేవికి మాత్రమే మాంగల్యధారణ, తలంబ్రాల వేడుకలు జరుగుతవి

శరన్నవరాత్రులనే దసరా నవరాత్రులలో పదిరోజులు, ప్రతి సాయంత్రం రోజుకొక విధంగా వైభవంగా అలంకరింపబడిన శ్రీ కామాక్షి అమ్మవారికి డోలోత్సవ మండపంలో ఊయలసేవ (ఊంజల్‌సేవ) జరుగుతుంది

బ్రహ్మోత్సవ సమయంలో శ్రీ సోమాస్కందునికి జరిగే అన్ని ఉత్సవాల్లోను, ఆయన దేవేరిగా వేరొక పల్లకిపై వేంచేసి ఉన్న ఈ కామాక్షి అమ్మవారు అన్నీ ఉత్సవాల్లోను దర్శనమిస్తుంది

ఈ దేవికి ప్రతిరోజు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం ముప్పూటలా నివేదనలు జరుపబడుతువి

ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!

★★★★

## శుక్రవారం అమ్మవారు

***సర్వమంగళ మాంగల్యే***
***శివే సర్వార్థ సాధికే***
***శరణ్యే త్ర్యంబకే దేవి***
***నారాయణి నమోస్తుతే***

కపిలతీర్థంలో వెలసిన ప్రధాన దైవం పరమశివుడు ఇచట ఈ స్వామివారు 'కపిలేశ్వరస్వామి' అని పిలువబడుతున్నాడు ఈ కపిలేశ్వరుని దేవేరి కామాక్షీ దేవి అనే పేరుతో పిలువబడుతూ పూజలందుకొంటున్నది మూలమూర్తి అయిన ఈ అమ్మవారికి ప్రతిరూపంగా నకలు ప్రతిమగా చెప్పబడుతున్న పంచలోహ ఉత్సవమూర్తియే 'శ్రీ శుక్రవారపు దేవి' (శుక్రవారం అమ్మవారు)

మూలవరులైన శ్రీ కామాక్షీఅమ్మవారి మాదిరే ఈ శుక్రవారపు దేవి స్థానకమూర్తిగా (నిలిచి) చతుర్భుజాలతో విలసిల్లుతున్నది పై కుడిచేతిలో అంకుశాన్ని పై ఎడమ చేతిలో పాశాన్ని ధరించి, క్రింది కుడిచేయి అభయ ముద్రతోను, క్రింది ఎడమచేయి వరదముద్రతోను దర్శనమిస్తున్నది ప్రతి శుక్రవారం నాడు అభిషేకం జరిగే ఈ శుక్రవారపు అమ్మవారికి శరన్నవరాత్రులలో పాలు, పెరుగు, తేనె, నెయ్యి, కొబ్బరినీళ్ళు, చందనం, పసుపు మున్నగు ద్రవ్యాలతో ఘనంగా అభిషేకం, విశేషంగా అర్చనలు, నివేదనలు జరుపబడుతవి

శ్రీ కామాక్షీ అమ్మవారి మూలమూర్తికి ప్రధానమైన నకలు పంచలోహ ప్రతిమ అయిన ''శుక్రవారపు అమ్మవారిని'' ఏ సందర్భంలోనూ ఆలయాన్ని విడిచి వెలుపలికి తీసుకొని వెళ్లరు

ఏకాంతసేవా మండపమనబడే ప్రతిమా మండపంలో ప్రస్తుతం నవరాత్రులనబడే దేవీ నవరాత్రులలో 10 రోజులు మాత్రం శుక్రవారపు దేవిని స్థాపించి, అమ్మవారికి ముందుభాగంలో దేవీ కలశాన్ని ప్రతిష్ఠించి ప్రతిరోజు లలితా సహస్రనామాలతో కుంకుమార్చనలు, సాయంత్రం పంచవాద్య సమ్మేళనంతో ప్రదోషకాల దీపారాధన అనబడే మహా మంగళహారతి ఇవ్వబడుతుంది

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## చంద్రశేఖరస్వామి - మనోన్మణి

శ్రీ చంద్రశేఖరస్వామి, శ్రీ మనోన్మణి అమ్మవారు శ్రీ కామాక్షి కపిలేశ్వరుల మూలమూర్తులకు ప్రాతినిధ్యం వహించే మరియొక ఉత్సవమూర్తుల జంట స్థానక (నిలిచివున్న) భంగిమలో పంచలోహంతో నిర్మింపబడిన ఈ ఉత్సవమూర్తుల జంట ఆయా ఉత్సవాల్లో, ఊరేగింపుల్లో ఉపయోగింపబడుతున్నారు వీరిలో శ్రీ చంద్రశేఖరస్వామి స్వరూపం ఇలా వర్ణింపబడింది

**శ్లో॥ అభయ వరద హస్తం సౌమ్య శృంగార భావం**
**విపుల వదన నేత్రం చంద్ర బింబాంశ మౌళిమ్**
**ఋజు తను సమపాద స్థానకం విద్రుమాభం**
**హరిణ పరశు పాణిం పద్మపీఠస్థ మీడే.**

శ్రీ చంద్రశేఖరస్వామి పవడవము వలె ఎర్రని శరీరచ్ఛాయ గలిగి మధురమయిన అనురాగ భావాన్ని వ్యక్తం చేస్తూ వున్న రూపంతో, విశాలమైన వదనంతో, త్రినేత్రాలతో నెలవంక శిరోభూషణంతో సమానమైన మిక్కిలి చక్కని పాదాలతో పద్మపీఠంమీద నిలుచొని చతుర్భుజుడై దర్శనమిస్తున్నాడు

పై కుడిచేతిలో గండ్రగొడ్డలిని, పై ఎడమ చేతిలో లేడిని (జింకను) ధరించి క్రింది కుడిచేయి అభయముద్రను, క్రింది ఎడమ చేయి వరదముద్రలోను విలసిల్లుతున్న ఈ మూర్తి ఎత్తు సుమారు రెండు అడుగులు ఉంటుంది.

శ్రీ చంద్రశేఖరస్వామివారితో పాటు ఎడమ ప్రక్కనే ఆయన దేవేరిగా వెలసివున్న పంచలోహ ప్రతిమామూర్తిని శ్రీ మనోన్మణి అంటారు. ఈ మూర్తి కామాక్షీ దేవి మూలమూర్తికి మరొక ఉత్సవ విగ్రహము. ఆ దేవి స్వరూపం ఇలా చిత్రింపబడి ఉంది

**శ్యామాం త్రినేత్రాం ద్విభుజాం త్రిభంగీం**
**సవ్యాప సవ్య స్థిత కుంచితాంఘ్రిమ్**
**సవ్యేతు నీలోత్పల పాణి మీడే**
**దేవస్య వామస్థిత పద్మపీఠామ్.**

శ్యామలమైన (పచ్చని) శరీరచ్ఛాయ గలిగినది మూడుకన్నులు గలది, ఎడమ కుడి పాదాలను కొలదిగా వంచియున్నది, తనువును సొంపైన రీతిని త్రిభంగిగా వంచి శ్రీ చంద్రశేఖరస్వామికి వామపార్శ్వంలో పద్మపీఠంమీద నిలిచియున్నది కుడిచేతిలో నల్లకలువను ధరించి ఎడమ చేతిని హాయలుగా జారవిడిచి యున్నది - అయిన మనోన్మణి అమ్మవారికి ప్రార్థిస్తున్నాను

శ్రీ చంద్రశేఖరస్వామివారికి శ్రీ మనోన్మణి అమ్మవారలకు విడివిడిగా ఉత్సవాలు జరుగవు వీరిద్దరికి సంయుక్తంగానే ఉత్సవం నిర్వహింపబడుతూ వుంటుంది.

ప్రతిరోజు మూడువేళల ఈ మూర్తులకు నివేదనలు జరుపబడుతవి ప్రతి సోమవారం సాయంత్రం కల్యాణ మండపంలో శ్రీ చంద్రశేఖర మనోన్మణి దేవులకు ఊయలసేవ జరుపబడుతుంది

ప్రతి సంవత్సరం మార్గశిరమాసం (ధనుర్మాసం)లో కపిలతీర్థ పుష్కరిణిలో మూడు రోజులు జరిగే తెప్పోత్సవాల్లో మొదటిరోజున శ్రీ సిద్ధి వినాయకస్వామివారితో పాటు, శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలకు తెప్పోత్సవం జరుగుతుంది.

ప్రతి సంవత్సరం మహాశివరాత్రి రోజున శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణిదేవికి తిరుపతి పురవీధుల్లో రజత వృషభ (వెండినంది) వాహనోత్సవం నిర్వహింపబడుతుంటుంది.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## నటరాజస్వామి - శివకామసుందరి

ప్రతిమహా మండపంలో కొలువైవున్న మరో జత పంచలోహ ఉత్సవమూర్తులు శ్రీ నటరాజస్వామి - శ్రీ శివకామసుందరి అమ్మవారు

**శ్లో॥ *శయ్యాపస్మారకే క్ష్వేళ స్థిత ముత విలస***
***ద్వామ ముద్ధృత్య పాదం***
***జ్వాలా మాలా సుమధ్యే ధృత ఫణి శిరసి***
***స్థూల మాపేదివాన్ యః***

***భస్మనాలిప్త మీత తనుం రవి విధం***
***హస్త పాదైశ్చ తుష్టాం***
***దోలాం దా భీతి ముద్రా మపి చ డమరుకం***
***బిభ్రాతం తం నటేశమ్***

పాము శిరస్సును చేతితో పట్టుకొని అపస్మారుడనే రాక్షసుడు పడుకొని యుండగా, అగ్నిజ్వాలల నడుమ శ్రీ నటరాజస్వామి ఆ అపస్మారునిపై తన కుడికాలును వుంచి నిలిచి ఎడమకాలును పైకెత్తి నాట్యభంగిమలో వయ్యారంగా దర్శనమిస్తున్నాడు ఈ నటరాజస్వామి క్రింది కుడిచేతిని అభయ ముద్రతోను, పై కుడిచేతిలో డమరుకాన్ని, క్రింది ఎడమచేతిని దోలా హస్తంగాను, ఎడమ పై చేతిలో అగ్నిని ధరించి చతుర్భుజుడై విరాజిల్లుతున్నాడు అలా దర్శనీయుడైయున్న నటరాజస్వామివారిని ప్రార్థించుచున్నాను కుడిచెవిలో మకరకుండలాన్ని, ఎడమచెవిలో తాటంకాన్ని (కమ్మ) ధరించి నొసటన మూడవకన్నుతో నాట్య భంగిమలో వున్న స్వామి అర్ధనారీశ్వర తత్త్వాన్ని ప్రబోధిస్తూ దర్శనమిస్తూ దర్శనమిస్తున్నాడు సుమారు మూడు అడుగుల ఎత్తుతో వున్న శ్రీ నటరాజ స్వామివారి పంచలోహ ఉత్సవమూర్తికి ఎడమ ప్రక్కనే ఆయన దేవేరి అయిన శివకామ సుందరి అమ్మవారి రెండున్నర అడుగుల పంచలోహప్రతిమ చోటు చేసుకున్నది అగ్ని జ్వాలల మధ్య స్థానకమూర్తి అయిన శివకామసుందరి, నటరాజ స్వామియొక్క అభిన్నశక్తిగా చెప్పబడుతున్నది ఈ అమ్మవారు ద్విభుజియై కుడిచేతివి చిన్ముద్రలోను, ఎడమచేతిని క్రిందికి సొంపుగా జారవిడచి సౌందర్యపు హొయలు విలసిల్లగా విలిచివుంది

ప్రతిరోజు శ్రీ నటరాజస్వామి శివకామసుందరి మూర్తులకు మూడు పూటలా నివేదనలు జరుపబడుతున్నవి

ప్రతి సంవత్సరం మార్గశిర మాసంలో తెప్పోత్సవాలు పూర్తి అయిన మరునాడు ఆర్ద్ర నక్షత్రం నాడు ఉషః కాలంలో శ్రీ నటరాజస్వామివారికి శివకామ సుందరి అమ్మవారికి, తిరుపతి పురవీధుల్లో గ్రామోత్సవం జరుగుతుంది వీరితోపాటు మరొక పల్లకిపై పరమశివభక్తుడు, అరవై ముగ్గురు నాయన్మార్లలో సుప్రసిద్ధుడు అయిన మాణిక్యవాచకర్‌స్వామివారికి కూడా ఉత్సవం జరుగు తుంది. ఈ ఉత్సవాన్నే "ఆర్ద్రా దర్శనోత్సవం" అని అంటారు.

***ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!***

★★★★

## సిద్ధివినాయకస్వామి

ఆలయంలోని ఏకాంతసేవా మండపంలో శ్రీ సిద్ధి వినాయకస్వామివారి పంచలోహమూర్తి నెలకొని ఉంది. సుమారు ఒకటిన్నర అడుగుల ఎత్తు ఈ వినాయక స్వామి చతుర్భుజుడై స్థానక భంగిమలో నెలకొని ఉన్నాడు పై కుడిచేతిలో అంకుశాన్ని పై ఎడమ చేతిలో పాశాన్ని, క్రింది కుడిచేతిలో విరిగిన దంతాన్ని, క్రింది ఎడమ చేతిలో మోదకాన్ని (కుడుము) పట్టుకొని దాన్ని తొండంతో స్వీకరిస్తున్నాడు పెద్ద బొజ్జతో చేట చెవులతో కరుణారస పూరిత దృక్కులతో విరాజిల్లుతున్న ఈ సిద్ధి గణపతికి సంవత్సరంలో రెండుమార్లు గ్రామోత్సవం జరుగుతుంది. వినాయకచవితి (భాద్రపద శుద్ధ చవితి) నాడు మరియు మహాశివరాత్రినాడు శ్రీ కపిలేశ్వరస్వామివారికి జరిగే బ్రహ్మోత్సవాల్లో తొలినాటి సాయంత్రం అంకురార్పణ సమయంలో శ్రీ సిద్ధి వినాయకస్వామి మూషిక వాహనుడై తిరుపతి పురవీధుల్లో ఉత్సవంగా ఊరేగుతూ దర్శనమిస్తాడు

ప్రతి సంవత్సరం మార్గశిర మాసంలో కపిలతీర్థ పుష్కరిణిలో మూడు రోజుల పాటు జరిగే తెప్పోత్సవంలో మొదటి రోజున శ్రీ సిద్ధి వినాయకస్వామివారు (పంచలోహమూర్తి) శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలతో కూడ తెప్పోత్సవంలో పాల్గొంటారు

ఇతర మూర్తుల మాదిరే ఈ సిద్ధి వినాయకస్వామి వారి పంచలోహమూర్తికి ప్రతిరోజు మూడుమారులు నివేదనలు జరుపబడుతున్నవి

★★★★

## శ్రీ వల్లీదేవసేనా సమేత కుమారస్వామి

ఏకాంత సేవా మండపంలోనే వేంచేసి వున్న మరియొక ఉత్సవమూర్తి శ్రీ వల్లి దేవసేనా సమేత శ్రీ కుమారస్వామి మూలమూర్తి మాదిరిగా షణ్ముఖాలతో కాకుండా కేవలం ఏకముఖంతోవున్న ఈ ఉత్సవమూర్తి ఎత్తు సుమారు రెండడుగులు ఉంటుంది. క్రింది కుడి, ఎడమ చేతులు వరుసగా అభయ వరదముద్రల్లోను, పై కుడి, ఎడమ చేతుల్లో వరుసగా శక్తి, శూలాయుధాలను ధరించి వున్న ఈ స్వామివారికి కుడిప్రక్కన ఎడమ చేతిలో కలువను ధరించిన వల్లీదేవి, అలాగే ఎడమ ప్రక్కన, కుడిచేతిలో కలువ పుష్పాన్ని ధరించి ఉన్న దేవసేనాదేవి ఒయ్యారంగా నిలిచి వున్నారు.

షణ్ముఖుడైన సుబ్రహ్మణ్యస్వామివారి మూలమూర్తులతోపాటు, ఈ ఉత్సవమూర్తులకు ప్రతినెలా కృత్తికానక్షత్రంరోజున, షష్ఠిరోజున విశేషంగా పాలు, పెరుగు, తేనె మున్నగు పంచామృత ద్రవ్యాలతో అభిషేకాలు, అర్చనలు, నివేదనలు ఘనంగా జరుగుతవి.

ప్రతి సంవత్సరం మార్గశిర శుద్ధషష్ఠిని "స్కందషష్ఠి" అంటారు అనగా సౌరమానం ప్రకారం వృశ్చికమాసం శుద్ధ షష్ఠి రోజున - అనగా ప్రదోష (సాయం సంధ్య) కాలంలో షష్ఠి ఉన్న రోజున - శ్రీ షణ్ముఖస్వామివారల మూలమూర్తులతో పాటు, ఈ ఉత్సవమూర్తులకు ఘనంగా అభిషేకార్చనలు నివేదనలు జరుగుతవి ఆ సాయంత్రం మయూర వాహనంపై దేవేరులతో కూడి వున్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరునికి తిరుపతి పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుంది

ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో కపిలతీర్థ పుష్కరిణిలో జరిగే మూడు రోజుల తెప్పోత్సవంలో దేవేరుల సమేతంగా శ్రీ కుమారస్వామి వారి ఉత్సవమూర్తులకు రెండవనాడు తెప్పోత్సవం జరుగుతుంది

ప్రతి రోజు మూడు పూటలా ఈ మూర్తులకు నివేదనలు జరుపబడుతవి

★ ★ ★ ★

## శ్రీ త్రిశూలస్వామి

ఏకాంతసేవా మండపంలో శ్రీ కపిలేశ్వరస్వామివారి ప్రధాన ఆయుధమైన త్రిశూలం పంచలోహ విగ్రహమూర్తిగా చోటుచేసికొని వుంది పీఠంతో కూడ సుమారు రెండడుగుల ఎత్తు గల ఈ త్రిశూలాకృతిమూర్తికి తదితర పరివార దేవతలతోపాటు మూడువేళల నివేదనలు జరుగుతున్నాయి

ప్రతి సంవత్సరం మహాశివరాత్రి పర్వదిన సందర్భంలో జరిగే బ్రహ్మోత్సవాల్లో చివరి రోజున కపిలతీర్థ పుష్కరిణిలో ఈ "త్రిశూలస్వామి"కి స్నానం చేయిస్తారు. ముందుగా కపిలతీర్థ పుష్కరిణి ముందున్న మండపంలో శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలతోపాటు ఈ త్రిశూలస్వామిని వేంచేపు చేస్తారు. పిదప త్రిశూలస్వామికి మాత్రం పంచామృతాభిషేకం ఘనంగా జరిగిన తరువాత త్రిశూలస్వామివారికి మాత్రమే పుష్కరిణిలో ముంచి స్నానం చేయిస్తారు. ఈ త్రిశూల స్నానం జరిగే సమయంలో అనేకమంది భక్తులు కపిలతీర్థంలో మునిగి పునీతులవుతారు.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## శ్రీ చండికేశ్వరస్వామి

ఏకాంతసేవా మండపంలో సుమారు ఒకటిన్నర అడుగుల ఎత్తు వున్న శ్రీ చండికేశుని పంచలోహఉత్సవ ప్రతిమ నెలకొని వుంది ద్విభుజములతో ఈ స్వామి కుడిచేతిలో అంకుశాన్ని ధరించి కుడికాలును క్రిందికి జార్చి, మడచిన ఎడమ కాలుపై ఎడమచేతి నుంచి ధ్యాన నిమగ్నుడై వున్నాడు ఈ స్వామివారికి ముప్పూటలా నివేదనలు జరుగుతున్నాయి

★ ★ ★ ★

## శ్రీ మాణిక్యవాచకర్

శైవభక్తి వాఙ్మయ చరిత్రలో అత్యంత ప్రసిద్ధులైన అరువది ముగ్గురు శివభక్తులను నాయన్మారులు అంటారు ప్రతి శైవక్షేత్రంలో సాధారణంగా ఈ 63 మంది శివభక్తుల అర్చామూర్తులు చోటుచేసికుని వుంటాయి

కాని ఏ కారణం చేతనో కపిలతీర్థ క్షేత్రంలో ఈ శివభక్తులలో అత్యంత విశిష్టస్థానాన్ని పొందిన ''శ్రీ మాణిక్య వాచకర్'' అనే పరమభక్తుని యొక్క పంచలోహవిగ్రహం మాత్రమే చోటు చేసికొని ఉన్నది

ఏకాంత సేవా మండపంలో నెలకొని వున్న ఈ భక్తుని పంచలోహప్రతిమ సుమారు ఒక అడుగు ఎత్తు వుంటుంది

ప్రతి సంవత్సరం మార్గశిర మాసం (ధనుర్మాసం) పౌర్ణమి ఆర్ద్రా నక్షత్రం రోజు ఉషోదయ సమయంలో శ్రీ నటరాజస్వామి, శ్రీ శివకామ సుందరి అమ్మవార్లతోపాటు మరొకపల్లకిపై వేంచేసి వున్న శ్రీ మాణిక్యవాచకర్ స్వామికి తిరుపతి గ్రామోత్సవం జరుపబడుతుంది. కేవలం ఈ భక్తుని ఉద్దేశించి చేసే ఈ ఉత్సవాన్ని ''ఆర్ద్రా దర్శనోత్సవం'' అంటారు.

ప్రతిరోజు ఇతర ఉత్సవ ప్రతిమలతో పాటు ఈ మాణిక్యవాచకర్ స్వామివారికి మూడుపూటలా నివేదనలు జరుగుతున్నాయి.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## నాగులకట్ట

శ్రీ కామాక్షి కపిలేశ్వరస్వామివారలకు ప్రదక్షిణా పథంగా ఉపయోగపడే పరివార దేవతా మండపానికి దక్షిణం వైపున విశాలమైన బహిరంగ ప్రాంగణం చుట్టూ ఆవరణతో కూడినదై వుంది.

ఈ ఆవరణలో అనేక నాగదేవతల ప్రతిమలు శివలింగాలు, సుబ్రహ్మణ్యేశ్వర ప్రతిమలు.... మున్నగు మూర్తులు ప్రతిష్ఠింపబడి వున్న ఒక పొడవైన వేదికలాంటి అరుగు భక్తులను మొట్టమొదట ఆకర్షిస్తుంది ఈ వేదికపై రెండు పెద్ద వేప చెట్ల చుట్టూ ఎందరో భక్తులు ఎప్పటినుండో ప్రతిష్ఠ చేసిన నాగ ప్రతిమలు.. శివలింగ ప్రతిమలు మనకు నేత్రపర్వం కావిస్తాయి

సంతానం లేనివారు, సంతానం నిలువని వారు, నాగదోషం, సర్పదోషం, కుజదోషం, రాహు,కేతు దోషం ఉన్నవారు ఇలా ఎంతోమంది ఎన్నో దోషాలతో బాధపడేవాళ్లు ఈ క్షేత్రంలో ఈ వేదికపై నాగప్రతిష్ఠ, కాళింగమర్ధన చేస్తున్న చిన్ని కృష్ణుని విగ్రహాలు, శివలింగాలు ప్రతిష్ఠ చేసినట్లయితే పై విధంగా పేర్కొన్న అనేక దోషాలు తొలగడమే గాక, సర్వశుభాలు కలగడంతోపాటు సత్సంతానం కలుగుతుందని ప్రశస్తి వుంది ఎందరో భక్తుల అనేకానుభవాలు సత్యమని చాటుతున్నాయి

ఈనాడు ఈ అరుగుపై కొత్తగా ప్రతిష్ఠలు చెయ్యడానికి వీలు లేకపోయినప్పటికీ, ప్రస్తుతమున్న ఈ శిలాప్రతిమలకు భక్తులు స్వయంగా అభిషేకార్చనలు, దీపారాధనలు, ప్రదక్షిణలు దీక్షలు చేస్తూ సర్వదోషాల నుంచి విముక్తులై ప్రశాంతతను పొందుతూనే వున్నారు పరమశివుని అనుగ్రహవిశేషంతో తమతమ కోరికలను ఈడేర్చుకుంటూనే వున్నారు.

ఇదీ ఇక్కడ నెలకొన్న నాగుల కట్టకు గల ప్రాచీన ప్రశస్తి

నిత్యమూ ఉషోదయంలో, ప్రదోషవేళలో ఈ నాగులకట్ట. భక్తుల అభిషేకార్చనలతో, దీపారాధనలతో సందడిగా వుండడమేగాక, ముఖ్యంగా కార్తీకమాసం మొదలు మాఘమాసం వరకు నాలుగు నెలల పాటు విశేషంగా వేలాది మంది స్త్రీలు ఈ నాగదేవతలను ఆరాధించి, అర్చించి కృతార్థులవుతూ వుండడం గమనించదగిన విషయం. అంతేగాక ప్రత్యేకంగా వేలాదిమంది స్త్రీలు శ్రావణమాసం శుద్ధ చవితి, నాగచతుర్థినాడు అలాగే కార్తీక శుద్ధచవితి "నాగుల చవితి"నాడు, ఈ నాగుల కట్టలోని విగ్రహాలకు పాలతో అభిషేకార్చనలు విశేషంగా నిర్వహిస్తారు. శేషాచలపతికి దిగువన వెలసివున్న శ్రీ కపిలేశ్వరుని

సన్నిధిలో సులభంగా ఎలాంటి దోషాలైనా సులభంగా తొలగిపోతాయనడంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు

★★★★

## శ్రీ కోటిలింగేశ్వరస్వామి

నాగులకట్టకు ప్రక్కనే పశ్చిమాభిముఖంగా శ్రీ కోటిలింగేశ్వరాలయం ఉన్నది సుమారు ఐదడుగుల చతురస్ర గర్భాలయం మధ్యభాగాల పాణవట్టంతో కలిపి సుమారు మూడడుగుల ఎత్తుగల కోటిలింగేశ్వరస్వామివారి శివలింగం ప్రతిష్ఠితమై ఉంది.

సుమారు ఒక అడుగు ఎత్తుగల ఈ శిలా మయ శివలింగం మీద అనేకానేక చిన్న చిన్న శివలింగమూర్తులు మలచబడి వున్నాయి ఇందువల్లే ఈ లింగమూర్తి "కోటిలింగేశ్వరస్వామి"గా పిలువబడుతున్నాడు

ఈ కోటిలింగేశ్వరస్వామి గర్భాలయానికి ముందు సుమారు నాలుగడుగులకు పైగా వెడల్పు గల చిన్న ముఖమండపం వుంది ఈ చిన్న గుడి ముఖద్వారానికి ఎదురుగా ఐదారు అడుగుల దూరంలో అభిముఖంగా నందీశ్వరుని శిలాప్రతిమ ప్రతిష్ఠింపబడింది సుమారు మూడడుగుల ఎత్తు, మూడు అడుగుల పొడవుతో వున్న ఈ నందికేశ్వరుని విగ్రహం జీవకళతో ఉట్టిపడుతూ భక్తులనిట్టే ఆకర్షిస్తూవున్నది

ఈ కోటిలింగేశ్వర స్వామివారికి, నందీశ్వరునికి ప్రతిదినం ఉదయం అభిషేకార్చనలతోపాటు మూడుపూటలా నివేదనలు ఘనంగా జరుగుతున్నాయి

ప్రతి సోమవారం, శనివారాల్లో మాత్రమేగాక విశేషంగా కార్తీకమాసం మొదలుకొని మాఘమాసం వరకు దాదాపు నాలుగు మాసాలపాటు వివాహం కావలసిన కన్యలు, పుణ్య స్త్రీలు, పూర్వ సువాసినులు ఇలా వారు వీరనకుండా భక్తాదులందరూ ఈ కోటిలింగేశ్వరస్వామి ఆలయ ప్రాంగణ భాగంలో నందీశ్వరుని ముందర దీపాలు వెలిగించి, అర్చనలు, ఆరాధనలు పారాయణలు చేస్తూ వుంటారు.

అత్యంత ప్రాచీనమైన ఈ కోటి లింగేశ్వరస్వామివారి గర్భాలయం మీద ఇటీవల ఏకకలశ సముచితమైన గోపురం నిర్మింపబడింది శైవాగమ శాస్త్ర

ప్రకారంగా ఈ గోపురంపై పశ్చిమ దిశవ శ్రీ ఉమామహేశ్వరస్వామి, ఉత్తరం వైపు చతుర్ముఖ బ్రహ్మదేవుడు, తూర్పుదిక్కున ఈశానుడు, దక్షిణ దిగ్భాగంలో దక్షిణామూర్తి వీరల శిల్పమూర్తులు ఏర్పాటు చేయబడి నయనానందకరంగా దర్శనం అనుగ్రహిస్తూ వున్నారు

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## శ్రీ అగస్త్యేశ్వరస్వామి

శ్రీ కోటి లింగేశ్వరలాయానికి దక్షిణం వైపున పశ్చిమాభిముఖంగా అగస్త్యేశ్వరాలయం నెలకొని వుంది ఈ గుడి అంతరాళం, గర్భాలయం - ఇలా రెండు భాగాలుగా నిర్మితమై ఉన్నది

సుమారు ఏడడుగుల చతురస్రాకార అంతరాళం దాటిన తరువాత సుమారు ఐదడుగుల చతురస్రాకార గర్భాలయం మధ్యభాగాన అందమైన శివలింగం ప్రతిష్ఠింపబడింది. ఈ శివలింగాన్ని అగస్త్యమహర్షి ప్రతిష్ఠించినట్లు చెప్పబడుతున్నది

అగస్త్యమహర్షి దక్షిణదేశంలోని క్షేత్రాలను సందర్శిస్తూ వచ్చి సువర్ణముఖీ తీరాన ఆశ్రమాన్ని ఏర్పాటు చేసికొన్న తరుణంలో కపిలతీర్థంలో ఒక శివలింగాన్ని ప్రతిష్ఠించాడని ప్రతీతి దేశంలో అగస్త్యమహర్షి ప్రతిష్ఠించిన శివలింగాలన్నీ అగస్త్యేశ్వరలింగాలని పిలువబడుతూ వుండటం గమనించదగిన విషయం!

అగస్త్యేశ్వర మహాలింగానికి అభిముఖంగా నందీశ్వరుని శిలా విగ్రహం ప్రతిష్ఠింపబడింది. ప్రతిరోజు ఉదయం అగస్త్యేశ్వర స్వామివారికి, నందీశ్వరునికి అభిషేకం మూడువేళల నివేదనలు జరుగుతున్నవి

కార్తీకమాసం మొదలు మాఘమాసం వరకు గల నాలుగు నెలల కాలంలో భక్తులు అగస్త్యేశ్వరస్వామివారి ముంగిట్లోను నందీశ్వరుని ఎదుట దీపారాధనలు, పారాయణ ప్రదక్షిణలు ఆచరిస్తూ వుంటారు.

ఈ అగస్త్యేశ్వరస్వామివారి ఆలయంపైన ఇటీవల ఏక కలశంతో గూడిన గోపురం నిర్మింపబడింది. శైవాగమశాస్త్ర ప్రకారంగా ఈ గోపురంపై పశ్చిమ దిక్కున

శ్రీ ఉమామహేశ్వరస్వామి, ఉత్తరం వైపున చతుర్ముఖ బ్రహ్మ దేవుడు, తూర్పు దిక్కున ఈశానుడు, దక్షిణ దిక్కున దక్షిణామూర్తి వీరల శిల్పమూర్తులు ఏర్పాటు చేయబడి శోభాయమానంగా దర్శనమిస్తున్నవి

*ఓం నమఃశివాయ! ఓం నమఃశివాయ!!*

★ ★ ★ ★

## బిల్వ వృక్షాలు

**సర్వకామ ప్రదం బిల్వం**
**దారిద్ర్యస్య విమోచనమ్**
**బిల్వ పత్రాత్ పరంనాస్తి**
**యేన తుష్యతి శంకరః** — **శివధర్మం**

. బిల్వదళం దారిద్ర్యాన్ని పోగొట్టి సమస్త కోరికలను తీరుస్తుంది పరమేశ్వరుని అనందింపజేయడంలో బిల్వపత్రాన్ని మించినది లేనే లేదు

కోటిలింగేశ్వర అగస్త్యేశ్వరాలయాలకు కొద్దిదూరంలో నైరుతి దిశలో వాహన మండపానికి దక్షిణం వైపున ఏపుగా పెరిగి వున్న బిల్వవృక్షాలు రెండు కన్నుల పండువు కావిస్తుంటాయి ఈ జంట మారేడువృక్షాలను కొందరు భక్తులు సాక్షాత్తు పార్వతీ పరమేశ్వరులుగా భావిస్తూ భక్తి ప్రపత్తులతో ప్రదక్షిణ నమస్కారాలు చేస్తుంటారు ఆ వృక్షాల మూలంలో నియమంగా నిష్ఠగా జలాలను పోస్తూ అది దంపతులకు అభిషేకం చేసినట్లుగా భావన చేస్తూ తృప్తిని పొందుతూ వుంటారు

'ఏకబిల్వం శివార్పణం' అన్న రీతిగా కపిలేశ్వరస్వామివారికి అత్యంత ప్రియమైనది మారేడు దళం. ఈ బిల్వదళాలతో చేసిన శివపూజ సంతృప్తికరంగాను సమగ్రంగాను వుంటుంది

బిల్వదళంలో మూడు ఆకులు వుంటాయి బిల్వదళం త్రినేత్రుడైన సాక్షాత్తు పరమేశ్వరుని స్వరూపం. సక్రమంగా మూడు పత్రాలు కలిగి, ఏ మాత్రం చిరగని, వాడనటు వంటి కోమలంగా ప్రకాశిస్తూ వున్న బిల్వదళాలతో శివునికి పూజ చేయాలి అలాంటి దళం ఒక్కటైనా సరే శివునికి సమర్పిస్తే చాలట! గడచిన మూడు జన్మల్లో చేసిన పాపమంతా పటాపంచలై పోతుందట!

పరమ పవిత్రమైన బిల్వవృక్షాన్ని దర్శించినా, స్పృశించినా చాలట! ఘోరపాపాలు భస్మమవుతాయి. ఒక మారేడు దళాన్ని శంకరునికి సమర్పిస్తే చాలు, కోటి యజ్ఞాలు చేసిన ఫలం కలుగుతుంది అంతమాత్రమే కాదు - కోట్లాది ఏనుగులను దానం చేసిన ఫలం, వేలకొద్దీ అశ్వమేధ యాగాలు నిర్వహించిన ఫలితం, కోటి కన్యాకాదానం చేసినందువల్ల కలిగే ఫలితం ఒకే ఒక బిల్వదళాన్ని ముక్కంటీశునికి సమర్పించిన మాత్రాన్నే సంప్రాప్తిస్తాయని బిల్వ వృక్ష గొప్పదనం ప్రశంసింపబడ్డది

***మాఘస్యైవతు యోదేవి***
***హరం బిల్వేన అర్చయేత్***
***బాలార్క శశియుక్తేన***
***విమానన సగచ్ఛతి***

***- శివధర్మ సంగ్రహం - శివరహస్య ఖండం***

మాఘమాసంలో హరుని బిల్వదళాలతో ఎవడు అర్చిస్తాడో, అతను లేత సూర్యచంద్రులతో భాసిస్తూ వున్న దివ్య విమానంలో శివపదానికి వెళ్తాడని పై విధంగా చెప్పబడింది అంతేగాదు

**బిల్వ పత్రై రఖండైశ్చ**
**సకృల్లింగం ప్రపూజయేత్**
**సర్వపాప వినిర్ముక్తః**
**శివలోకే మహీయతే** **- శివధర్మం**

ఎవడు ఒకమారైనా అఖండమైన (భిన్నంకాని) మారేడు దళాలతో శివుని అత్యంత భక్తితో పూజిస్తాడో, వాడు సమస్త పాపాల నుండి విడివడి శివలోకాన్ని పొందుతాడు.

మారేడు దళాలు శివునికి మాత్రమే గాక, దేవికి కూడా అత్యంత ప్రీతి పాత్రమట అందువల్లే భవిష్యోత్తర పురాణంలో

**మాలా ద్వయేన పంపూజ్య**
**దుర్గాదేవిం నరాధిప**
**బిల్వవృక్షస్య పత్రాణాం**
**రాజసూయ ఫలం లభేత్**

అని తెల్పబడింది. అనగా మారేడు దళాలతో కూర్చబడిన రెండు దండలతో పార్వతీదేవిని అలంకరించి అర్చించి వాళ్లకు రాజసూయయాగం చేసినంత ఫలితం వస్తుందట! ఇంకా

**బిల్వపత్రై రఖండై శ్చ**
**సకృద్దేవీం ప్రపూజయేత**
**సగోలక్షఫలం ప్రాప్య**
**దుర్గాయానుచరో భవేత్**

ముక్కలుగాని, విరుగని, చిరగని మారేడు దళాలతో భక్తితో దేవిని పూజించినవానికి లక్ష గోవులను దానం చేసిన ఫలితం చేకూరడమే గాక, దుర్గాదేవి యనుచర వర్గంలో చేరతాడట! అందువల్లే

**సర్వతో బిల్వపత్రంతు**
**దేవ్యాః ప్రీతికరం పరమ్**

అన్నింటికంటే కూడ దేవికి బిల్వపత్రాలు అంటేనే పరమప్రీతి, అని చెప్పబడింది

అంతేగాక భైరవుడు దేవితో బిల్వపత్ర ప్రాముఖ్యాన్ని వివరిస్తూ

**బిల్వపత్రం యథాప్రీతి**
**కరందేవ్యా వరాననే**
**పతధాన్యత్ కించి దస్తి**
**పుష్పేషు ప్రీతి కారకమ్**
**అతో యత్నేన దాతవ్యం**
**బిల్వపత్రం త్రి పత్రయుక్**

**- మంధాన భైరవం - మేదినీ కూర్మ ప్రస్తారం**

ఓ వరాననా! దేవికి మారేడు దళమెంత ప్రీతికరమైనదో చెప్పడం కష్టం ఏ పుష్పమైన మారేడు దళం తర్వాతే. అందువల్లే ప్రయత్నించి మూడు ఆకులు కలిగిన బిల్వదళాలను దేవికి సమర్పించాలి అని తెలియజేశాడు

ఇంతటి పరమ పవిత్రమైన మారేడు దళాలు శివపార్వతులకు మాత్రమే గాక, తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి కూడ అత్యంత ప్రీతికరమయినది కూడ బిల్వం శ్రీనివాసుని పూజాద్రవ్యాల్లో ప్రధాన స్థానాన్ని ఆక్రమించి ఉంది

శ్రీ వేంకటేశ్వరుని దేవేరి అయిన శ్రీ పద్మావతిఅమ్మవారు 'బిల్వవనస్థ', 'బిల్వవనాలయ' అని కీర్తింపబడింది సాక్షాత్తు లక్ష్మీదేవికి ఆవాసమైన బిల్వవృక్షం యొక్క దళాలతో తిరుమల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రతి ధనుర్మాసంలోనూ ఒక నెలరోజుల పాటు సహస్రనామార్చనలు చేస్తారు అంతేగాక ప్రతి కార్తీకమాసం శ్రవణనక్షత్రంనాడు శ్రీనివాసునికి జరిగే 'పుష్పయాగం'లో కూడా బిల్వదళాలను ఉపయోగించడం జరుగుతున్నది.

సాక్షాత్తు మహాలక్ష్మీ స్వరూపమై శివకేశవులిద్దరికీ అత్యంత ప్రియమైనదై ఇరువురి పూజల్లోను ప్రధాన స్థానాన్ని వహించిన ఈ బిల్వవృక్షాలకు భక్తితో ప్రదక్షిణ నమస్కారాలు చేస్తూ ఈ అష్టక స్తోత్రంతో ప్రార్థించుదాం

## బిల్వాష్టకం

**త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచ త్రియాయుధమ్**
**త్రిజన్మ పాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్**

**త్రిశాఖై ర్బిల్వపత్రై శ్చ అచ్ఛిద్రైః కోమలై శ్శుభైః**
**తవ పూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్.**

**దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనమ్,**
**అఘోరపాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్.**

**సాలగ్రామేషు విప్రేషు తటాకే వనకూపయోః**
**యజ్ఞకోటి సహస్రాణాం ఏక బిల్వం శివార్పణమ్**

**దంతికోటి సహస్రేషు అశ్వమేధ శతాని చ**
**కోటికన్యా ప్రదానేన ఏకబిల్వం శివార్పణమ్**

**ఏకంచ బిల్వపత్రై శ్చ కోటి యజ్ఞఫలం లభేత్**
**మహాదేవస్య పూజార్థం ఏకబిల్వం శివార్పణం**

**కాశీక్షేత్ర నివాసం చ కాలభైరవ దర్శనమ్**
**గయా ప్రయాగ దృష్ట్వా ఏకబిల్వం శివార్పణమ్**

**ఉమయా సహదేవేశం వాహనం నంది శంకర**
**ముచ్యతే సర్వపాపేభ్యో ఏకబిల్వం శివార్పణమ్**

తులసీ బిల్వ నిర్గుండీ అపామార్గ కపిత్థకే
శమీ చామలకం, దూర్వా అష్ట బిల్వాః ప్రకీర్తితాః

ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!

★ ★ ★ ★

## వాహన మండపం

అగస్త్యేశ్వరాలయానికి ఎదురుగా, తూర్పుముఖంగా ఒక మండపం వుంది ఇదే శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల వాహన మండపం కొన్ని విశేష దినాల్లో శ్రీ స్వామివారలు ఊరేగింపునకు వెళ్ళేముందు, లేదా కల్యాణోత్సవానికి, డోలోత్సవాలకు, తెప్పోత్సవాలకు గ్రామోత్సవాలకు వెళ్ళేముందుగా ఈ వాహన మండపంలో చక్కగా అలంకరింపబడతారు తర్వాత ఆయా వాహనాల మీద అధిరోహించిన తర్వాత ఈ మండపం నుంచే బయలుదేరుతారు అందువల్లే ఇవి వాహన మండపంగా అంటారు

ఈ మండపంలో వెండి నంది వాహనం, మూషిక వాహనం, రావణ బ్రహ్మ వాహనం, వెండి పల్లకిలు. ......... మున్నగునవి వాహన సేవలకుపయోగించే వస్తువులు చోటు చేసుకున్నాయి

ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!

★ ★ ★ ★

## వంటశాల

శ్రీ కోటిలింగేశ్వర, అగస్త్యేశ్వరాలయాలకు వెనుక భాగంలో సరిగ్గా ఆగ్నేయమూలకు ఎత్తైన విశాలమైన అరుగుపైన 'వంటశాల' నిర్మింపబడింది

ఈ వంటశాలలో ప్రతినిత్యమూ శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారలకు, ఇతర పరివార దేవతలకు నివేదనమయ్యే దధ్యోదనం, పులిహోర, పొంగలి, చక్కెర పొంగలి మున్నగు అన్నప్రసాదాలు వండబడతవి వీటితోపాటు పోలీలు, సుఖియలు, వడలు, పాయసం, కేసరి, లడ్డూ మున్నగు పిండి వంటలు కూడా ఈ విశేష దినాల్లో తయారుచేయబడి శ్రీ స్వామివారల నివేదనకుగాను వంటస్వాములు శుచిగా, అత్యంత నిష్ఠతో రుచికరంగా తయారుచేసి సిద్ధం చేస్తుంటారు.

అంతేగాక, ప్రతి సంవత్సరం ఆశ్వయుజ పౌర్ణమికి శ్రీ కపిలేశ్వరస్వామివారి అన్నాభిషేకానికి వలసిన 250 కిలోల అన్నం, దేవీ నవరాత్రుల్లో శ్రీ కపిలేశ్వరస్వామి బ్రహ్మోత్సవంలో విశేషంగా నివేదింపబడే అన్న ప్రసాదాలు కూడా ఈ వంటశాలలో స్వామివారి పాచకులు నియమ నిష్ఠలతో తయారుచేస్తారు

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★ ★★

**ఉత్సవాలు:**

## డోలోత్సవం

శ్రీ కపిలతీర్థ పుణ్యక్షేత్రంలో ప్రతి సోమవారం సాయంత్రం శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారికి డోలోత్సవం జరుగుతుంది ఈ డోలోత్సవాన్ని ఊయలసేవ అని, తమిళంలో 'ఊంజల్‌సేవ' అని అంటారు

ఈ డోలోత్సవం శ్రీ కామాక్షీ శ్రీ కపిలేశ్వరస్వామివారి ఉత్సవమూర్తులయిన శ్రీ చంద్రశేఖరస్వామి శ్రీ మనోన్మణి అమ్మవారలకు జరుపబడుతుంది

ప్రతి సోమవారం ఉదయం సుప్రభాతం మొదలుగా సాయంత్రం ప్రదోషకాలపూజ వరకు యధావిధిగా ఆలయ కార్యక్రమాలు జరుపబడతవి సాయంత్రం నివేదన, మంగళ హారతులు అయిన వెటనే వాహన మండపం నుండి ఒకే పల్లకిలో వేంచేసిన శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలను, ఆభరణాలతో పుష్పమాలలతోను అలంకరిస్తారు పిదప ఛత్రచామర బాజా భజంత్రీలతో వేదమంత్రాలతో శ్రీ స్వామివారిని ఆలయ ధ్వజ స్తంభ మండపం ముందు భాగంలో నిర్మింపబడిన డోలోత్సవ మండపానికి ఊరేగింపుగా తీసుకొనివస్తారు ఈ డోలోత్సవ మండపంలోనే ప్రతినెలా మాసశివరాత్రినాడు, మహాశివరాత్రి సందర్భంలోను శ్రీ కామాక్షీ సమేత కపిలేశ్వరస్వామివారల కల్యాణోత్సవం జరుపబడుతుంది కనుక ఈ మండపాన్నే కల్యాణ మండపమని కూడ అంటారు

అప్పటికే మామిడాకు తోరణాలతో, అరటి స్తంభాలతో, రంగు రంగు విద్యుద్దీపాలతో తీర్చిదిద్ది అలంకరింపబడిన డోలోత్సవ మండపంలో గొలుసులతో పల్లకిని వ్రేలాడదీసి ఊంజల్‌సేవను నిర్వహిస్తారు.

ముందుగా వేదపండితులు, దోలలో ఊగుతున్న వున్న శ్రీ కామాక్షి కపిలేశ్వరుల దయాళుత్వాన్ని, భక్తవాత్సల్యాన్నీ వేదమంత్రాలతో అనేక విధాలుగా కీర్తిస్తారు

అటు తరువాత సంగీత విద్వాంసులైన గాయకోత్తములు కీర్తనలను ఆలాపిస్తూ ఊయలసేవలో పాల్గొంటున్న శ్రీ కపిలేశ్వరస్వామివారి వైభవాన్ని పొగడుతూ కొన్ని భక్తి రస గేయాలను స్వామివారికి వినిపిస్తారు

ఈ రీతిగా సంకీర్తన కైంకర్యం అయిన తర్వాత మంగళవాద్య ఘోష శ్రుతి సులభంగా సాగుతుంది శ్రీ మనోన్మణి సమేతుడయిన శ్రీ చంద్రశేఖరస్వామి వేదనాదాలను, సంగీత నాదాలను పరవశుడై ఆలకిస్తూ భక్తులను క్రీగంటి చూడ్కులతో కరుణిస్తూ దోలోత్సవంలో నేత్రపర్వంగా దర్శనమొసంగి ఆనందింపజేస్తారు

సాయంత్రం 6-30 నుండి 7-30 వరకు సుమారు ఒక గంటసేపు ఊంజల్‌సేవ జరిగిన తరువాత తెరలువేసి, శ్రీ స్వామివారికి అమ్మవారికి పంచకజ్జాయం (ఏలకులపొడి, జీడిపప్పు, ఎండుద్రాక్ష, చక్కెర, గసగసాలు కలిపిన పొడి ప్రసాదం) పులిహోర నివేదింపబడుతుంది కొబ్బరికాయ కొట్టి ఫలాలను నివేదించిన అనంతరం మంగళహారతి ఇస్తుండగా తెరలు తీస్తారు ఈ హారతి భక్తులందరూ స్వీకరించిన తదుపరి అందరికి ప్రసాద వినియోగం జరుగుతుంది

ప్రతి సోమవారం దేవస్థానం వారు నిత్యవిధిగా జరిపే శ్రీ కామాక్షి కపిలేశ్వరుల డోలోత్సవంలో నిర్ణీత రుసుమును చెల్లించి, భక్తులు కూడా పాల్గొనవచ్చు

ఈ విధంగా డోలోత్సవ మండపంలో జరిగే శ్రీ కామాక్షి కపిలేశ్వరుల ఊయలసేవను భక్తులందరూ దర్శించి తరించవచ్చును

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

# కామాక్షి కపిలేశ్వరస్వామి కల్యాణోత్సవం

కపిలతీర్థంలో శ్రీ కామాక్షి సమేతుడుగా నెలకొని వున్న కపిలేశ్వరస్వామి వారికి ప్రతినెలా మాసశివరాత్రి రోజున ప్రదోష (సాయంసంధ్య) సమయంలో కల్యాణోత్సవం జరుగుతుంది. ఈ కల్యాణోత్సవాన్ని "శ్రీ శివపార్వతుల కల్యాణోత్సవం" అని అంటారు. ప్రతి మాసంలో మాసశివరాత్రి రోజున విధిగా దేవస్థానం వారు జరిపే ఈ శివపార్వతుల కల్యాణోత్సవంలో నిర్ణీత రుసుమును చెల్లించి గృహస్థులు కూడా పాల్గొనవచ్చును.

ప్రతి నెలా మాసశివరాత్రి రోజున మాత్రమే గాక మాఘమాసంలో మహాశివరాత్రి పర్వదిన సందర్భంగా ఐదు రోజులపాటు జరిగే శ్రీ కపిలేశ్వరస్వామి బ్రహ్మోత్సవంలో కూడ విశేషంగా కల్యాణోత్సవం జరుపబడుతుంది మహాశివరాత్రి మరునాడు సాయంకాలం శ్రీ కామాక్షి కపిలేశ్వరస్వామివారికి ఈ వార్షిక కల్యాణోత్సవం అత్యంత వైభవంగా నిర్వహింపబడుతుంది

## కల్యాణోత్సవ విశేషాలు :

శ్రీ కామాక్షి సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారికి జరిగే కల్యాణోత్సవంలో ఒకపీఠంపై వున్న శ్రీ స్వామివారి ఉత్సవమూర్తి అయిన 'శ్రీ సోమస్కందర్' (అనగా ఉమాదేవితో, స్కందునితో కలిసి వున్న పరమశివుని ఉత్సవమూర్తి)కు మరొక పీఠంపై వున్న శ్రీ కామాక్షి అమ్మవారి ఉత్సవమూర్తికి కల్యాణోత్సవం జరుగుతుంది మూలవరులకు ప్రతిగా కల్యాణోత్సవంలో పాల్గొనే అమ్మవారి ఉత్సవమూర్తిని కూడా "కామాక్షి దేవి" అంటారు. శ్రీ కామాక్షి సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారల ప్రధాన ఉత్సవమూర్తులే శ్రీ సోమస్కందమూర్తి, కామాక్షిదేవి వారల పంచలోహమూర్తులు. ముందుగా ఏకాంతసేవా మండపం నుండి శ్రీ సోమస్కందమూర్తి స్వామిని ఒకపీఠంమీద, శ్రీ కామాక్షిదేవిని మరొకపీఠంమీద సర్వాభరణాలతో, పూలమాలలతో చక్కగ అలంకరింపబడి, ఛత్రచామర బాజా భజంత్రీ మంగళ వాద్య పురస్సరంగా ఊరేగుతూ ఆలయం ధ్వజస్తంభ మండపానికి ముందు భాగంలో వున్న కల్యాణోత్సవ మండపానికి విజయం చేస్తారు

అప్పటికే కల్యాణమండపం మామిడాకు తోరణాలతో అరటి స్తంభాలతో రంగురంగుల విద్యుద్దీపాలతో శోభాయమానంగా అలంకరింపబడి వుంటుంది.

ఈ కల్యాణ మండపానికి వేంచేసిన శ్రీ సోమస్కందర్‌స్వామి, ఉత్తరాభిముఖంగా కల్యాణవేదిక నలంకరిస్తారు. ఈ స్వామికి ఎడమప్రక్కన మరొక పీఠంపై శ్రీ కామాక్షీ అమ్మవారు వేంచేసి వున్న శుభ తరుణంలో మంగళవాద్య పురస్సరంగా కల్యాణోత్సవ వేడుకలు వైభవంగా భక్తుల భక్తి సంభ్రమాల మధ్య ప్రారంభమవుతాయి

ముందుగా అర్చకస్వాములు శైవాగమ శాస్త్రోక్తంగా పుణ్యాహవచనం నిర్వహించి పరిసర వాతావరణం శుద్ధిని చేస్తారు తదుపరి శ్రీ కామాక్షీ సమేతంగా శ్రీ కపిలేశ్వరస్వామివారలకు నిర్విఘ్నంగా కల్యాణం జరుగుటకు గాను ముందుగా గణపతి పూజ చేస్తారు.

పిదప రెండు కలశాలను స్థాపించి అందులో శ్రీ కపిలేశ్వరస్వామివారిని, శ్రీ కామాక్షి దేవిని ఆవాహనం చేసి, అష్టోత్తర శతనామాలతో అర్చించి ధూపదీప నైవేద్య హారతులిచ్చిన తర్వాత, కొబ్బరికాయలపై పసుపు పూసిన కల్యాణ కంకణదారాలను ప్రతిష్ఠిస్తారు అర్చకస్వాములు నూతన వధూవరులైన శ్రీ కామాక్షీ దేవికి, శ్రీ సోమస్కందమూర్తికి నూతన వస్త్ర సమర్పణ చేసిన తర్వాత కల్యాణ కంకణాలను ధరింపజేసి కర్పూర హారతిని ఇస్తారు ఆ తర్వాత పరమేశ్వరునికి యజ్ఞోపవీతధారణ చేయించిన పిదప ఆ నూతన వధూవరులకు మధుపర్క సమర్పణ చేస్తారు తేనెతో కూడిన పంచామృతాన్ని మధుపర్కం అంటారు ఈ మధుపర్కాన్ని నిత్యనూతన వధూవరులైన శ్రీ కామాక్షీ కపిలేశ్వర స్వామివారలకు సమర్పించిన పిదప అర్చకస్వాములు వధూవరుల 'గోత్ర ప్రవరలు' చదువుతూ మహాసంకల్పం చెప్తారు తర్వాత అర్చకులు కన్యాదానం చేయిస్తారు. అనంతరం శ్రీ స్వామివారికి – అమ్మవారికి పరస్పరం పుష్పమాలలను మూడు పర్యాయాలు మారుస్తారు. కన్యాదానం అయిన తర్వాత జరిగే ప్రధాన ఘట్టం 'మాంగల్య ప్రతిష్ఠ' పూజ. వేదపండితులు శ్రీ సూక్తాన్ని శ్రుతి సుభగంగా పఠిస్తుండగా మాంగళ్యాన్ని పూర్ణఫలమైన పీచువున్న కొబ్బరికాయపై ప్రతిష్ఠించి అర్చించి ధూపదీప నివేదనలు సమర్పిస్తారు అనంతరం ఆ మాంగళ్యాన్ని భక్తులందరికి కన్నుల పండువుగా అందరికీ చూపించిన తర్వాత అర్చకస్వాములు శ్రీ కపిలేశ్వరస్వామివారి చేతులకు తాకించి, శ్రీ స్వామి పక్షాన శ్రీ కామాక్షీ అమ్మవారికి మాంగల్య సూత్రధారణ చేస్తారు ఆ తర్వాత "అక్షతారోపణ" కార్యం అనగా తలంబ్రాల (పసుపు కలిపిన బియ్యం) వేడుకను అర్చకులు జరిపిస్తారు శ్రీ స్వామివారి మీద, అమ్మవారి మీద తలంబ్రాలు పోసిన తరువాత

మంగళహారతిని ఇస్తారు పిదప లాజ హోమం చేయబడుతుంది. హోమం పూర్ణాహుతి అయిన తర్వాత హోమ భస్మాన్ని రక్ష (భస్మరక్ష) గా శ్రీ స్వామివారికి అమ్మవారికి ధరింపజేసిన తర్వాత అర్చకులు తాము ధరించి, భక్తులందరికి ఇస్తారు. పిదప టెంకాయలు కొట్టి ఫలాలు, లడ్డూలు, పులిహోర చక్కెర పొంగలి మున్నగు ప్రసాదాలను మహా నివేదన కావించిన పిదప మహా మంగళహారతి ఇస్తారు ఈ హారతి భక్తులందరూ స్వీకరించిన తర్వాత ఆర్జితంలో పాల్గొన్న భక్తులకు ప్రసాద వితరణ జరుగుతుంది

పిదప శ్రీ సోమస్కందమూర్తి, శ్రీ కామాక్షి అమ్మవారు ఆలయంలో ప్రవేశించడంతో కల్యాణోత్సవం వేడకుల పరిసమాప్తమవుతాయి

దేవస్థానం వారిచే ప్రతినెలలో మాసశివరాత్రి రోజు సాయంవేళ, అలాగే మహాశివరాత్రి మరునాటి సాయంకాలం విధిగా శ్రీ కామాక్షి కపిలేశ్వరస్వామి వారల కల్యాణోత్సవం నిర్వహింపబడుతూ వుంటుంది భక్తులు నిర్ణీత రుసుమును చెల్లించి, కల్యాణోత్సవంలో పాల్గొనవచ్చును

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## దేవీ నవరాత్రులు (శరన్నవరాత్రులు)

కపిలేశ్వరస్వామివారి క్షేత్రంలో ఆశ్వయుజ మాసంలో శుద్ధపాడ్యమి మొదలు దశమి వరకు దేవీనవరాత్ర పూజలు ఘనంగా నిర్వహింప బడుతున్నాయి. ఈ వేడుకలన్నీ శ్రీ కపిలేశ్వరస్వామివారి దేవేరి అయిన శ్రీ కామాక్షీ దేవి ఉపాసనా కార్యక్రమాలుగా, అర్చనా విధానాలుగా ప్రాచీన కాలం నుంచీ తొమ్మిది రోజుల పాటు వైభవంగా జరుగుతున్నాయి.

### అంకురార్పణ – రక్షాబంధన

ఆశ్వయుజ శుద్ధపాడ్యమి రోజు ఉదయం యథాక్రమంగా శ్రీ కపిలేశ్వర స్వామివారి సన్నిధిలో సుప్రభాతం, ఉదయకాల అభిషేక అర్చనలు పూర్తి చేయబడతవి.

పిదప అర్చకస్వాములు 'శుక్రవారముదేవి' అని పిలువబడుతూ శ్రీ కామాక్షి దేవి మూలమూర్తికి ప్రధాన నకలు ఉత్సవ ప్రతిమగా విరాజిల్లుతున్న అమ్మవారికి ప్రత్యేకంగా పాలు, పెరుగు, తేనె, పసుపు, చందనం మున్నగు ద్రవ్యాలతో విశేషంగా అభిషేకాలు నిర్వహిస్తారు

ఆ తరువాత ప్రతిమా మండపం మధ్యలో శ్రీ శుక్రవారపు అమ్మవారిని కొలువుదీర్చి వస్త్రాభరణాలతో పుష్పమాలలతో అలంకరిస్తారు ఈ అమ్మవారి ముందర 'పూర్ణ కలశస్థాపనం' చేస్తారు ఈ కలశ స్థాపనకు ముందుగా, అర్చకస్వాములు ఈ శరన్నవ రాత్రులలో శ్రీ కామాక్షీ దేవిని ఘనంగా అర్చించుటకుగాను, పుణ్యాహవాచనం, గణపతి పూజచేసిన తర్వాత కొత్త మట్టి మూకుళ్లలో నవధాన్యాల యొక్క అంకురార్పణ కావిస్తారు ఆ సందర్భంలో రక్షా కంకణాలను స్థాపించి అర్చన చేస్తారు. పిదప నవరాత్ర దీక్షకోసం, ముందుగా రక్షాబంధన (కంకణతోరాలు) తోరాలను శ్రీ కామాక్షీ అమ్మవారి మూలమూర్తి యొక్క కుడిచేతికి, శ్రీ శుక్రవారపుదేవి కుడిచేతికి, కలశమునకు కట్టిన తర్వాత అర్చకవర్యులు తామూ ఆ కంకణ తోరాలను ధరించి దీక్షను స్వీకరిస్తారు.

## కలశస్థాపన

ఉత్సవ ప్రతిమా మండపంలో శ్రీ శుక్రవారపు దేవిని కొలువు తీర్చిన తరువాత, ఆ మూర్తియొక్క పాదల చెంత పూర్ణ కలశస్థాపన చేస్తారు. ఈ కలశంలో పచ్చకర్పూరం కుంకుమపువ్వు, ఏలకులు మున్నగు సుగంధ ద్రవ్యాలు కలిపిన జనాన్ని నిండుగా పోస్తారు.

ఈ పూర్ణ కలశాన్ని శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించి ఇందులో శ్రీ కామాక్షి అమ్మవారిని ఆవాహన చేస్తారు. పిదప షోడశోపచార పూజలు నిర్వహించిన తరువాత అర్చకస్వాములు శ్రీ లలితాసహస్రనామావళిని పఠిస్తూ కుంకు మార్చనను ప్రారంభిస్తారు.' శ్రీ పక్కనే వున్న వేదపండితులు, అర్చకస్వామి ప్రారంభించిన శ్రీ లలితా సహస్రనామావళిని అందుకొని శ్రీ లలితాఅమ్మవారి వేయినామాలను పఠిస్తుండగా అర్చకులు కొలువుదీరియున్న శ్రీ శుక్రవారపుదేవి సన్నిధియందలి కలశమునకు కుంకుమార్చనను నిర్వహిస్తారు. కుంకుమార్చన పూర్తి అయిన వెంటనే మహానివేదన జరుగుతుంది. పప్పు, అన్నం, పాయసం,

కూరలు నివేదింపబడతాయి నివేదన అయిన తర్వాత మంగళహారతి జరుపబడుతుంది అమ్మవారికి నివేదన అయిన తర్వాత పప్పు, అన్నం, పాయసం మున్నగు ప్రసాదాలతో బ్రాహ్మణులకు సంతర్పణ (సమారాధన) చేయడం జరుగుతుంది

ఇక సాయంసంధ్యాకాలంలో కూడ శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారి మూలమూర్తికి అభిషేకాలు సహస్ర నామార్చనలు అయిన తరువాత, ప్రతిమా మండపంలో శ్రీ శుక్రవారపుదేవికి కలశమునకు కూడా కుంకుమతో సహస్ర నామార్చనలు జరుపుతారు తరువాత ఆలయంలో అన్నిచోట్ల మహానైవేద్యం సమర్పింపబడుతుంది. ఆ తరువాత మూలవరులకు జరిగినట్లే, ప్రదోషకాలంలో శ్రీ శుక్రవారపుదేవి, కలశం దగ్గర శంఖ, డమరుక, భేరీలు, తాళాలు, భజంత్రీలు మున్నగు వాద్య ఘోషలతో నక్షత్ర హారతి పంచహారతి, మంగళ నీరాజనాలతోపాటు ఛత్ర చామరాది ఉపచారాలు నిర్వహింపబడతవి

ప్రదోషకాల అర్చనాది మంగళహారతులు పూర్తి అయిన అనంతరం ప్రతిమా మండపంలో వున్న శ్రీ కామాక్షీదేవి ఉత్సవమూర్తిని వాహన మండపంలోనికి ఊరేగింపుగా తీసుకొనివచ్చి అమ్మవారిని ఆభరణాలతో, పుష్పహారాలతో అలంకరిస్తారు ఇలా సర్వాభరణ భూషిత అయిన శ్రీ కామాక్షి అమ్మవారిని, ఆలయం ప్రాంగణంలో ఉన్న ఊంజల్ మండపానికి ఊరేగింపుగా తీసుకొనివస్తారు. అప్పటికే మామిడాకు తోరణాలతో, అరటి స్తంభాలతో, రంగు రంగు విద్యుద్దీపాలతో చక్కగా అలంకరించి, తీర్చిదిద్దబడిన ఊంజల్ (ఊయల) మండపంలో అమ్మవారికి ఊయలసేవ జరుగుతుంది

వేదపండితులు వేదమంత్రాలను శ్రుతిమధురంగా పరిస్తూ ండగా సంగీత విద్వాంసులు, మనోహరమైన దేవీకీర్తనలను లలితంగా శ్రావ్యంగా గానం చేస్తుండగా మంగళవాద్యాలు మోగుతూ వుండగా శ్రీ కామాక్షీ అమ్మవారు ఊయల ఊగుతూ సమస్త చరాచర సృష్టి గమనమంతా నా మీదే ఆధారపడి వుంది. నన్నే శరణు వేడండి అంటూ అభయ వరద ముద్రలతో లోకాలను అనుగ్రహిస్తూ క్రీగంట కరుణిస్తూ భక్తులను ఆనంద డోలికల్లో ఊగింపజేస్తుంది. రోజుకొక వైభవంగా అంగరంగ వైభోగంగా నవరాత్రులలో మొదటి మూడు రోజులు అష్టైశ్వర్యాలను ప్రసాదించే మహాలక్ష్మీ స్వరూపంగా, మధ్య మూడు

దినాలు జ్ఞానాన్ని అలవోకగా అందించే మహా సరస్వతీదేవీ స్వరూపంగా, చివరి మూడు రోజులూ మహా మంగళప్రదంగా సర్వకార్యాలను సిద్ధింపజేసే, సర్వమంగళా స్వరూపిణియైన దుర్గాదేవిగా వింత వింత తేజస్సులతో దర్శనమిస్తూ భక్తులను ఆనందపరుస్తూ వుంటుంది శ్రీ కామాక్షీ అమ్మవారు

ఈ రీతిగా తొమ్మిదిరోజులు - అనగా అశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు అశ్వయుజ శుద్ధ నవమి వరకు దేవీ నవరాత్రోత్సవాలు జరుపబడుతవి

దశమిరోజు అనగా పదవరోజు కూడా ఉదయం సాయంకాలం సహస్ర నామార్చనలు జరిగిన తరువాత నివేదనలు పంచవాద్య సమ్మేళనంతో మహా మంగళ హారతులు అయిన తర్వాత భక్తులకు ప్రసాద వినియోగం జరుగుతుంది పదవరోజు సాయంత్రం మాత్రం ఊంజల్‌సేవ ఉండదు

ఇలా ప్రదోష పూజ పూర్తికాగానే సాయంత్రం 6-30 గంటలకు శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలు ఇరువురు ఒకే పల్లకిపై వేంచేసి సర్వాభరణ భూషితులై ఛత్రచామర బాజా భజంత్రీలతో వేదపారాయణలతో భక్త బృందాలతో శమీ దర్శనమునకు, పారువేటకు బయలుదేరుతారు ఈ ఉత్సవం ఆలయం బయట ప్రాంగణంలో వున్న శ్రీ ఆంజనేయస్వామివారి మండపం వరకు కొనసాగుతుంది ఆ మండపంలో శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారు కొలువై వుండగా అర్చక స్వాములు శ్రీ స్వామివారి పక్షాన అక్కడ ఉన్న శమీ వృక్షంపై బాణాలు మూడు మారులు ప్రయోగిస్తారు ఆ తర్వాత అష్ట బిల్వదళాల్లో ఒకటిగా ప్రసిద్ధి చెందిన శమీ పత్రాలతో శ్రీ చంద్రశేఖర స్వామివారలను అర్చించి చక్కెర పొంగలి, మిరియపు పొంగెలి, పులిహోర, పెరుగన్నం మున్నగు అన్నప్రసాదాలను ఘనంగా నివేదిస్తారు

అటు పిమ్మట మంగళహారతి, ప్రసాద వితరణలతో శమీ దర్శనం పూర్తి అవుతుంది మళ్లీ శ్రీ చంద్రశేఖరస్వామి శ్రీ మనోన్మణి అమ్మవారలు, తిరిగి ఊరేగింపుగా ఆలయంలో ప్రవేశించడంతో దేవీ నవరాత్రులలో విశేషంగా జరుపబడే శ్రీ కామాక్షీ అమ్మవారి అర్చనా ఆరాధనా కార్యక్రమాలు సంపూర్ణంగా శోభాయమానంగా మంగళ ప్రదంగా పరిసమాప్తమవుతాయి.

కపిలతీర్థంలో ఆశ్వయుజ మాసంలో దసరా పండుగవరకు జరిగే శరన్నవరాత్రులలో ప్రతిరోజు మధ్యాహ్నం బ్రాహ్మణులకు అన్న సంతర్పణ

ఉంటుంది. తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచార పరిషత్, అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులచేత, సంగీత ధార్మిక కార్యక్రమాలు, పురాణ ప్రవచనాలూ హరికథలు ఏర్పాటు చేయబడుతూ వుంటాయి.

శ్రీ వేంకటాచలం యొక్క సన్నిహిత సీమలో నెలకొని ఉన్న అత్యంత ప్రసిద్ధ శైవక్షేత్రమైన కపిలతీర్థంలో రోజుకొక్క రూపంలో దర్శనమిస్తున్న శ్రీ కామాక్షీ అమ్మవారిని దర్శించుట సర్వదోష హరమేగాక సర్వమంగళ ప్రదాయకము కూడ. ముఖ్యంగా దేవీ నవరాత్రులలో దర్శించి సేవించుట ఎనలేని కోరికలు అన్నీ తీరతాయనడంలో ఏ మాత్రం సందేహం లేదు ఎందుకంటే ఆ యమ చూపులతోనే కోరికలన్నీ తీర్చే జగన్మాత అందువల్లే ఆ యమ కామాక్షీ దేవి అనే సార్థక నామధేయంతో విరాజిల్లుతూ వున్నది అలా సర్వార్థ ప్రదాయినియైన శ్రీ కామాక్షీ దేవి విరాజిల్లుతూ వున్న సిద్ధిక్షేత్రం శ్రీ కపిలతీర్థ పుణ్యక్షేత్రం!

*యా దేవీ సర్వభూతేషు శక్తి రూపేణ సంస్థితా*

*నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః*

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## అన్నాభిషేకం

సౌరమానం ప్రకారం తులా మాసంలోని పూర్ణిమ రోజున అనగా అశ్వయుజ (సెప్టెంబరు - అక్టోబరు) మాసంలో ప్రతి సంవత్సరం అత్యంత భక్తి ప్రపత్తులతో ఆనందదాయకంగా శ్రీ కపిలేశ్వరస్వామివారి మహాలింగానికి (మూలమూర్తికి) "అన్నాభిషేకం" అనబడే విశేష అభిషేకోత్సవం జరుపబడుతుంది. ఈ ఉత్సవం జరిగే రోజును "కపిలతీర్థ ముక్కోటి" అని విశేషంగా పేర్కొంటారు.

ఈ పూర్ణిమనాడు ఉచ్చకాలం అనబడే మాధ్యాహ్నిక సమయంలో శ్రీ కపిలేశ్వరస్వామివారి మహాలింగానికి (మూలమూర్తికి) మాత్రమే ఏకాంతంగా అన్నాభిషేకం నిర్వహింపబడుతుంది. ఆనాడు ఉదయం పదకొండు గంటల సమయంలో శుద్ధోదకంతో శ్రీ కపిలేశ్వర స్వామివారికి అభిషేకం చేస్తారు.

ముందుగా ఏకాంతసేవా మండపం అని పిలువబడే ప్రతిమా మండపంలో మహాకలశ స్థాపన చేస్తారు. ఈ కలశంలో కుంకుమపువ్వు,

జాజికాయ, జాపత్రి, ఏలకులు, లవంగాలు, పచ్చకర్పూరం మున్నగు సుగంధ ద్రవ్యాలు కలిపిన నిర్మల జలాన్ని నింపి, మహాకలశస్థాపన చేస్తారు ఆ సమయంలో వేదపండితులు మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్ర పఠన పారాయణలు కావిస్తారు.

ఆ తర్వాత సుమారు 250 కిలోల బియ్యం వండిన అన్నంతో శ్రీ కపిలేశ్వర లింగానికి అభిషేకం చేస్తారు భూమితలం నుండి పానపట్టం మరియు లింగం కూడ పూర్తిగా అన్నంతో కప్పివేయబడుతుంది కపిలేశ్వరలింగాన్ని పూర్తిగా అన్నంతో కప్పిన తర్వాత దానిపైన ప్రత్యేకంగా అన్నంతోనే ఒక చిన్న శివలింగాన్ని పానవట్టంతో కూడా తీర్చి దిద్ది స్థాపిస్తారు.

ఇలా ఏర్పాటు చేసిన అన్న లింగంపైన లింగాన్ని వదలి పానవట్టంపై నుంచి అక్కడక్కడ పోళీలు (పూరణం భక్ష్యం) సుఖియలు (పూరణం కుడుములు, బూరెలు), మురుకులు (ఉప్పులేనివి), ఫేణీలు, వడలు (ఉప్పులేకుండా) ఇలా ఈ ఐదు రకాల పిండి వంటలను అలంకరిస్తారు.

పిదప పొట్లకాయలు, వంకాయలు, అరటి కాయలు, సీమ వంకాయలు, బూడిద గుమ్మడికాయలు వీటిని ముక్కలుగా కాకుండా పూర్తి కాయలుగానే ఉప్పులేకుండా ఉడికించి, వీటిని అన్నలింగంపై సర్పాభరణాలుగా, చంద్రవంకగా, డమరుకగా, త్రిశూలంగా తీర్చిదిద్ది అలంకరిస్తారు

నిమ్మకాయలు, టెంకాయలు కొట్టి నివేదనమిస్తారు ఆ తర్వాత పుష్పమాలలతో బిల్వంతో అలంకరిస్తారు ఇలా సర్వాంగ సుందరంగా తయారైన అన్నలింగానికి విశేష పూజ జరుగుతుంది

మొదట శివ సహస్ర నామావళితో అర్చన జరిగిన తర్వాత ప్రత్యేకంగా పొంగలి, పెరుగన్నం నివేదింపబడతాయి

అనంతరం డమరుక, భేరీ, మృదంగాలు, శంఖాలు, తాళాలు మున్నగు పంచవాద్య సమ్మేళనంతో కూడిన మంగళ వాద్య ధ్వనులతో ఘనంగా మహా దీపారాధన జరుగుతుంది. పిదప మంత్ర పుష్ప సమర్పణ, స్వస్తివాచనం జరిగిన తర్వాత భక్తులందరికి సర్వదర్శనం ఏర్పాటు చేయబడుతుంది.

ఈ అన్నాభిషేక సర్వదర్శనం సుమారు మూడుగంటల పాటు అనగా మధ్యాహ్నం 3 గంటల నుండి 6 గంటల వరకు ఉంటుంది

సర్వదర్శనానంతరం టెంకాయలు కొట్టి కర్పూర హారతిని ఇచ్చిన తర్వాత శ్రీ కపిలేశ్వర లింగంపై ఏర్పాటు చేసిన అన్న శివలింగాన్ని మాత్రం ఉద్వాసన చేసి ఊరేగింపుగా బాజా భజంత్రీలతో వేదపారాయణలతో కపిలతీర్థ పుష్కరిణి (కోనేటి) దరికి వచ్చి, అక్కడ అష్ట మంత్ర పుష్ప సమర్పణలతో, ఆ అన్న లింగానికి అర్చన చేసి కర్పూర హారతులయిన అనంతరం ఆ లింగాన్ని కోనేటి జలాల్లో నిమజ్జనం చేస్తారు. ఇంతటితో కపిలేశ్వరస్వామివారి అన్నాభిషేక మహోత్సవం పూర్తి అవుతుంది అటు పిమ్మట గర్భాలయంలో శివలింగంపై మిగిలి వున్న అన్నాన్ని అంతా ప్రక్కకు తీసి, ఆ అన్నాన్ని పులుసు కూరలతో కలిపి భక్తులకు ప్రసాదంగా పంచడం జరుగుతుంది

ఈ అన్నాభిషేకోత్సవం మాధ్యాహ్నిక విశేష పూజగా ఒక కపిలేశ్వరస్వామివారి మహాలింగానికి మాత్రమే జరుపబడుతుంది

అన్నాన్ని పూర్తిగా తీసివేసిన తరువాత శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారలకు ప్రతిరోజు జరిగే ప్రదోషకాల పూజ – అనగా సాయంకాల నిత్య అభిషేక సహస్ర నామార్చనలు, నివేదనలు సంధ్యాకాల హారతులు యథాప్రకారం జరుగుతవి

సంవత్సరానికి ఒక్కమారు జరిగే ఈ అన్నాభిషేక మహోత్సవంలో పాల్గొని అన్నలింగ దర్శనం చేసినట్లయితే సమస్త గ్రహ దోషాలు, పూర్వజన్మ సంచిత పాపాలు తొలగి పుణ్యం కలుగుతుందని, భక్తుల దృఢమైన విశ్వాసం. ''అన్నం పరబ్రహ్మ స్వరూపం'' అన్న నానుడి ననుసరించి సాక్షాత్తు పరబ్రహ్మమైన శ్రీ కపిలేశ్వరుని అన్నంతో అభిషేకించి, అర్చించి ఆ అన్నాన్ని ప్రసాదంగా పంచడంలో సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు అన్నగత ప్రాణులైన సర్వజీవుల్లోను వున్నాడనీ, అన్నంతోనే సమస్త భూతరాసులు మనగలుగుతున్నాయన్న సత్యం విదితమవుతున్నది. అందువల్లే భూత తృప్తి కోసం అన్నదానం విధిగా చేయవలెననే సందేశాన్ని అన్నాభిషేకోత్సవం లోకానికి ప్రబోధిస్తూ వుంది.

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## కార్తీక దీపోత్సవం

ప్రతి సంవత్సరం కార్తీక మాసంలో కృత్తికా నక్షత్రం వున్న రోజున ప్రదోష వేళలో శ్రీ కపిలేశ్వర స్వామి సన్నిధిలో కృత్తికా దీపోత్సవం మహా వైభవంగా జరుపబడుతుంది. ఈ నక్షత్రం కార్తిక పౌర్ణమి రోజే రావచ్చును లేదా మరునాడు రావచ్చును ప్రదోష కాలంలో కృత్తికా నక్షత్రం ఉండడమే ప్రధానంగా నిర్ణయించి ఈ దీపోత్సవం జరుపబడుతున్నది ఉదయం సుప్రభాతం మొదలుకొని మధ్యాహ్న వేళవరకు అన్ని పూజా విధులు నివేదనలు జరుపబడుతవి ఆ తర్వాత సాయంత్రం శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారలకు అభిషేకాదులు, సహస్ర నామార్చనలు మహా నివేదనలు పూర్తి చేస్తారు పిదప ప్రదోషకాల పూజా సందర్భంలో పంచవాద్య మహానాద సమ్మేళన పూర్వకంగా మహా మంగళహారతి ఈ విధంగా నిర్వహింపబడుతుంది

పరిచారకులు మొదట శ్రీ కపిలేశ్వరస్వామి గర్భాలయం ముఖద్వారం వద్ద రెండడుగుల ఎత్తు, నాలుగు అడుగుల పొడవుగల పీఠంమీద ప్రదోష వేళలో మంగళహారతి కోసం ఉపయోగించే వివిధ హారతి సెమ్మెలను నువ్వుల నూనెతో తడిపిన వత్తులతో కూడ ఏర్పాటుచేసి సిద్ధంగా వుంచుతారు

**ప్రాద్యాం తత్పురుషం విద్యా, దఘోరం దక్షిణాముఖం**
**సద్యోజాతం ప్రతీద్యాం తు, వామదేవ ముద జ్ముఖం**
**ఈశాన మూర్ధ్వ వక్త్రం స్యా, ఛ్ఛంభోః, పంచముఖక్రమం**

అని వేద మంత్రంలో చెప్పబడినట్లుగా ప్రతిదినం ప్రదోష వేళలో శ్రీ కపిలేశ్వర మహాలింగము యొక్క ఐదు ముఖాలైన ఈశానమూర్తి (ఊర్ధ్వం), సద్యోజాతమూర్తి (పశ్చిమం), తత్పురుష మూర్తి (తూర్పు), అఘోరమూర్తి (దక్షిణం), వామదేవమూర్తి (ఉత్తరం) అనే పేర్లతో విరాజిల్లే పంచ బ్రహ్మలకు మంగళహారతి ఇవ్వటానికి ఐదు వెండి పళ్లేలను ఉపయోగిస్తారు

కాని కృత్తికా దీపోత్సవం రోజున మాత్రం వెండి పళ్లేలకు బదులు పెద్దవిగావున్న కొత్త మూకుళ్లను ఉపయోగిస్తారు ఈ పెద్ద మూకుళ్లలో నిండుగా నువ్వుల నూనె పోసి, వత్తులను వెలిగిస్తారు మొదట ఈ మూకుళ్ల జ్యోతులకు ధూపదీప హారతులిచ్చిన అనంతరం పరిచారకులు ఒక్కొక్క మూకుడు క్రమంగా అందిస్తూ వుండగా అర్చకస్వామి స్వీకరించి ఆ జ్యోతితో శ్రీ కపిలేశ్వరస్వామివారికి

నయనానందకరంగా ఒకటి తర్వాత మరొకటిగా హారతి ఇస్తారు ఇలా ఐదు మూకుళ్ల జ్యోతులతో హారతులు సమర్పించిన తదుపరి వెండి రథ హారతి, నక్షత్ర హారతి, పూర్ణకుంభ హారతులను ఇచ్చిన తర్వాత ఛత్ర చామరాది సంప్రదాయానుగుణంగా ఉపచారాలు సమర్పిస్తారు. ఈ మంగళహారతులు జరుగుతున్న సమయంలో భేరులు తాళాలు, శంఖాలు, ఢమరుకం, భజంత్రీలు మున్నగు పంచవాద్యాలు మోగిస్తారు అనంతరం శ్రీ కపిలేశ్వరస్వామివారికి వేదపండితులు మంత్ర పుష్ప సమర్పణ చేసి శ్రావ్యంగా శాతి సూక్తాలను పఠిస్తారు పిదప పంచహారతిని ఘనంగా ఇస్తారు

ఆ తర్వాత అర్చకస్వాములు శ్రీ కామాక్షీ అమ్మవారి సన్నిధిలో కూడ శ్రీ స్వామివారికి వలెనే అంబిక (ఊర్ధ్వం) గణాంబిక (తూర్పు), గంగ (దక్షిణం), గౌరి (ఉత్తరం), ఉమ (పశ్చిమం) ఈ పంచ దేవేరులకు ఐదు కొత్త మూకుళ్ల జ్యోతులతో హారతులను, నక్షత్ర హారతులను పూర్ణ కుంభహారతిని, ఛత్ర చామర ఉపచారాలను, వాద్యాలు మోగుతుండగా సమర్పిస్తారు చివరగా మంత్రపుష్ప సమర్పణ కూడా జరుగుతుంది

అలాగే పరివార దేవతా మండపంలో వున్న శ్రీ వల్లీ దేవసేనా సమేతుడైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని వద్ద కూడ ఐదు పెద్ద మూకుళ్ల జ్యోతులు, నక్షత్ర హారతులు పూర్ణ కుంభ హారతులతో పాటు ఛత్ర చామరాది ఉపచారాలు సమర్పింపబడుతవి

ఇలా శ్రీ కపిలేశ్వరుని సన్నిధిలోను, శ్రీ కామాక్షీ అమ్మవారి సన్నిధిలోను, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధిలోను హారతులు పూర్తి అయిన తరువాత, అర్చకస్వాములు తొలుత శ్రీ కపిలేశ్వరస్వామివారి సన్నిధిలో వెలిగించిన ఐదు మూకుళ్ల జ్యోతులను స్వీకరించి బాజా భజంత్రీలతో వేదగానంతో ఆలయ మహాప్రదక్షిణం చేస్తూ ధ్వజస్తంభ మండపంలోని శ్రీ సిద్ధి వినాయకస్వామి సన్నిధిలో ఒక జ్యోతిని, బలిపీఠంపైన రెండవ జ్యోతిని, ముఖ మండపంలో నందీశ్వరుని వద్ద మూడవ జ్యోతిని, శ్రీ కపిలేశ్వరుని సన్నిధిలో నాల్గవ జ్యోతిని ప్రదక్షిణ మార్గంలో సోమసూత్రం దగ్గర ఉన్న శ్రీ చండికేశుని వద్ద మిగిలిన ఐదవ జ్యోతిని ఉంచుతారు

పిదప శ్రీ కామాక్షీ దేవికి సమర్పించిన ఐదు మూకుళ్ల జ్యోతులతో అమ్మవారి సన్నిధిలో మొదటి జ్యోతిని, ఎదురుగా సింహవాహనం వద్ద రెండవ

జ్యోతిని, పరివార దేవతా మండపంలో శ్రీ దక్షిణా మూర్తి వద్ద మూడవ జ్యోతిని, ఏకాంతసేవమండపం అని పిలువబడే ప్రతిమామండపంలో సోమస్కంద మూర్తి వద్ద నాల్గవ జ్యోతిని, నవగ్రహదేవతల వేదికవద్ద ఐదవ జ్యోతిని ఉంచుతారు

ఆ తరువాత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరునకు సమర్పించిన ఐదు మూకుళ్ల జ్యోతులతో, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధిలో మొదటి జ్యోతిని, ఆలయం పైభాగాన శ్రీ కపిలేశ్వరుని గర్భాలయం శిఖరంపైన రెండవ జ్యోతిని, శ్రీ కామాక్షమ్మవారి ఆలయ శిఖరంపై మూడవ జ్యోతిని, ధ్వజస్తంభం పతాకం పైన నాల్గవ జ్యోతిని, ఆలయం ముఖ మండపం పైభాగాన వున్న వృషభ వాహనుడైన శ్రీ ఉమామహేశ్వరుల వద్ద ఐదవజ్యోతిని ఉంచుతారు

ఈ జ్యోతులు ఆయా చోట్ల అమరుస్తూ వున్న సమయంలో మంగళవాద్యాలు, వేదగానాలు వరుసగా శ్రవణ పేయంగా సాగుతూనే వుంటాయి

## కార్తీకదీపం (ఆకాశదీపం)

శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం పైభాగాన శిఖరాల వద్ద అర్చకస్వాములు జ్యోతులను అమరుస్తూ వున్న సమయంలోనే, ఆ దీప జ్యోతులను దర్శించుకొని, సరిగ్గా అదే వేళకు కపిలేశ్వరుని ఆలయాన్ని అనుకొని వున్న కొండపై భాగాన ఏర్పాటు చేసి వున్న పెద్ద గూటిలో తిరుపతి పట్టణవాసులైన గాండ్ల (తెలిక) కులస్థులు అఖండ జ్యోతిని వెలిగిస్తారు పెద్ద కుండను సగంభాగం, సున్నితంగా పగులగొట్టి పైభాగాన్ని (మూతిగల భాగాన్ని) పీఠంగా ఏర్పరచి, దానిలో ప్రమిదలాంటి కుండను పెట్టి, దానిలో సుమారు 20 కిలోల నువ్వులనూనెను పోసి, చేతి మణికట్టు అంతటి లావుగల నూలదారపు పుంజాన్ని వత్తిగా వేసి జ్యోతిని వెలిగించిన తర్వాత భక్తి ప్రపత్తులతో పండ్లు టెంకాయ నివేదనలను సమర్పించి ఆ జ్యోతికి హారతులు ఇచ్చి పూజిస్తారు

తిరుమల తిరుపతి దేవస్థానం వారికి గాని, శ్రీ కపిలేశ్వర క్షేత్రానికి గాని, ఏ మాత్రం ప్రమేయం లేకుండా అత్యంత భక్తి ప్రపత్తులతో, నియమ నిష్ఠలతో తిరుపతి గ్రామస్థులైన గాండ్ల కులస్థులు స్వతంత్రంగా సుమారు నూరేండ్ల నుండి, అనగా తిరుమల తిరుపతి దేవస్థానం మహంతుల పరిపాలన క్రింద వున్నప్పటి నుంచి శ్రీ కపిలేశ్వర క్షేత్రం పై భాగంలో కొండశిఖరం మీద కార్తీక

దీపాన్ని వెలిగిస్తున్నట్లు తెలియవస్తున్నది. కార్తీక దీపోత్సవ సమయంలో కొండకోనపై తెలిక భక్తులు వెలిగించిన అఖండజ్యోతి ఆ రాత్రి వేళ తిరుపతి పట్టణ వాసులకు మాత్రమే గాక చుట్టు ప్రక్కగ్రామాలవారికికూడ దర్శనమిస్తూ, శ్రీ కపిలేశ్వరస్వామి సన్నిధిలో జరుగుతున్న కార్తీక కృత్తికా దీపోత్సవాన్ని ఈ నాటికీ ఎల్లరచే స్మరింపజేస్తూ వున్నది.

అర్చకస్వాములు ఆలయశిఖరంపైన జ్యోతులను వుంచిన తరువాత, వాహన మండపం నుండి భజంత్రీ మంగళవాద్య పురస్సరంగా, వేద పారాయణలతో ఛత్రచామర మర్యాదలతో శ్రీ కామాక్షి కపిలేశ్వరస్వామివారల ఉత్సవ మూర్తులయిన శ్రీ చంద్ర శేఖరస్వామి శ్రీ మనోన్మణి అమ్మవారలను ఒకే పల్లకిపై అధిష్ఠింపజేసి, కపిలతీర్థం మండపం వద్దకు ఊరేగింపుగా తీసికొనివస్తారు ఆ మండపంలోనికి వేంచేసిన శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలకు పండ్లు, కాయ కర్పూర నివేదనలు సమర్పిస్తారు తదుపరి అర్చకులు అచట ఎట్టఎదుట దర్భలతో ఏర్పాటు గావించిన ''జ్వాలా తోరణము''ను శ్రీ స్వామివారికి ఇచ్చిన హారతితో వెలిగింపజేస్తారు అర్చకులు వెలిగించిన ''జ్వాలాతోరణం'' అనంతమైన వింత వింత తేజస్సులతో దర్శనమిస్తూ, భక్తులను మైమరుపిస్తుంది. ఆ 'జ్వాలాతోరణం' అగ్ని జ్వాలలతో వెలుగుతూ పూర్తిగా శాంతించిన అనంతరం అందలి 'భస్మరక్ష'ను అర్చకులు ముందుగా శ్రీ స్వామివారికి అమ్మవారికి నుదుట అలంకరించిన తరువాత తాము ధరిస్తారు పిదప ఆ భస్మరక్షను అచట చేరిన భక్తులందరకూ ఆది దంపతులయిన శ్రీ కామాక్షి కపిలేశ్వరుల ప్రసాదంగా ఇవ్వబడుతుంది

తదుపరి శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలు ఆలయంలో ప్రవేశించడంతో కృత్తికా దీపోత్సవం మంగళప్రదంగా పరిసమాప్త మవుతుంది

కృత్తికా దీపోత్సవంలో పాల్గొన్న భక్తులందరకు విశేషంగా చక్కెరపొంగలి, పులిహోర, పాయసం మున్నగు ప్రసాదాలు వితరణ చేయబడతాయి

ఈ కార్తిక కృత్తికా దీపోత్సవంనాడు విశేషంగా వేలాదిమంది భక్తులు శ్రీ కపిలేశ్వర క్షేత్రాన్ని సందర్శిస్తారు. అంతేకాదు పుణ్యస్త్రీలు, కన్యలు, పూర్వ సువాసినులు.... ఇలా అందరూ కృత్తికా దీపోత్సవం నాడు శ్రీ కపిలేశ్వర ఆలయంలో తమకు నచ్చిన చోట తమకు తోచిన సంఖ్యలో ప్రమిదలు వెలిగిస్తారు.

ముఖ్యంగా శ్రీ కపిలేశ్వరస్వామివారి కల్యాణమండపంలో దేవస్థానం సిబ్బంది చేత పానవట్టంతో కూడిన శివలింగాకారంలో త్రిశూలాకారంలోను, చిత్రం గీసి, ప్రమిద జ్యోతులు వెలిగిస్తారు శివుడు లింగరూపంలో సాక్షాత్తు జ్యోతి-స్స్వరూపుడుగా దర్శనమిచ్చి భక్తులను ఆనందింపజేస్తాడు ఇలా సర్వేసర్వత్ర జ్యోతులతో వెలుగుతున్న కపిలేశ్వర క్షేత్రం కార్తీక దీపోత్సవంనాడు వేయి వెలుగులతో ప్రకాశిస్తూ మైమరపిస్తుంది

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## తెప్పోత్సవాలు

శ్రీ కామాక్షీ సమేత శ్రీ కపిలేశ్వరస్వామివారలకు ప్రతి సంవత్సరం మార్గశిరమాసం పౌర్ణమినాటికి పూర్తి అగునట్లుగా మూడు రోజులపాటు కపిలతీర్థ పుష్కరిణిలో ప్రతిరోజు ప్రదోష వేళలో తెప్పోత్సవాలు జరుగుతవి

ఈ తెప్పోత్సవాల కోసం కపిలతీర్థ పుష్కరిణిలో విద్యుద్దీపాలతోను, మామిడాకు తోరణాలతో అరటి స్తంభలతో అలంకరించి తెప్పను ఏర్పాటు చేస్తారు అంతేగాక, కపిలతీర్థ ప్రవేశద్వారంలోను, ఆలయంలోను, పుష్కరిణిని, రంగురంగుల విద్యుద్దీపాలతో శోభాయమానంగా అలంకరిస్తారు

మార్గశిర శుద్ధ త్రయోదశినాడు సాయంవేళ శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయంలో ప్రదోషకాల అభిషేక అర్చన నివేదన మంగళ హారతులు పూర్తి అయిన తర్వాత, ప్రతిమా మండపంలో వున్న శ్రీ విఘ్నేశ్వరస్వామివారిని, శ్రీ చంద్రశేఖరస్వామి, మనోన్మణి అమ్మవార్ల ఉత్సవమూర్తులను వాహన మండపానికి వేంచేపు చేయించి అలంకరిస్తారు

వాహన మండపం నుండి పుష్కరిణి వరకు, ఒక పల్లకిపై శ్రీ విఘ్నేశ్వర స్వామివారిని, మరొక పల్లకీపై శ్రీ చంద్రశేఖరస్వామి, మనోన్మణి అమ్మవారిని వేంచేపుచేసి, బాజా భజంత్రీలతో వేద పారాయణలతో ఛత్రచామరాది సార్వభౌమ ఉపచారాలతో ఊరేగింపుగా తరలివస్తారు అక్కడ అర్చకస్వామి తెప్పపై లఘువుగా సంప్రోక్షణతో శుద్ధి చేసిన తర్వాత శ్రీ విఘ్నేశ్వరస్వామివారిని,

శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలను తెప్పపై వేంచేపు చేయించి, తెప్పోత్సవాన్ని నిర్వహిస్తారు

వేదపండితులు, వేదమంత్రాలు శ్రుతి శుభగంగా పఠిస్తుండగా, మంగళ వాయిద్యాలు మ్రోగుతుండగా, భక్తిరస భరితమైన సంగీతం ఆనందపరవశుల్ని చేస్తున్న తరుణంలో కపిలతీర్థ పుష్కరిణిలో తెప్పపై శ్రీ స్వామివారలకు మూడు ప్రదక్షిణలు నిర్వహిస్తారు మూడు ప్రదక్షిణాల అనంతరం కొబ్బరికాయ కొట్టి పండ్లు నివేదన చేసి, మంగళహారతిని ఇస్తారు ఈ తెప్పోత్సవాలను, నలువైపులా కోనేటి మెట్లపై కూర్చొని వున్న భక్తాదులు అనేకులు తిలకిస్తారు అనంతరం శ్రీ స్వామివారలు ఆలయంలో ప్రవేశించడంతో మొదటిరోజు తెప్పోత్సవం పూర్తి అవుతుంది

మొదటి రోజు వలెనే రెండవరోజున అనగా మార్గశిర శుద్ధ చతుర్దశి నాటి సాయంకాలం ఆరాధన నివేదన మంగళ హారతులు అయిన తర్వాత శ్రీ వల్లీ దేవసేనా సమేతుడైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారికి తెప్పోత్సవం జరుగుతుంది కపిలతీర్థ పుష్కరిణిలో రెండవ రోజున తెప్పపై ఐదు ప్రదక్షిణలు నిర్వహిస్తారు అనంతరం నివేదన కర్పూర హారతుల అనంతరం శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయం ప్రవేశించడంతో రెండవ రోజున తెప్పోత్సవం పూర్తి అవుతుంది

మొదటి రెండు రోజున మాదిరే మూడవ రోజున అనగా మార్గశిర పౌర్ణమి నాటి సాయంత్రం ప్రదోషకాల సమయ మహా మంగళహారతులయిన తర్వాత వాహన మండపంలో పుష్పమాలలతో ఆభరణాలతో చక్కగా అలంకరింపబడిన శ్రీ సోమాస్కందమూర్తి ఒక పల్లకిమీద, చక్కగా అలంకరింపబడిన శ్రీ కామాక్షీ దేవి ఉత్సవమూర్తి మరొక పల్లకిమీద వేంచేపు చేసి, ఊరేగింపుగా కపిలతీర్థ పుష్కరిణి వరకు తరలించుకొని వెళ్లి తెప్పపై కొలువుచేయిస్తారు మూడవ రోజున ఈ స్వామివారలకు పుష్కరిణిలో చుట్టూ ఏడు ప్రదక్షిణలు జరిపిన తరువాత నివేదన మంగళ హారతులు సమర్పిస్తారు పిదప శ్రీ స్వామివారు యథా ప్రకారంగా ఆలయంలో ప్రవేశించడంతో మూడు రోజుల పాటు నిర్వహించబడే వార్షిక తెప్పోత్సవాలు ఘనంగా పరిసమాప్తమవుతాయి

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★★★★

## ఆర్ద్రా దర్శనోత్సవం

ప్రతి సంవత్సరం మార్గశిరమాసంలో శుద్ధ త్రయోదశి నుంచి పౌర్ణమి వరకు కపిలతీర్థ పుష్కరిణిలో తెప్పోత్సవాలు జరుగుతాయి ఇవిగాక

ఈ పౌర్ణమి నాటి ఉషోదయాన ఆర్ద్రా నక్షత్రం కూడి వున్న రోజున కపిలతీర్థ క్షేత్రంలో ''ఆర్ద్రా నక్షత్ర దర్శనోత్సవం'' అనే ప్రత్యేక ఉత్సవం జరుగుతుంది ఆర్ద్రా నక్షత్రం శివుని అవతరణ నక్షత్రమే గాక, శివాంశ సంభూతుడైన మాణిక్యవాచకర్ జన్మనక్షత్రం కూడా కావడం విశేషం! ఆర్ద్రా నక్షత్రం కూడిన మార్గశిర పౌర్ణమి నాటి ఉషః కాలంలో శ్రీ నటరాజస్వామివారికి, శ్రీ శివకామసుందరి అమ్మవారి ఉత్సవమూర్తులకు, శ్రీ మాణిక్యవాచకర్ స్వామి ఉత్సవమూర్తికి అభిషేక, అలంకార, అర్చన, నివేదనాదులు పూర్తి అయిన తర్వాత ఈ ఉత్సవమూర్తులను వాహనమండపానికి తరలిస్తారు

అక్కడ శ్రీ నటరాజస్వామి, శ్రీ శివకామసుందరి అమ్మవారలను ఒక పల్లకిపై, మాణిక్యవాచకర్ స్వామిని మరొక పల్లకిపై వేంచేపు చేసి చక్కగ అభరణాలతో పుష్పమాలలతో అలంకరించిన తర్వాత తిరుపతి పురవీధుల్లో గ్రామోత్సవం జరుగుతుంది అరువది ముగ్గురు శివభక్తులలో సుప్రసిద్ధుడైన మాణిక్యవాచకర్స్వామిని ఉద్దేశించి నిర్వహింపబడే ఈ ''ఆర్ద్రా దర్శనోత్సవం'' రోజున మాత్రమే శ్రీ నటరాజస్వామి, శ్రీ శివకామసుందరి అమ్మవారలతో పాటు శ్రీ మాణిక్యవాచకర్స్వామి ఊరేగింపుగా బయటికి తరలివస్తారు

*ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!*

★ ★ ★ ★

## శ్రీ కామాక్షి అమ్మవారి చందనాలంకారం

శ్రీ కపిలేశ్వర క్షేత్రంలో సౌరమానం ప్రకారం ప్రతి సంవత్సరం మకర మాసంలోని పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారం నాడు - అనగా చాంద్రమానాన్ని అనుసరించి 'పుష్యమాసం' (తమిళుల తైనెల) లో శ్రీ కామాక్షి అమ్మవారికి చందనాలంకారసేవ జరుపడుతుంది. ఈ చందనాలంకార సేవ శ్రీ కామాక్షి అమ్మవారి మూలమూర్తికి మాత్రమే జరిగే వార్షికమైన విశిష్టసేవ

ప్రతి సంవత్సరం పుష్యమాస పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు ఉదయం నుండి సాయంకాలం వరకు యథారీతిగా ఆలయంలో అభిషేక అర్చన నివేదనాదులన్నీ జరపబడుతాయి

ఆనాటి సాయంకాలం శ్రీ కపిలేశ్వరస్వామివారి, శ్రీ కామాక్షీ అమ్మవారి మూలమూర్తులకు ఒకే వేళలో పాలు, పెరుగు, తేనె, చందనం, పన్నీరు మున్నగు సుగంధ ద్రవ్యాలతో అభిషేకం జరుగుతుంది ఇందులో శ్రీ కపిలేశ్వరస్వామివారి మహాలింగానికి జరిగే అభిషేకం మాత్రమే భక్తులుతిలకించవచ్చు శ్రీ కామాక్షీ అమ్మవారి మూలమూర్తికి ఏకాంతంగా జరుపబడే అభిషేకాన్ని ఎవ్వరూ చూడడానికి వీలుండదు అభిషేకం జరిగిన తర్వాత తెరలవమాటుల అర్చకస్వాములు శ్రీ కపిలేశ్వరస్వామివారిని అలంకరిస్తారు

చందనాలంకార సేవ జరిగే సాయంకాలం మాత్రం అమ్మవారికి అభిషేకం అయిన తర్వాత అమ్మవారి మూలమూర్తిని శిరసాది పాదాంతం బాగా తుడుస్తారు

పిదప చందనం, పచ్చకర్పూరం, కుంకుమపువ్వు, పన్నీటితో తయారుచేసిన చందనపు మిశ్రణాన్ని (చందనపు ముద్ద) శ్రీ కామాక్షీ అమ్మవారి మూలమూర్తి కిరీటం మొదలు పాదాలవరకు పూర్తిగా అలదుతూ అలంకరిస్తారు ఈ చందనపు ముద్దను పాదాలకు, అభయ వరదహస్తాలకు, కిరీటానికి అలదిన తర్వాత అమ్మవారికి రవికగా, పట్టుచీరగా కూడా తీర్చిదిద్దుతారు రవికకు, చీరకు అంచులుగా చందనం మీద సరిగను అతికిస్తూ చక్కగా తీర్చిదిద్దడం జరుగుతుంది

పూర్తిగా చందనంతోనే అలంకరింపబడిన ఈ అలంకారం అమ్మవారికి పట్టురవికను, పట్టుచీరను అలంకరించినట్లుగానే భాసిస్తూ వుంటుంది అందువల్ల ఈ చందనాలంకారం భక్తులను విశిష్టంగా ఆకర్షిస్తూ అలరిస్తుంటుంది.

అలాగే అమ్మవారి ముఖార విందానికి కూడా పూర్తిగా ముక్కు చెవులు, కన్నులకు కూడా చందనాన్ని అద్దుతూ చక్కగా చందనాన్ని అలంకరిస్తారు చెవులకు బంగారు కర్ణాభరణాలను, ముక్కుకు నాసాభరణాన్ని (ముక్కుపుడక) అలంకరించిన తర్వాత అమ్మవారి ముఖంపై అద్దిన చందనాన్ని మెల్లగా తొలగిస్తూ కన్నులు, కనురెప్పలు, కనుబొమ్మలు అందంగా కనబడేట్లుగా సొంపుతో తీర్చిదిద్దుతారు.

ఇలా అమ్మవారి మూర్తిని కేవలం చందనంతోనే ఆపాద మస్తకం (మకుటం) అలంకరించిన తర్వాత వజ్ర వైడూర్యాలు పొదిగిన కంఠాభరణాలను, కమ్మలను, ముక్కుపుడకను, నొసటి తిలకాభరణాన్ని ధరింపజేసిన తర్వాత పుష్పమాలలతో కూడ అమ్మవారి దివ్యమూర్తిని మిగుల శోభాయమానంగా అలంకరిస్తారు

అనంతరం సాయంకాల అర్చన ప్రారంభమవుతుంది ముందుగా శ్రీ కపిలేశ్వరస్వామివారికి శివసహస్ర నామాలతో, బిల్వదళాలతో పుష్పాలతో అర్చన జరిగిన పిదప, చందనాలంకారంతో ప్రకాశిస్తూ వున్న కామాక్షీ అమ్మవారికి శ్రీ లలితా సహస్ర నామాలతో కుంకుమార్చన జరుగుతుంది అర్చనానంతరం ప్రతిరోజూ జరిగే నివేదనతోపాటు చందనాలంకారంలో భాసిస్తూ వున్న అమ్మవారికి ప్రత్యేకంగా చక్కెర పొంగలి నివేదింపబడుతుంది

నివేదనానంతరం ప్రదోష సమయంలో శంఖం, డమరుకం, భేరీలు, తాళాలు, భజంత్రీలు – ఇలా పంచవాద్య సమ్మేళనంతో రథ హారతి, నక్షత్రహారతి, పంచహారతి, పూర్ణ కుంభ హారతులతో మహామంగళహారతి వైభవంగా, శ్రవణ నయనానందకరంగా నిర్వహింపబడుతుంది దివ్యదర్శనానంతరం భక్తులందరికీ ప్రసాద వితరణ జరుగుతుంది కామాక్షీ అమ్మవారు ఆనాటి రాత్రి సమయంలో పూర్తిగా ఈ చందనాలంకారంలోనే వుంటారు ఏకాంత సేవానంతరం ఆలయాన్ని మూసివేస్తారు

మరునాడు సుప్రభాతానంతరం అమ్మవారికి అలదియుంచిన చందనాన్ని ప్రత్యేకంగా సేకరిస్తారు ఆ పవిత్ర చందనం భక్తాదులకు ప్రసాదంగా ఇవ్వబడుతుంది. ఆ చందనాన్ని భక్తులు తమ నొసట తిలకంగా ధరిస్తారు

సంవత్సరానికి ఒకమారు పుష్యమాసం పున్నమకు ముందువచ్చే శుక్రవారంనాడు శ్రీ కామాక్షీ అమ్మవారికి లోకక్షేమం కోసం జరిగే చందనాలంకార సేవను దర్శించే ఆయా భక్తులకు తాపజ్వరాది బాధలు తొలగుతాయని సుఖశాంతులు సంప్రాప్తిస్తాయని భక్తుల అనుభవ పూర్వకమైన పరమ విశ్వాసం

***ఓంకార పంజర శుకీం***
***ఉపనిషదుద్యాన కలకంఠీమ్***
***ఆగమ విపిన మయూరీం ఆర్యాం***
***అంత ర్విభావయే గౌరీమ్.***
***ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!!***

★ ★ ★ ★

## కపిలేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు

ప్రతి సంవత్సరం మాఘమాసంలో మహాశివరాత్రి పర్వదిన సందర్భంగా, శ్రీ కామాక్షీ సమేతంగా శ్రీ కపిలేశ్వరస్వామివారికి ఐదురోజులపాటు శైవాగమ శాస్త్రోక్తంగా ప్రకారంగా బ్రహ్మోత్సవాలు జరుపబడుతున్నాయి

మహాశివరాత్రి పండుగకు ఒక రోజు ముందుగా ధ్వజారోహణంతో ప్రారంభమైన శ్రీ కపిలేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవ వేడుకలు మహాశివరాత్రికి తర్వాత మూడు రోజులపాటు కొనసాగుతాయి ధ్వజారోహణ జరిగే రోజుకు ముందునాటి సాయంత్రం శ్రీ వినాయకస్వామి ఆధ్వర్యంలో మృత్సంగ్రహణ యాత్ర తదుపరి బ్రహ్మోత్సవాలకు అంకురార్పణ జరుగుతుంది

ధ్వజారోహణ జరిగే రోజున అనగా మహాశివరాత్రి ముందురోజు యథావిధిగా సుప్రభాతాది ప్రాతః కాల ఆలయ కార్యక్రమాలు పూర్తి అయిన తర్వాత శ్రీ సిద్ధి వినాయకస్వామివారికి శ్రీ కపిలేశ్వరస్వామివారికి శ్రీ కామాక్షీ అమ్మవారికి ఇంకా ఇతర ప్రధాన, పరివార దేవతా మూర్తులన్నింటికి అభిషేకార్చనలు అలంకారాలు పూర్తి అయిన తరువాత ఉదయకాల నివేదనలు కూడా జరుపబడుతవి

పిదప అర్చకస్వాములు ఆలయం ఎదురుగా ఉన్న ధ్వజస్తంభంపై సుముహూర్తంలో వృషభధ్వజపటాన్ని శైవాగమ శాస్త్రోక్తంగా ఎగురవేసి, భేరీమృదంగాది వాయిద్య శబ్దాల మధ్య, వేద పండితులు మంత్రాలను పఠిస్తుండగా, శ్రీ కపిలేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలకు, బ్రహ్మ, విష్ణువులతోపాటు, ఇంద్ర, అగ్ని, యమ, నిర్పతి, వరుణ, వాయు కుబేరాది దిక్పాలురను, సకల యక్ష గంధర్వ కిన్నర కింపురుషులను, మానవులను ఆహ్వానిస్తూ ఉత్సవాలను ప్రారంభిస్తారు

ధ్వజారోహణ కార్యక్రమం నిర్విఘ్నంగా వైభవంగా జరిపిన తరువాత ఘనంగా ఆలయంలోని అందరు మూర్తులకు మధ్యాహ్నకాల నివేదనలు జరుపబడుతవి.

ఆ తర్వాత మధ్యాహ్నకాలపు అభిషేక సహస్రనామార్చనలు, ప్రదోషకాల దీపారాధనలు వరుసగా జరుగుతవి. ఆ సాయంత్రం 7 గంటలకు శ్రీ కపిలేశ్వరస్వామివారి ప్రధాన ఉత్సవమూర్తి అయిన శ్రీ సోమాస్కందమూర్తికి చంద్రప్రభ వాహనంపై ఊరేగింపు జరుగుతుంది. పక్కనే మరోపల్లకిపై

శ్రీ కామాక్షీదేవి వేంచేసి సోమాస్కందమూర్తితోపాటు ఉత్సవంలో పాల్గొంటుంది తిరుపతి పురవీధుల్లో ఊరేగింపు జరిగిన అనంతరం ఆలయంలో ప్రవేశించడంతో తొలినాటి బ్రహ్మోత్సవం పూర్తి అవుతుంది

రెండవరోజు మహాశివరాత్రి పర్వదినం. ఈ రోజు కూడా యధాక్రమంగా సుప్రభాతం మొదలుకొని అన్ని కార్యక్రమాలు జరుగుతవి ఉదయం 9 గంటల సమయంలో శ్రీ కామాక్షీ కపిలేశ్వరుల ఉత్సవమూర్తులైన శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలకు స్నపన తిరుమంజనం వైభవంగా జరుగుతుంది సాయంత్రం ప్రదోషకాల పూజానంతరం 6 గంటలకు శ్రీచంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలు వెండి నంది వాహనారూఢులై తిరుపతి పురవీధుల్లో కన్నులపండువుగా దర్శనమిస్తూ మహాశివరాత్రి పర్వదినం నాడు భక్తులందరినీ అనుగ్రహిస్తారు

మూడవరోజు ఉదయం 9 గంటలకు శ్రీ సోమాస్కందమూర్తికి, శ్రీ కామాక్షీ అమ్మవారికి స్నపన తిరుమంజనం జరుపబడుతుంది ఈ రోజు సాయంత్రం విశేషంగా కల్యాణోత్సవం జరుగుతుంది శ్రీ సోమాస్కందమూర్తికి, శ్రీ కామాక్షీ అమ్మవారికి జగత్కల్యాణం కొరకు అంగరంగ వైభవంగా జరిగే కల్యాణోత్సవంలో భక్తులు కూడా పాల్గొనవచ్చు పిదప ఆ రాత్రి శ్రీ సోమాస్కందమూర్తి గజవాహనంపైన, శ్రీ కామాక్షీదేవి మరొక పల్లకిపైన తిరుపతి పురవీధుల్లో సంచరిస్తూ భక్తులందరినీ తమ కటాక్ష వీక్షణాలతో అనుగ్రహిస్తారు

నాల్గవరోజు కూడ ఉదయం 9 గంటల సమయంలో శ్రీ సోమాస్కందమూర్తికి, శ్రీ కామాక్షీ అమ్మవారికి స్నపన తిరుమంజనం జరుగుతుంది శ్రీ రాత్రి శ్రీ సోమాస్కందమూర్తికి పెద్దశేష వాహనంపైన, శ్రీ కామాక్షీ దేవికి పల్లకిపైన ఊరేగింపు జరుగుతుంది

ఐదవ రోజు ఉదయం 9 గంటలకు శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలకు స్నపన తిరుమంజనం జరుగుతుంది పిదప కపిలతీర్థ పుష్కరిణి తీరానికి శ్రీ చంద్రశేఖరస్వామి మనోన్మణి అమ్మవారలతోపాటు, శ్రీ త్రిశూల స్వామి కూడా ఊరేగింపుగా వస్తారు పిదప త్రిశూలస్వామికి స్నపన తిరుమంజనమయిన తర్వాత పుష్కరిణిలో స్నానం చేయిస్తారు ఆ త్రిశూల స్నాన సందర్భంలో అనేక మంది భక్తులు కూడ కపిలతీర్థంలో మునకలిడి పవిత్ర స్నానాలు చేస్తారు

సాయంత్రం యధాక్రమంగా ప్రదోషకాల పూజారాధనలు పూర్తి అయిన తర్వాత అర్చకస్వాములు ధ్వజస్తంభంపైన వున్న వృషభధ్వజాన్ని అవరోహణ చేస్తూ శ్రీకామాక్షీ కపిలేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలకు స్వస్తి వాచనం పలుకుతూ బ్రహ్మోత్సవానికి వచ్చిన దిక్పాలురకు, బ్రహ్మాది దేవతలకు వీడ్కోలు పలకడంతో బ్రహ్మోత్సవాలు మంగళప్రదంగా జయప్రదంగా పూర్తి అవుతాయి

ఆ రాత్రి 8 గంటలకు శ్రీసోమాస్కందమూర్తి రావణాసుర వాహనంపైన, శ్రీ కామాక్షీ దేవి పల్లకిపైన వేంచేసి, తిరుపతి పురవీధుల్లో సంచరిస్తూ అశేష భక్తులను నిండుగా అనుగ్రహిస్తూ, తిరిగి ఆలయంలో ప్రవేశిస్తారు

ఊరేగింపు అనంతరం బ్రహ్మోత్సవాల్లో పాలు పంచుకొన్న ఋత్విక్కులకు అర్చకస్వాములకు బహుమానంతో సత్కారం జరుపబడుతుంది

★★★★

## లక్ష్మీనృసింహగుహ

శ్రీ కామాక్షీ కపిలేశ్వరస్వామివారి దివ్యసన్నిధికి ఎదుటి దిశలో అనగా కపిలతీర్థ పుష్కరిణికి పశ్చిమ తీరంలో ఎత్తైన గుహాలయ వుంది దీన్నే ''శ్రీనరసింహస్వామి గుహ'' అంటారు

ఈ గుహలో శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి ఏక శిలామూర్తి ప్రతిష్ఠింప బడింది

**ఏకేన చక్ర మపరేణ కరేణ శంఖం**
**అన్యేన సింధు తనయా మవలంబ్య తిష్ఠన్**
**వామేతరేణ వరదాభయ హస్త ముద్రాం**
**లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్.**

అను శ్రీ శంకర భగవత్పాదులవారి నృసింహస్తోత్రానికి నిదర్శనంగా వరదాభయ హస్త ముద్రలతో శంఖ చక్రాలు ధరించి ఎడమతొడపై సమాసీనమై యున్న లక్ష్మీదేవితో విరాజిల్లుతూ వున్న శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి శిలామూర్తిని తాళ్లపాక పెదతిరుమలాచార్యులు ప్రతిష్ఠించాడని ప్రతీతి! సుమారు రెండడుగుల ఎత్తు వున్న ఈ శిలా విగ్రహమూర్తి యొక్క కుడిచేయి, కిరీటం కాలాంతరంలో భిన్నమైపోయాయి. ఈ విగ్రహం వెనుక గుహలో సొరంగ మార్గం వుంది, కాని గుహలోని రాళ్లు పడినందువల్ల కొంతవరకు మూసికొనిపోయింది

ఈ గుహాలయంలోనికి ప్రవేశించడానికి పుష్కరిణిలో నుంచి మెట్లు నిర్మించబడివున్నాయి గుహ యొక్క ముఖద్వారానికి చెక్కడపు శిలాద్వారం బంధం నిర్మించబడి వుంది గుహ ముఖద్వారానికి అనుబంధంగా వరుసకు మూడు స్తంభాల వంతున ఐదవరుసల శిలాస్తంభాలతో ముఖ మండపం నిర్మంపబడింది ఈ స్తంభాలన్నీ విజయనగర శిల్ప నైపుణ్యంతో ఎడనెడ వరాహ లాంఛనంతో విరాజిల్లుతూ వున్నాయి

ఈ లక్ష్మీనృసింహస్వామి గుహలో నుంచి నేరుగా వేంకటాచలానికి సొరంగ మార్గం వున్నట్లు జనశ్రుతి కథనం ఈ విషయాన్ని వరాహ పురాణాంతర్గ శ్రీవేంకటాచలమాహాత్మ్యం కూడా చాటుతున్నది

శ్రీనివాసుడు పద్మావతిని తనకిచ్చి వివాహం చేసే నిమిత్తమై ఆకాశరాజుతో మాట్లాడవలసినదని వకుళాదేవిని ఆదేశించి, ఆమెను నారాయణవనం వెళ్లగోరుతూ ఇలా అంటాడు

**"ఇతో గచ్ఛ మహాభాగే! శ్రీనృసింహగుహాయుతః**
**తన్మార్గేణావ తీర్యాస్మాత్ భూధరేన్ద్రాత మనోరమాత్"**

"పరమపూజ్యురాలైన వకుళాదేవీ! నీవు నృసింహ గుహ మార్గం గుండా దిగి వెళ్లుము" అని తెలియజేసిన ఆ నృసింహ గుహే ఇది ఈ గుహ మార్గం ద్వారానే వకుళమాత వేంకటాచలాన్నుండి దిగి కపిల తీర్థాన్ని దర్శించినట్లు భవిష్యోత్తర పురాణం కూడా తెల్పుతున్నది

ప్రస్తుతం ఈ గుహ కడ్డీల వాకిళ్లతో మూసి వేయబడినందువల్లన చూపరులెవరు ఈ గుహలోనికి వెళ్లడానికి వీలులేదు

## శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం

కపిలతీర్థ పుష్కరిణి మెట్లకు దక్షిణ దిక్కున వరుసకు ఏడు వంతున ఏడు వరుసలతో ఎత్తైన 49 రాతి స్తంభాలతో 50'X50'X16' ఘనపుటడుగుల వైశాల్యం కలిగిన రంగమండపం నిర్మింపబడింది ఈ రంగ మండపాన్నే "తీర్థవారి మండపం" అని కూడా అంటారు.

ఈ రంగ మండపం ప్రధాన ముఖమండపంగా చేసి రెండు ఆలయాలు నిర్మింపబడి వున్నాయి దక్షిణం దిక్కున అనుసంధించి ఉత్తరాభిముఖంగా ఇనుప కటాంజనం అమర్చబడి వున్న శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం ప్రధానమైంది

అలాగే రంగ మండపానికి పడమటి దిక్కున అనుకొని తూర్పుముఖంగా ఇనుప కటాంజనంతో వున్న శ్రీ లక్ష్మీ నారాయణస్వామి ఆలయం రెండవది

రంగ మండపాన్ని అనుకొని ఉత్తరాభిముఖంగా ఉన్న శ్రీ వేణు గోపాలస్వామి వారి ఆలయం ముఖమండపం, గర్భాలయం అని రెండు భాగాలుగా నిర్మింపబడింది వరుసకు నాలుగు రాతి స్తంభాల వంతున నాలుగు వరుసలతో మొత్తం 16 స్తంభాలతో నిర్మితమైన చతురస్రాకార ముఖమండపం నిర్మితమైంది ఈ స్తంభాలు ఎక్కువగా శిల్పశోభితం కాకపోయినా, కొన్నింటి మీద క్రింది భాగంలో ఆంజనేయస్వామి, విష్వక్సేనుడు, సంకీర్తనకారులు, కాళియమర్దన ఇలాంటి రమణీయ శిల్పాలు చోటుచేసుకొన్నాయి

ఈ ముఖ మండపాన్ని అనుకొని సుమారు 8 అడుగుల చతురస్రాకార గర్భాలయం వుంది ఈ గర్భాలయం శిలా ద్వారబంధానికి లోపలివైపున చెక్క తలుపులు, బయటివైపున కడ్డీల తలుపులు బిగించబడినాయి ఈ గర్భాలయం మధ్యభాగాన శ్రీ రుక్మిణీ సత్యభామా సమేతంగా శ్రీ వేణుగోపాలస్వామివారి మనోహరమైన శిలామూర్తి ప్రతిష్ఠింపబడింది

ఈ వేణుగోపాలస్వామి చతుర్భుజుడై స్థానక (నిలిచివున్న) భంగిమలో దర్శనమిస్తున్నాడు పై కుడి ఎడమ చేతుల్లో వరుసగా చక్ర శంఖాలను, క్రింది కుడి ఎడమ చేతుల్లో వేణువును ధరించి నోటితో మ్రోగిస్తున్నాడు ఎడమకాలుపై నిలిచి, కుడికాలును కొద్దిగా మడచి, ఎడమకాలి అవలివైపున మునివేళ్లపై నిలిచి ''స్వస్తికాసనం''లో కిరీటాది సర్వాభరణాలతో నయనానందకరంగా దర్శన మిస్తున్నాడు. శ్రీ స్వామివారికి శిలా మకర తోరణం కూడా మలచబడింది మకర తోరణంతో కూడా సుమారు ఆరు అడుగుల ఎత్తు వున్న శ్రీ వేణుగోపాలస్వామివారి శిలామూర్తికి కుడిప్రక్కన ఎడమ చేతిలో కమలాన్ని ధరించి కుడిచేతిని వయ్యారంగా క్రిందికి వ్రేలాడదీసిన (లంబితంగా) రుక్మిణీదేవి నిలిచివున్న శిలా

విగ్రహం, అలాగే ఎడమ ప్రక్కన కుడిచేతిలో కమలాన్ని ధరించి, ఎడమచేతిని వయ్యారంగా క్రింది వేలాడదీసిన (లంబితంగా) సత్యభామా దేవి నిలిచివున్న శిలా విగ్రహం చోటు చేసికొని వున్నాయి

ఈ ఆలయంలో శిలామూర్తులతో పాటు సుమారు 21/2 అడుగుల ఎత్తు వున్న శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామి వారి పంచలోహ ఉత్సవ ప్రతిమలు కూడా ఉన్నాయి

వైఖానస ఆగమ శాస్త్రోక్తంగా అర్చనాదులు జరిగే ఈ వేణుగోపాలస్వామి ఆలయ నిర్మాణం ఎప్పుడో జరిగిందో నిక్కచ్చిగా తెలియరావడం లేదు పూర్వం వున్న శ్రీ వేణుగోపాలస్వామివారి విగ్రహం కొంచెం భిన్నంకాగా, వాటి స్థానంలో 1998 జూన్‌లో మళ్లీ కొత్త విగ్రహాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రతిష్ఠించింది

ప్రతిరోజు శ్రీవేణుగోపాలస్వామివారికి మూడుపూటలా అర్చన నివేదనలు జరుగుతున్నాయి ఉదయం పూట, దధ్యోదనం, మధ్యాహ్నం, శుద్ధాన్నం, రాత్రి ముళహోర (మిరియప్పొంగలి) నివేదింపబడతాయి ఈ వేణుగోపాలస్వామివారి నివేదన కోసం ప్రత్యేకంగా ఈ ఆలయానికి తూర్పు దిక్కున వంటశాల కూడ వుంది

శ్రీ వేణుగోపాలస్వామికి శ్రీకృష్ణాష్టమిరోజున విశేషంగా శ్రీ వేణుగోపాల స్వామి వారలకు అభిషేకార్చనలు జరుపబడడమేగాక పులిహోర, అప్పం, దోసె, చక్కెర పొంగలి, నువ్వులపిండి మున్నగు ప్రసాదాలు నివేదింప బడతాయి పిదప అ సాయంత్రం పూలమాలలతో సర్వాభరణాలతో అలంకరింపబడిన శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామివారికి తిరుపతి పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుంది

శ్రీ వేణుగోపాలస్వామి గర్భాలయంపైన ఏకకలశ గోపురం నిర్మితమైంది ఈ గోపురంపైన ఉత్తరాభిముఖంగా శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామి సిమెంటు శిల్పాలు ఏర్పాటు చేయబడినాయి

ప్రతి సంవత్సరం శ్రీ కోదండరామస్వామి వారి బ్రహ్మోత్సవంలో చివరి రోజున సౌరమానం ప్రకారం మీనమాసం మృగశీర్షా నక్షత్రం రోజున ఆళ్వారు తీర్థం (కపిలతీర్థం)లోని శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ ముఖమండపానికి

వేంచేస్తారు ఈ మండపంలోని శ్రీ సీతారామలక్ష్మణ సమేతంగా శ్రీ కోదండరామ స్వామివారికి, సుదర్శన చక్రత్తాళ్వారుకు స్నపన తిరుమంజనం జరిగిన తర్వాత పుష్కరిణీ తీర్థంలో చక్రస్నానం జరుపబడుతుంది

అలాగే ప్రతి సంవత్సరం వృషభ మాసంలో జరిగే శ్రీ గోవిందరాజస్వామి వారి బ్రహ్మోత్సవాల్లో చివరి రోజున అనగా అనూరాధా నక్షత్రం రోజున జరిగే చక్రస్నానానికి, శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ గోవిందరాజస్వామి, సుదర్శన చక్రత్తాళ్వారు ఈ మండపానికి వేంచేయగా తిరుమంజనాదులు జరిగిన తర్వాత చక్రస్నానం నిర్వహింపబడుతుంది

ఇక శ్రావణ పౌర్ణమి జంధ్యాల పండుగనాడు కూడా శ్రీ గోవిందరాజస్వామి, శ్రీకృష్ణస్వామి, శ్రీ సుదర్శన భగవానులు వేర్వేరు పల్లకిలపై వేంచేసి ఇక్కడి వేస్తారు ఇక్కడ తిరుమంజనాదులు నిర్వహించిన తరువాత యజ్ఞోపవీతధారణ అయిన తర్వాత ఘనంగా నివేదనాదలు జరిగిన తర్వాత తిరిగి ఆలయానికి వెళతారు

కార్తీక పౌర్ణమి రోజున, శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ గోవిందరాజస్వామి, అలాగే అధ్యయనోత్సవంలో కూడ ఆళ్వారులతో కూడి ఈ మండపానికి వేంచేస్తారు ప్రతి సంవత్సరం కనుమ పండుగరోజు గోవిందరాజస్వామి ఆలయం నుండి శ్రీ గోదాదేవి (ఆండాళ్) ఆళ్వార్ తీర్థానికి విచ్చేసి ఈ మండపంలో తిరుమంజనాదులు ముగించుకొని, ముత్తైదువులకు పసుపు, కుంకుమ, తాంబూలాది వాయనదానాలిచ్చి తిరిగి ఆలయం చేరుకొంటుంది

## తణ్ణీరముదు ఉత్సవం

తిరుమల క్షేత్రంలో ప్రతి సంవత్సరం వైకుంఠ ఏకాదశి నాటికి 11 రోజుల ముందుగా ప్రారంభమై 24 రోజుల పాటు అధ్యయనోత్సవాలు జరుపబడుతాయి. ఈ ఉత్సవాల్లో విశేషంగా ఆళ్వారుల దివ్యప్రబంధ పారాయణలు జరుగుతవి. చివరి రోజున తణ్ణీరముదు ఉత్సవం (అమృత జలోత్సవం) జరుగుతుంది. తిరుమలలో ఈ ఉత్సవాలు పూర్తి అయిన తర్వాత తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలో కూడ అధ్యయనోత్సవాలు 24

రోజుల పాటు జరుపబడుతున్నవి చివరి రోజున "తణ్ణీరముదు ఉత్సవం" నాడు శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ గోవిందరాజస్వామి ఒక పల్లకిపైన, ఆళ్వార్లు వేర్వేరు పల్లకిలపైన వేంచేసి ఊరేగింపుగా ఆళ్వారు తీర్థా(కపిలతీర్థం)నికి వేంచేస్తారు అక్కడ శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ ప్రాంగణంలో ఈ ఉత్సవమూర్తులన్నింటికీ అభిషేకార్చనలు, నివేదనలు ఘనంగా జరుపబడిన తర్వాత, తిరిగి ఆలయానికి వెళ్లడంలో 'తణ్ణీరముదు ఉత్సవం' పూర్తి అవుతుంది

★★★★

## శ్రీ లక్ష్మీనారాయణస్వామి ఆలయం

కపిలతీర్థ పుష్కరిణికి దక్షిణ దిక్కున వున్న రంగమండపానికి (తీర్థవారి మండపం) అనుసంధించి తూర్పుముఖంగా శ్రీ లక్ష్మీనారాయణ స్వామివారి చిన్న ఆలయం వుంది

ముఖ మండపం, గర్భాలయం అని రెండు భాగాలుగా నిర్మింపబడిన ఈ ఆలయంలో సుమారు నాలుగడుగుల ఎత్తు వున్న శ్రీ లక్ష్మీనారాయణస్వామి వారి శిలా విగ్రహం ప్రతిష్ఠింపబడింది పాంచరాత్రాగమం ప్రకారం పూజలు నిర్వహింపబడుతున్న ఈ విగ్రహాన్ని తాళ్లపాక అన్నమాచార్యుల కుమారుడు పెద్ద తిరుమలాచార్యులు ప్రతిష్ఠించినట్లు శాసనాలు స్పష్టం చేస్తున్నాయి అలాగే శాలివాహన శకం 1468 ప్రభవ నామ సంవత్సరం మిథున మాసంలో అనగా 20-6-1546 తేదీన ఈ లక్ష్మీ నారాయణస్వామివారికి దైనందిన నివేదనకోసం, సాయంకాల నిత్య దీపారాధన కోసం పెద్ద తిరుమలాచార్యులు ఏర్పాటు చేశాడని కూడ తెలుస్తున్నది అంతేకాక తమిళ, వైకాశి, ఆణి, మాసి నెలల్లో ప్రత్యేకంగా నివేదనల కొరకు ఏర్పాట్లు జరుపబడినట్లు కూడ స్పష్టమవుతున్నది కాలాంతరంలో ఆ ఏర్పాట్లు ఆగిపోయాయి

చతుర్భుజుడై శంఖ చక్రాలతోను, అభయహస్తంతోను, ఎడమ తొడపై లక్ష్మీదేవిని కూర్చొనబెట్టుకొన్నట్లుగా వున్న ఈ ఏకశిలా విగ్రహమూర్తి అయిన శ్రీ లక్ష్మీనారాయణ స్వామి చూపరులకు అత్యంత గమణీయంగా దర్శన మిస్తున్నారు ఈ లక్ష్మీనారాయణస్వామివారి గర్భాలయంపై ఏకకలశ గోపురం నిర్మించబడింది

గర్భాలయానికి ముందు, వరుసకు నాలుగు స్తంభాల వంతున నాలుగు వరుసలతో 16 రాతి స్తంభాల చతురస్ర ముఖ మండపం నిర్మింబడింది ఈ స్తంభాలపైన ఆంజనేయస్వామి, గరుత్మంతుడు, కాళింగమర్ధన భగవద్రామానుజులు, శంఖం, చక్రం మున్నగు శిల్పాలు చెక్కబడినాయి

ఈ ఆలయంలో అర్చనాది కార్యక్రమాలు ప్రతిరోజు నిర్వహింపబడు తున్నాయి

★ ★ ★ ★

## శ్రీ కామాక్షీ నందనవనం

శ్రీ వేణుగోపాలస్వామి గుడికి వెనుక భాగంలో శ్రీ కామాక్షీ నందనవనం పేరుతో ఉద్యానవనం నిర్మింపబడింది ఈ తోటలో మారేడు (బిల్వం) చెట్లు, శివలింగ పుష్పాలచెట్టు వున్నాయి

కపిలమహర్షి శివలింగ పుష్పాలతోనే కపిలేశ్వరస్వామివారికి అర్చించినట్లు చెప్పబడినది అందువల్లే శివలింగం (నాగలింగం) పుష్పాల చెట్టు ఈ కపిలేశ్వర క్షేత్రంలో ''స్థలవృక్షం''గా ప్రసిద్ధిపొందింది

★ ★ ★ ★

## నమ్మాళ్వారు గుడి

కపిలతీర్థం నుండి వెలుపలికి వస్తున్న మార్గంలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయానికి వెనుకగా శ్రీ కామాక్షీ నందనవనం వుంది ఈ నందనవనాన్ని ఆనుకొని దక్షిణం దిక్కున ఎత్తైన ప్రాకారంతో, ప్రవేశ గోపుర మండపాదులతో పశ్చిమాభిముఖంగా నిర్మింపబడిన శ్రీ నమ్మాళ్వారులవారి ఆలయం మనకు దర్శనమిస్తుంది ఈ ఆలయంలో ఆసీన భంగిమలో వున్న నమ్మాళ్వారుల వారి శిలామూర్తి ప్రతిష్ఠింపబడింది

క్రీస్తుశకం 13వ శతాబ్దంలో ఈ ఆలయ శిఖరాన్ని మండపాలను పాండ్య మండలంలోని ''తంజలూర్'' గ్రామనివాసి పల్లవరాయన్ అని పిలువబడే వానెదుత్తకైయాలగియార్ అనే వ్యక్తి నిర్మించినట్లు శాసనాలు తెలుపుతున్నాయి 1285-86 ప్రాంతంలో పై వ్యక్తి ఈ నమ్మాళ్వార్ ఆలయానికి గాను కడపజిల్లా నందలూరు వద్ద ''రామానుజ తిరునందనవనం'' అనే పేరుతో ఒక పుష్పతోటను పెంచినట్లు కూడా తెలుస్తోంది

ఈ ఆలయానికి ప్రత్యేకమైన నిధి వుండినట్లు 'వంటశాల' వున్నట్లు విశేషమైన ఉత్సవాలు జరిగినట్లు కూడా ఆధారాలు కనపడుతున్నాయి ఈ గుడిలో 1 2 రోజులపాటు నమ్మాళ్వార్ అధ్యయనోత్సవాలు వైభవంగా జరిగేవి 1514 ప్రాంతంలో పత్తర్పిరానయ్యన్ అనే శ్రీ వైష్ణవ శాత్తాద ఏకాంగి 12 రోజుల పాటు జరిగే అధ్యయనోత్సవాల్లో 11వ రోజున దివ్యప్రబధ పారాయణకు, నివేదనకుగాను 150 పణాలు నిధిని ఏర్పాటు చేశాడు

ఒకప్పుడు ఎంతో వైభవంగా ఉత్సవాలతో వెలిగిన ఈ నమ్మాళ్వార్ గుడి గర్భాలయ, శిఖరాదులు అన్నీ శిథిలమయ్యాయి ఇందులో నమ్మాళ్వారు వారి విగ్రహం వున్నప్పటికీ పూజలు ఏ మాత్రం జరగడం లేదు

★ ★ ★ ★

## ఆంజనేయస్వామి మండపం

నమ్మాళ్వారు గుడికి ఆనుకొని దక్షిణ దిక్కున రమణీయమైన శిలా స్తంభాలతో నిర్మింపబడిన ఒక మండపం వుంది ఈ మండపంలో దక్షిణాభి ముఖంగా ప్రతిష్ఠింపబడిన శ్రీ వీరాంజనేయస్వామి వారి శిలా ప్రతిమ వుంది ఈ విగ్రహాన్ని మధ్వమతాచార్యులయిన వ్యాసరాయలు( 1 6వ శతాబ్దం) నిర్మించినట్లు ప్రతీతి ఇదేగాక తిరుపతి గ్రామానికి చుట్టూ పొలిమేరల్లో ఇలాంటి ఆంజనేయస్వామి విగ్రహాలను ఆయన ప్రతిష్ఠించినట్లు కూడా చెప్పబడు తున్నది సుమారు 5 0 ఏండ్లకు పూర్వం ఒక మధ్వ బ్రాహ్మణుడు పూజించినట్లు, చుట్టూ తెరవబడినట్లు నిర్మించిన ఈ మండపానికి ఇనుప కటాంజనం ఏర్పాటు చేయబడింది

ప్రతి సంవత్సరం దసరా రోజు శ్రీ కపిలేశ్వరస్వామి 'పారువేట'కై ఈ మండపంలోనికి వేంచేస్తారు.

★ ★ ★ ★

# శ్రీ కపిలేశ్వర సుప్రభాతమ్

రచయిత
శ్రీ ఎం వి. రామనాథఘనాపాఠి,
యజుర్వేద ప్రధానాధ్యాపకులు,
శ్రీ వేంకటేశ్వర వేదకళాశాల,
తి తి దేవస్థానములు, తిరుపతి

---

కపిలేశ్వర దేవేశ ప్రాతస్సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ కపిలారాధ్య త్రైలోక్యం మంగళంకురు – 1

పాతాళోత్థిత లింగేశ వృషభధ్వజ హే ప్రభో
కామాక్షీవల్లభోత్తిష్ఠ జగతాం మంగళం కురు – 2

పాతాళలింగ కపిలేనసుపూజితస్త్వం
భూమిం విభిద్య సహసా పరివర్ధమానః
శ్రీ వేంకటాద్రి కుహరే భువిచావిరాసీః
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 3

త్వత్పార్శ్వభాగ గిరి నిర్ఝర పూతధారా
హ్యంతర్య కష్టమఖిలం వినివారయంతీ
అంతర్మనస్యతి కుతూహలమాతనోతి
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 4

త్వద్భక్తి యుక్త కపిలాఖ్య మునేః ప్రభావాత్
తత్ ప్రార్థనా మనుగతే కపిలాఖ్య తీర్థే
స్నాత్వా వసంతి సుజనాస్తవ దర్శనార్థమ్
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 5

విఘ్నేశ్వరం ప్రథమతః ప్రణమంతిసర్వే
శ్రీ షణ్ముఖం చ తదనంతర మేవ భక్తాః
త్వద్దర్శనం విదధతే భవమోచనాయ
కామ్యాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 6

---

*1972లో నూతనంగా నిర్మింపబడిన శ్రీ కపిలేశ్వరస్వామివారి అలంకార, కల్యాణ మండపాలు మరియు దేవాలయ పునరుద్ధరణ కుంభాభిషేకాదుల సందర్భంగా "శ్రీ కపిలేశ్వర సుప్రభాతము" ను తి తి దేవస్థానం యజుర్వేధాధ్యాపకులు, మహాకవి శ్రీ ఎం వి రామనాథ ఘనాపాఠి గారు రచించారు ఇది అప్పట్లో దేవస్థాన ముద్రణగా వెలువడింది*

శ్రీమాతరం శివసమాదృత భాగ్యమూర్తిమ్
కామాక్ష్యభిఖ్య శివశక్తి మనుస్తువంతి
సవన్ త్వదీయ మహిమా జగతి ప్రసిద్ధః
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 7

శ్రీ వేంకటేశ్వర వివాహవినిశ్చయార్థమ్
శ్రీ వేంకటేశ వచసా వకుళా యయాచే
తత్ ప్రార్థనామసు వివాహ పరప్రదాతః
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 8

బ్రహ్మాస్త్వయం పశుపతే పశురూపమేత్యా
క్షీరాభిషేక మకరోత్కిల పూర్వమత్ర
గోపాలరూపమధిగచ్ఛతి కేశవోపి
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్ – 9

తల్లింగ ఏవ వసతామితి యాచితౌ తౌ
తాదృక్ ప్రభావ మునినా విధికేశవౌ స్తః
మూర్తిత్రయాత్మక మహేశ్వర లింగరూప
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రభాతమ్॥

భూలోకనాథ కపిలేశ్వర సుప్రభాతమ్
శ్రీరామనాథ వరభక్త కవి ప్రణీతమ్।
భక్త్యా స్త్వయం ప్రతిదినం భువియే పఠంతి
సంప్రాప్ను వంతి పరమాం సకలార్థ సిద్ధిమ్॥

## ధ్యానం

కూర్మస్యో పరిసుస్థితే ఫణిపతౌ తన్మూర్ధ్ని భూమాస్థితమ్
లింగం గోః పయసాభిషేచకమజం గోపాలరూపం హరిమ్।
తత్రైవం కపిలర్షిణా పరమయా భక్త్యాసుమైః పూజితమ్
దృశ్యం చిత్రమహో త్రిమూర్తి మిళితం ధ్యాయామి లింగోత్తమమ్।

శ్రీనివాస ఉవాచ.

త్వం గర్భాధః ప్రదేశే చ కాపిలం లింగముత్తమమ్।
తత్రాస్తే తీర్థరాజోయః కపిలేశ్వర సన్నిధౌ॥

తత్ర స్నాత్వా యథా యోగ్యం మదర్థం తీర్థపుంగవే।
కపిలేశ్వర మాసాద్య యాచ్యతాం పరమవ్యయమ్॥

శ్రీనివాసేన బాలేన సదా కల్యాణ కాంక్షిణా।
ప్రేషితాహం తదర్థంవై కురుమే ఽభీప్సితం ప్రియమ్॥

ఇతి భవిష్యోత్తర పురాణే ప్రోక్తం

★★★★

## శ్రీ కపిలేశ్వర స్తోత్రమ్

కపిల మహాముని పూజిత లింగం
సకల సురాసుర వందిత లింగమ్
భువిజన రక్షణ కారణ లింగం
నమత మహా కపిలేశ్వర లింగమ్

పాతాళాద్భువిచోత్థిత లింగం
నిర్ఝరపాత విరాజిత లింగమ్
సిద్ధి వినాయక షణ్ముఖ లింగం
నౌమి మహా కపిలేశ్వర లింగమ్

వేంకట నాయక మానిత లింగం
ప్రేరిత వకుళా ప్రార్థితలింగమ్
వైవాహిక మను మోదక లింగం
నౌమి మహాకపిలేశ్వర లింగమ్

కాలకూట విషభూషణ లింగం
కాలనివారణ కారక లింగమ్
కాలచక్ర పరిసేవిత లింగం
నౌమి మహా కపిలేశ్వర లింగమ్

బ్రహ్మ మురారి మహేశ్వర లింగం
సృష్ఠి స్థితి లయ కారకలింగమ్
సర్వదోష పరిహారక లింగం
నౌమి మహా కపిలేశ్వర లింగమ్

శ్రీ మదగస్త్య సునామక లింగం
కోటిలింగ పరిసూచక లింగమ్
భాస్కరమండల భాసక లింగం
నౌమి మహా కపిలేశ్వర లింగమ్

★ ★ ★ ★

## శ్రీ కపిలేశ్వర ప్రపత్తిః

పంచాక్షరీ మనునివాస మఘోర రూపం
పంచాననం భగవతీ గిరిజా సమేతమ్
చంద్రార్క వహ్నినయనం జటిలం మహేశం
చంద్రార్ధచూడ శిరసం శరణం ప్రపద్యే

ఢక్కాం మృగం వరదమగ్నిశిఖాం ధరంతం
భక్తార్తి భంజన చణం సకలార్థదం తమ్
దుష్టస్య ఖండన విధౌ పటు రుద్రమూర్తిం
మూర్తి త్రయాత్మ కపిలేశ మహం ప్రపద్యే

సృష్టి స్థితి ప్రళయకేళి విలోల మీశం
వేదైక వేద్య మహిమానమచిన్త్యమూర్తిమ్
ఓంకార రూప మఖిలాగమ తత్వసారం
జ్ఞాన ప్రదం శివహం శరణం ప్రపద్యే

నేత్రేందునా సకలతాప విమోచకం తం
నేత్రాగ్నినా పకలశత్రు నిబహణం చ
నేత్రార్కశక్తి లయ రక్షణ సృష్టి హేతుం
కామాక్ష్యధీశ కపిలేశమహం ప్రపద్యే

హంస స్వరూప ముపయాతి హి సోహమేత్య
శ్రీరామనాథ కవిమానస రాజహంసః
కామాక్ష్యధీశ కపిలేశ్వర సుప్రపత్తిం
నిత్యం పఠంతు మనుజాస్సకలార్థ సిద్ధ్యై

★ ★ ★ ★

## శ్రీ కపిలేశ్వర మంగళమ్

విఘ్నేశ్వరాయ దేవాయ
శర్వపుత్రాయ మంగళమ్
వల్లీసేనా సమేతాయ
సుబ్రహ్మణ్యాయ మంగళమ్

శ్రీకామాక్ష్యై జగన్మాత్రే
మహాదేవ్యైచ మంగళమ్
కపిలేశ్వర రూపాయ
మహాదేవాయ మంగళమ్

పాతాళలోకాదుద్భూాయ
భక్తానుగ్రహకారిణే
భూలోక నిత్యవాసాయ
దేవ దేవాయ మంగళమ్

నమశ్శివాయ శాంతాయ
సర్వాభీష్ట ప్రదాయినే
అగస్త్యేశ్వర లింగాయ
కోటి లింగాయ మంగళమ్.

ఆది మధ్యాంత శూన్యాయ
మహాప్రళయ సాక్షిణే.
పంచ బ్రహ్మ స్వరూపాయ
త్ర్యంబకాయ చ మంగళమ్

వేంకటాద్రేః పరిసరే
కపిలాఖ్య సరస్తటే.
గిరినిర్ఝర సుప్రాంతే
నిత్యవాసాయ మంగళమ్

కైలాస శిఖరావాస
పరబ్రహ్మ స్వరూపిణే
కామాక్షీ వల్లభాయాస్తు
కపిలేశాయ మంగళమ్

★ ★ ★ ★

## శ్రీ కపిలేశ్వర బ్రహ్మోత్సవం

### శేష వాహనం

రచన · గరిమెళ్ల బాలకృష్ణప్రసాద్, తిరుపతి.

ఆదితాళం

శేషవాహనమ్మున శివుడదే సతితో;
శేష వైభవముల వెడలెను కనరే

భాషాపతి లక్ష్మీపతియును మరి
వాసవాది దేవతలు జయవెట్ట॥ ॥ శేష ॥

విసపు తలపులతో విలవిలలాడే
దెసల మానవుల దైన్యము వాపగ
అసమ నేత్రముల అభయము నెరపుచు
విసుపు లేక రెండువేల నాలుకలు గల॥ ॥ శేష ॥

హరికిని తనకును అంతరము లేదను
పరమ సత్యమును పగటు సేయగా
హరికి పరియంకమైన శేషుని – ఆ–
భరణముగ దాలిచి పరమానందమున ॥ శేష ॥

---

*శ్రీ కపిలేశ్వరస్వామి బ్రహ్మోత్సవం, కల్యాణోత్సవం, డోలోత్సవం కీర్తనలను తి తి దేవస్థానం అన్నమాచార్య ప్రాజెక్టు గాత్ర విద్వాంసులు శ్రీ గరిమెళ్ల బాలకృష్ణప్రసాద్ రచించడమే గాక, పై సందర్భాల్లో శ్రీ కపిలేశ్వరాలయంలో గానం చేస్తున్నారు*

సిరుల బాలకృష్ణుని కీర్తనములు
విరులమాల ధరియించిన వేలుపు
ధర వెలసిన కైలాసం బే యనగ
తిరుపతి పురమున దేవాదిదేవుడు ॥ శేష ॥

## నంది వాహనం

నంది వాహనముపైన నయముగ వెడలె
సందడి కపిలేశ్వరుని సకల జనులు కనరే

సకల సురలు జయవెట్ట సరసను కామాక్షితో
ప్రకటమైన వేదఘోష పది దిక్కుల మ్రోయగా
అకలంక భక్తితో అంగన లారతు లెత్తగ
ఒకపరి కొకపరి మించిన వొయ్యారములతో ॥ నంది ॥

ప్రణవ రూపుడైన శివుడు పరిపరి విభవములతో
గణము లెల్ల పరవశాన కడు వింతగ నాడగా
ప్రణతు లందుకొనుచు భక్తపాలనా తత్పరుడై
ఫణిహారము లల్లలాడ పరమానందముగా ॥ నంది ॥

అరుదుగా పురవీధులందు నాస దీరగా
గరిమలు మీరగ నిటువలె గౌరీపతి వేడ్కగా
శరణాగత వత్సలుడని శంకరుడని నుతియించే
చరణా శ్రితులందరికి చల్లని వరములు కురియుచు ॥ నంది ॥

## చంద్రప్రభ వాహనం - (చతురశ్రనడ)

చంద్ర ప్రభ వాహనముపై చల్లగ సాగుమురా
చంద్ర శేఖరా మాకు నీవె అండరా

గరళమును మింగిన నాటి కాకలు చల్లారగా
వర జటాజూటమునందు వంక నుంచుకొన్నావో
సరిలేని త్యాగ నిరతితో సకల లోక జీవుల గాచే
వరదుడవు వరగుణశీలివి వందనములు గైకొనరా ॥ చంద్ర ॥

మూడు కన్నులవాడ ముల్లోకములరేడ
చూడ చూడ కన్నుల విందౌ సుందరాకారా
వేడుకలు మిన్నుముట్టగా వేదఘోషములు చెలగ
పాడగా పార్వతి గూడి బాలకృష్ణనుతులను గొనుచు ॥ చంద్ర ॥

## రావణబ్రహ్మ వాహనం

ఇంత వింత వాహనము ఎచ్చోట కానము
మంతనాన మహేశ్వరుడు మహిలో రావణునెక్కె

భక్తుడైనగాని, శక్తియుక్తుడైన గాని, వి-
రక్తుడై సేవించుటే రాజ్యప్రదమని తెలిసి
ముక్తి కాముకుండైన దశకంఠుడు వాహనముగా ప్ర-
పత్తితో ధన్యుడై ప్రపంచమున కీర్తినందె ॥ ఇంత॥

తన భక్తుని ప్రీతితో వాహనముగ చేకొని
కనువిందుగ ఊరేగెను కపిలేశ్వరు డరుదుగా
తన తనువే నాదమైన నటరాజును పైకొని
మనకొక సేవా మార్గము చూపినాడు రావణుడు ॥ ఇంత॥

★ ★ ★ ★

## కామాక్షి కపిలేశ్వరుల కల్యాణోత్సవం - (మిశ్రగతి నడక)

సోబాన పాడరమ్మా సుదతులూ
సోబాన పాడరమ్మా ॥ సోబాన॥

కామాక్షీదేవి కపిలేశ్వరుల దివ్య
కల్యాణ శుభముహూర్తము నేడే యనుచు ॥ సోబాన॥

శ్రీలక్ష్మి స్వయముగా సింగారములు చేసి
శ్రీ పార్వతీ సతిని పెండ్లి కూతురు జేసె ॥ సోబాన॥

భారతీదేవియే భవ్యముగ వీణపై
సారతర సంగీత స్వరగతుల పలికించె ॥ సోబాన॥

ముల్లోకములనుగల ముత్తైదువలు చేరి
చల్లంగ దృష్టి తీసేరు దంపతులకు (గౌరీశులకు) ॥ సోబాన॥

బాలకృష్ణుని నవ్యకృతుల నంకితముగా
చాల ప్రియమున గొన్న శివపార్వతుల కిపుడు ॥ సోబాన॥

★ ★ ★ ★

## డోలోత్సవం

కపిలేశ్వరా మాకు కనువిందుగా
అపరంజి ఊయలలో హాయిగా ఊగుమా

కలికి మాయమ్మ బంగారు కామాక్షమ్మ
పలుమారు నిను తాకి పరవశించంగా
చెలులగూడి అదవ శ్రీదేవి భారతులు
ఎలకోయిలల రీతి ఎలుగెత్తి పాడగా

దేవకామినులు అందియలు ఘల్లుఘల్లనగ
సావధానమున మిమ్ము చక్కగా నూచగా
భావమున నిను దలచి బ్రహ్మాది సురలెల్ల
చేవమీరిన పలుకులచే మిమ్ము నుతించగా

నారాయణుడే సరసన నయముగా నిలువగా
అరసి లోకములెల్ల అచ్చెరువొందగా
బోరున మా పాపరాశి పొలసి పోవగా ఇంతట
చేరి కొల్చి తరించితిమి చెంతనే కృష్ణ(వి)నుత

## డోలోత్సవం

ఉమామహేశ్వరు లూయల లూగే
క్రమము కనులార గనరే – వైభవ
క్రమము కనులార గనరే..

పసిడి పాలిండ్ల పయ్యెదలు జార
అసియాడ నడుము లతివ లూపగా
కొసరు సరసములు కొదలేక విరియ
రసికత మీరుచు రాజస మొప్పుచు
చిరుచిరునవ్వుల జిగిమీరిన తమ
తిరుముఖ కాంతుల తిమిరము చెరచుచు
హరియు విరించియు ఔనని మెచ్చగ
అరుదగు వరముల నందరి కొసగుచు
వేదఘోషలు వివిధ కీర్తనములు
నాదించి నదె నయముగను
మోదంబున ఆమోదము దెలుపుచు
సాధు బాలకృష్ణ నుతుల గొనుచును

★ ★ ★ ★ ★





